# విదేశీ ఖాతాల విశేషాలు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

నా మిత్రుడు మధుదండావతే మామూలుగా అయితే సౌమ్యంగా ఉండే వారే గాని పెయిర్ ఫాక్స్ వ్యవహారంపై చర్చను ప్రారంభిస్తూ మొన్న ఆయన తమ సాధు స్వభావాన్నంతా వదుల్చుకున్నారు బ్రహ్మదత్ కేవలం ఇటలీకి మాత్రమే వెళ్ళినట్టు కనబడుతుండగా ఆయన ఇటలీకి స్విట్జర్లాండ్‌కు వెళ్ళారని మధు దండావతే అన్నారు ఆర్థిక మంత్రి (అప్పటి ఆర్థిక మంత్రి ప్రస్తుత ఆర్థిక మంత్రి కాదు) విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ జనవరి 22 న ఒక ఫైలుతో వెళ్ళి ప్రధానమంత్రిని కలిశారనీ తర్వాత రెండు రోజులకే ఆయన మంత్రిత్వ శాఖ నుంచి బదిలీ చేయబడ్డారనీ దండావతే అన్నారు రాజీవ్ గాంధీకీ విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్‌కూ మధ్య ఏం జరిగింది? దండావతేకు తెలియదు కాని ప్రస్తుతం నేను ఆ మొత్తం కథను చెప్పగలను నేనా సమావేశానికి హాజరు కాకపోయినప్పటికీ

ఆ ఫైలు నెంబరు ఆర్థిక మంత్రిత్వ శాఖ ఫోరెక్స్-420 ఆ ఫైలు 1986 ఏప్రిల్ 1 న మొదలయింది అది ఏప్రిల్ ఫూల్ డే నాడు మొదలయిందని మీరనుకోవచ్చు గాని నిజానికి కొత్త ఆర్థిక సంవత్సరానికి అదే మొదటి రోజు

మీ పరిశోధనల్లో ఆశ్చర్యకరమైనటువంటి సంగతు లేమన్నా కనిపెట్టారా అని రాజాసాబ్‌ను రాజీవ్ అడిగారు

ఔను కనిపెట్టాం జ్యోతి బసుకు విదేశీ ఖాతా ఉన్నది అన్నారు సింగ్

జ్యోతి బసుకా? అని అడిగారు రాజీవ్

యుద్ధానికి ముందు జ్యోతి బసు లండన్‌లో చదువుతూ ఉన్న రోజులలో ఆ ఖాతా తెరిచారు బహుశా ఆయన దాన్ని మూసి వేయడం మరిచి పోయినట్టున్నారు జగ్జీవన్‌రామ్‌తో సహా రాజకీయ వాదులందరికీ సహజమైనటువంటిదే గదా ఈ మతిమరపు

జ్యోతి బసు ఖాతాలో ఎంత నిలువ ఉంది అనడిగారు ప్రధాని

8 43 902 పౌండ్లు అంటే ప్రస్తుతం దాదాపు కోటిన్నర రూపాయలవుతుంది అని జవాబిచ్చారు రాజాసాబ్

పశ్చిమ బెంగాల్‌లో సి పి ఐ (ఎం) విజయానికి కారణమేమిటో ఇప్పుడు తెలిసిపోయింది వోటర్లకు మనం రూపాయల్లో ఇవ్వగా వాళ్ళు విదేశీ కరెన్సీ ఇచ్చారన్న మాట కాని జ్యోతి బసుకు అంత డబ్బు ఎక్కడ్నుంచి వచ్చింది? అన్నారు ప్రధాని

1937 లో ఆయన లండన్ వదిలేసినప్పుడు ఆయన ఖాతాలో 10 పౌండ్లు నిలువ ఉంది ఇప్పటికి యాభై సంవత్సరాలు గడిచిపోయింది గద వడ్డీలు వగైరాలు అన్నీ కలుపుకుంటే ఆ నిలువ ఇంతయింది

ఇంకేమన్నా విశేషాలున్నాయా? అని అడిగారు ప్రధాని

మిలాన్‌లో ఎన్ టి రామారావుకు ఖాతా ఉంది అని జవాబిచ్చారు విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్

రామారావుకా? అని ప్రధాని అడిగారు

ఔను అది స్నామ్ స్నామ్ సర్కస్ అనే సంస్థతో కలిసి ఏర్పరచుకున్నటువంటి ఉమ్మడి ఖాతా అది ఎట్లా జరిగిందంటే నటుడు కాకముందు రామారావు ఒక సర్కస్ నడిపేవారు ఒక సంవత్సరం ఆయన తన సర్కస్‌ను మిలాన్ తీసుకు వెళ్ళారు అక్కడ భారతదేశపు ఏనుగులన్నా ఎలుగు బంట్లన్నా చాల మోజు ఉండేది రామారావు అక్కడ డబ్బుకు ఇబ్బంది ఎదురై ఏనుగులకు ఆహారం పెట్టలేక పోయారు కనుక ఆయన క్వాట్రొచ్చి అనే ఒక వ్యక్తి దగ్గర డబ్బు అప్పు తీసుకున్నారు ఆ క్వాట్రొచ్చి కూడా స్నామ్ స్నామ్ సర్కస్ అనే పేరిట ఒక సర్కస్ నడుపుతుండేవారు వాళ్ళిద్దరూ కలిసి ఒక ఉమ్మడి ఖాతా తెరిచారు ఇప్పుడు దాంట్లో కోట్లాది లీరాలు నిలువ ఉన్నాయి ఆ నిలువ ఎంత ఎక్కువ ఉన్నదంటే ఆ బ్యాంకు మేనేజరుకు కూడా లెక్క అందడం లేదు రామారావు సినిమాల నుంచి రాజకీయాల్లోకి వెళ్ళారు గాని మిలాన్ కైతే తిరిగి వెళ్ళలేదు ఆయన ఏనుగు లక్కడ కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తున్నాయి మన వాళ్ళు క్వాట్రొచ్చిని ప్రశ్నించడానికి వెళ్ళనున్నారు కాని ఆయన మరో సర్కస్‌తో – బహుశా మరో ఉమ్మడి ఖాతాతో కూడా – చైనాలో ఉన్నారు మనం ఆయన కోసమే వేచి చూస్తున్నాం

ఇంకేమైనా ఉన్నాయా? రిలయన్స్ సంగతేమిటి? అని అడిగారు రాజీవ్

లండన్ డైరెక్టరీలో రిలయన్స్ పేరుతో 23 కంపెనీలు ఉన్నాయి కాని వాటిలో ఏ ఒక్క దానితోనూ అంబానీకి సంబంధం లేదు జెనీవాలో గోయెంకా పేరుతో ఒక వ్యక్తి ఉన్నాడు గాని ఆయన ఐక్యరాజ్య సమితి కార్యాలయంలో శాకాహార భోజనశాల నడుపుతున్నాడు అక్కడే గురుమూర్తి అనే వ్యక్తి ఇడ్లీలు దోశలు చేస్తుంటాడు న్యూయార్క్‌లో ఇద్దరు అంబానీలున్నారు ఒకాయనది సరుకుల కొట్టు ఆయన చీరలు కూడా అమ్ముతుంటాడు మన యువతులు జీన్స్ మాత్రమే వేసుకుంటున్నా అక్కడ మన వాళ్ళందరూ చీరలే అమ్ముతుంటారు మరో అంబానీ వో చిన్న భోజన ఫలహార శాల నడుపుతున్నారు

ఆ భోజన శాలలో మీరేం కనిపెట్టారు?

అబ్దుల్ ఖాదర్ ఖాన్ బెరుకుగా అన్నారు వి పి సింగ్

ఏమిటీ అక్కడ కూడా ఖాన్ ఉన్నాడా? ఏం చేస్తున్నాడు?

కుల్‌దీప్ నయ్యర్‌తో రమ్మీ ఆడుతున్నాడు

అంటే ఖాన్‌తో రమ్మీ ఆడడానికి నయ్యర్ ఇక్కడి నుంచి న్యూయార్క్‌లోని అంబానీ భోజన శాల దాకా వెళ్తాడా? నమ్మశక్యంగా లేదు ఇంకా అక్కడెవరైనా ఉన్నారా?

ఉన్నారు నస్లీ వాడియా

అంబానీ భోజనశాలలో నస్లీ ఏం చేస్తున్నాడు?



అదీ ఖాన్‌తో పాటుగానా? రాజాసాబ్ ఈ మాట అంటున్నందుకు నన్ను క్షమించండి కాని మీరు దారి తప్పిపోతున్నారని నా కనిపిస్తున్నది

నేనది ఊహించాను అందుకే రిలయన్స్ సంగతి వదిలేసి మరో చోట పరిశోధించమని నేను మన వాళ్ళకు చెప్పాను

వాళ్ళు ఎక్కడికెళ్ళారు?

వాషింగ్టన్ వెళ్ళారు అక్కడ ఎవరిని పట్టుకున్నారో తెలుసునా – ఊహించండి

జ్యోతి బసు ఖాతా పట్టుకున్నారా అన్నారు ప్రధాని

కాదు జ్యోతి బసును కాదు ఆయన ఖాతా లండన్‌లో ఉంది మాకు రాజేష్ ఖన్నా ఖాతా దొరికింది మేం రాజేష్ ఖన్నాను ప్రశ్నిస్తే – ఆయన అప్పుడు పశ్చిమ బెంగాల్‌లో ఉపన్యాసాలు ఇస్తున్నారు – సునీల్‌దత్ బొంబాయి నుంచి అమృత్‌సర్ నడవగలిగినప్పుడు వాషింగ్టన్‌లో నేను ఖాతా తెరిస్తే ఏమయింది అన్నాడు

అంటే అమెరికాలో సునీల్‌దత్‌కు కూడా ఖాతా ఉందంటారా? అని అడిగారు రాజీవ్‌గాంధీ పరిశోధనాంశాలు విని విని ఆయనకు మతి పోయింది

దాదాపు మనకు తెలిసిన వాళ్ళందరికీ విదేశాలలో ఖాతాలున్నాయి గనుక విదేశాలలో ఖాతాలు లేని వాళ్ళెవరో పరిశోధించడానికి ప్రయత్నించాం

అదే మంచిది అన్నారు నిట్టూరుస్తూ రాజీవ్ ఇప్పుడు చెప్పండి ఎవరికి ఖాతా లేదు?

అమితాబ్ బచ్చన్‌కు అన్నారు రాజాసాబ్

ఇప్పుడు మీరు దారికొస్తున్నారు అన్నారు రాజీవ్

అమితాబ్ బచ్చన్‌కు ఎక్కడైనా ఒక్క ఖాతా అయినా ఉన్నట్టుగా మనవాళ్ళు కనిపెట్ట లేకపోయారు లండన్‌లో లేదు న్యూయార్క్‌లో లేదు షికాగోలో లేదు – అక్కడ సినిమాలలో వంటి వాళ్ళు కాకుండా నిజమైన గూండాలుంటారు – చివరికి స్విట్జర్లాండ్‌లో కూడా లేదు

కనుక మేం ఈ మొత్తం విషయాన్ని ముగించేసి మన మనిషిని వెనక్కి రమ్మన్నాం

భూరేలాల్ ఏమన్నాడు? అని రాజీవ్ అడిగారు

భూరేలాలా? అని ఆశ్చర్యపోయారు సింగ్ భూరేలాల్ కాదు నేను ఈ పరిశోధనలు చేసే పని అమితాబ్ బచ్చన్‌కు అప్పగించాను ఆయన మీకు సన్నిహిత మిత్రుడు విదేశీ ఖాతాల గురించి ఆయనకు మనందరి కన్నా ఎక్కువ తెలుసు

ఈ సంగతి దండావతే నమ్మరు గదా అన్నారు రాజీవ్

రెండు రోజుల తర్వాత విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ తన పదవిని పోగొట్టుకున్నారు ఇందులో అమితాబ్ బచ్చన్ హస్తం ఏమన్నా ఉందేమోనని ఆయన ఇంకా అనుమానిస్తూనే ఉన్నారు కాని వాస్తవమేమిటంటే ఆర్థిక మంత్రిత్వ శాఖ ఫారెక్స్-420 నెంబరు గల ఫైలు మూసి వేయబడింది అందులో నుంచి బచ్చన్ నివేదిక అదృశ్యమయింది □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)
8 14 మే 87
శ్రీ ప్రభవ నామ సం వైశాఖ శు దశమి
సంపుటము 79 సంచిక 36
ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక (వర్కింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం
హీరో వెంకటేష్
(ఫొటో ఎ రవిచందర్)






### వేయి పడగలు

వేయి పడగలు ప్రారంభించిన సంచిక చూసాను చాలా సంతోషించినను మన సంస్కృతి సంప్రదాయం చాటిచెప్పే అధికారం వేయి పడగల కు ఉన్నట్లే పత్రికలలో మీ ఆంధ్ర పత్రికకు అంతటి పెద్దరికం కూడా ఉంచనుకొంటున్నాను! వేయిపడగలు పేరు వినగానే భయపడిపోయే నేటి యువతీ యువకులు నిజంగా ఆ నవలలో ప్రవేశిస్తే ఈనాటి నవలల్ని మెచ్చుదురా? వారా అదృష్టమును అందుకోవాలి! రచయితల్లో విశ్వనాథలాగే వేయి పడగలు కూడా నవలల్లో హిమాలయోత్తుంగ శృంగం" మీ సమున్నత నిర్ణయానికి నా హార్దిక వందనములు!

బులుసు వేంకటేశ్వర్లు లంకలపాలెం

★ ★ ★

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వేయి పడగలు ప్రచురించడం ప్రారంభించి పాఠకులకు మహోపకారం చేశారు దానిని మించిన నవల తెలుగులో లేదు అంటే అతిశయోక్తి కానేరదు దానిపై కేంద్ర మానవ వనరుల అమాత్యులు శ్రీ పి వి నరసింహారావుగారు మహాకవి డా దాశరథిగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు చాలు దానివైశిష్ట్యానికి ఎతాకలుగా ఈ అచ్చుత ప్రచురణకు పూనుకొన్న మీకు నా ధన్యవాదాలు

ఆకెళ్ళ సుబ్బారావు కందికుప్ప

★ ★ ★

ఎన్నో సంవత్సరాలుగా ఎదురు చూసిన కల నిజమయింది వేయిపడగలు ఆధునిక సాహిత్యానికి ప్రాణం పోసింది అంతటి మహత్తరమైన నవలను మీ పత్రిక సీరియల్‌గా ప్రచురిస్తున్నందుకు నా హార్దికాభినందనలు ఒకసారి చదివిన వాకే ఇంత చవులూరిస్తుంటే కొత్తగా మొదలు పెట్టేవాళ్ళ గురించి ఇక చెప్పనవసరంలేదుసుమా!

డి జ్ఞానలక్ష్మి కోయిలకుంట్ల

★ ★ ★

ఉత్తమోత్తమ నవల వేయి పడగలు ప్రారంభంలోనే బాగా ఆకట్టుకున్నది ఇందులో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి భాష శైలి ఒక ప్రత్యేకత

యస్ కనకారావు పర్లాకిమిడి

★ ★ ★

సుమారు మూడు దశాబ్దాలక్రితం మా తండ్రిగారు వేయి పడగలు నవల చదివి మెచ్చుకుని నన్ను కూడా చదవమని ఆ నవలయిచ్చి ప్రోత్సహించారు అప్పుడు నా వయసు పదహారు సంవత్సరాలు కాని అప్పట్లో ఈ నవలను సగంవరకూ మాత్రమే చదివి అటుపైన ముందుకు వెళ్ళలేక అసంపూర్తిగా మధ్యలో చదవటం మానేశాను దీనికి కారణం అప్పట్లో నా కుర్రతనం కావచ్చు తిరిగి వయసులోనూ మానసికంగాను పరిణతి చెందాక ఆ నవలను తిరిగి చదవాలనుకున్నాను కాని అవకాశం కలిసి రాలేదు కాని ఇన్నాళ్ళకు ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఆ మహదవకాశాన్ని తిరిగి కలుగజేసినందుకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు

వక్కలంక రామారావు మాచేపల్లి

★ ★ ★

10 16 ఏప్రిల్ 87 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక నటి అశ్విని ముఖ చిత్రంతో శోభాయమానంగా వుంది శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి నవల వేయి పడగలు ఈ సంచికనుంచి ప్రారంభించినందుకు కృతజ్ఞతలు

హిమబిందు ఉమా మనోహరి దోర్నకల్

★ ★ ★

కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వేయి పడగలు గురించి వినటమేకాని ఆ నవల ఎట్లా వుంటుందో ' అని సందిగ్ధావస్థలో వున్న మాకు మీ పత్రిక ద్వారా మరల ఎడారిలో ఒయాసిస్సు లభించిన విధంగా ఆనందింపజేసినందులకు ధన్యవాదాలు

గొర్జిల్ల రఘునాథరావు లక్ష్మీబాయి ఖర్గపూర్


(70 వ పేజీ చూడండి)

# నిత్య నూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

(గత సంచిక తరువాయి)

రంగాజమ్మగారు దర్మారావుతో అదివఱకెన్నడును మాటాడలేదు కాని తానన్నచో ఆయమకు చాల ప్రేమ ఉన్నదని సావిత్రమ్మగారి ప్రసంగము ద్వారా అతనికి తెలియును నేడు హఠాత్తుగా ఆమె తన్ను పిలుచుటలో గూడ అతని కాశ్చర్యము వేసెను

దర్మారావును చూచినంతనే రంగాజమ్మగారికి తన కుమారుని చూచినట్లే ఉండును తన హృదయములో నున్న ప్రేమ ఎట్లు వెలు పఱుపవలయునో ఆమెకు తెలియలేదు అందుచే గది గుమ్మము నానుకొని నిల్చుండెను దర్మారావే మాటాడెను అన్నగారి వద్ద నుండి ఏమయిన ఉత్తరము వచ్చినదా? రంగాజమ్మగారు జవాబిచ్చెను నాయనా! ఉత్తరము వచ్చి నెల నాళ్లయినది తూర్పు దేశములో నిల్లు స్థలము కొని సంసారము చేయుచున్నాడట అది మారాజులెక్కువగానున్న చోటు అని ఏదో చెప్పబోయి ఆగెను

ధర్మారావు గహించి వివాహమాడెనా? యని ప్రశ్నించెను

రంగా అదే నాయనా! మొదట నెవరును పిల్లనిచ్చుటకు సమ్మతించలేదట! తరువాత నెవరో యొక వృద్ధుడు దర్మశాస్త్రములు అవియు చదివినవాడు తన మనుమరాలి నిచ్చెనట! కాని పిల్లవాని కిచ్చుటకే రావలయుననియే ఉన్నది మఱల నన్ను రమ్మని వ్రాయును నాకచ్చట ఏమున్నది? అత్తవారి యిల్లు వదలిపెట్టి ఆ పరదేశములకు నే నేలపోవలయును? మీ నాయనగారు చచ్చిన చోటనే నేనును చచ్చిపోదును

దర్మారావునకు గుండెలో ఆ వేగము తోచెను ఆమె శీలమునకు మనస్సులో ఆనందపడి తన తండ్రి దన్యుడనుకొనెను

రంగా నాయనా! నేను వానిని రమ్మనియే వ్రాయించితిని మీ అన్నదమ్ములందరు నొక చోట నుండవచ్చును చేదోడువాదోడుగా ఉందురు ఆ దూర దేశములో మన యన్నవారు లేక ఏమి యిబ్బందులు పడుచుండునో! అతనికి రావలయుననియే యున్నది కాని భార్య ఒప్పుకొనునట్లు తోచదు

దర్మా ఆయనకేమయిన సంతానమా?

రంగా ఒక కుమారుడు కలిగి పోయినాడట!

దర్మారావు మఱి కొంచెము సేపు కూర్చుండి అమ్మా! వచ్చెదను అని సెలవు తీసికొనెను దారి వెంట పోవుచు ఆలోచనా తరంగములపై ఊగులాడుచుండెను ఇది ఒక విచిత్రమైన సృష్టి ప్రేమ విచిత్రమైనది తానెవ్వరు? ఆమె ఎవ్వరు? వారి అనుబంధమే చమత్కారముగ నున్నది

అతని ఊహ తన తండ్రి వివాహముల మీదికి ప్రాకెను

ఒకప్పుడు రామేశ్వరశాస్త్రి పాతికయేండ్ల వయస్సప్పుడు తీర్థయాత్రకు పోయెను అప్పటికి సావిత్రమ్మగారు కాపురమునకు రాలేదు శాస్త్రిగారికి పదునెన్మిదేండ్లప్పుడు సోమన్నగారు తన మూడేండ్ల కూతునిచ్చి పెండ్లి చేసెను శాస్త్రిగారి కిరువదియేండ్లప్పుడు తండ్రి చనిపోయెను చనిపోయిన మఱు సంవత్సరమే రంగాజమ్మగారిని పెండ్లాడెను

రంగాజమ్మ తండ్రి సుక్షత్రియులు వారిది గంజాం జిల్లా శాస్త్రిగారు జమీందారుగారి పనిమీద ఆ ప్రాంతములకు పోయినపుడు రంగాజమ్మగారి తండ్రి రంగరాజు గారికిని రామేశ్వరశాస్త్రి గారికిని పరిచయము కలిగెను ఒకరోజున ప్రసంగ వశమున అరణ్యుడు రాముడు ధనుర్విద్య వీనిని గురించి మాటాడుచు రంగరాజుగారు ఆ విద్యలన్నియు చచ్చిపోయినవనెను రామేశ్వరశాస్త్రి తనకా విద్యలో నున్న శక్తిని గురించి ప్రస్తావించెను రంగరాజు గారికి కూడ అందు చాల సామర్థ్యము కలదు ఇద్దరు ఒకరి నొకరు పరీక్షించుకొనిరి ఈ పరీక్షలలో రంగాజమ్మగారు రామేశ్వరశాస్త్రిని ప్రేమించి అతనితో లేచి వచ్చెను రంగరాజుగారు మొదట కోపించినను తరువాత శాస్త్రీయముగా వీరిద్దరు వివాహమాడిరని తెలిసి ఊరకుండెను



తరువాత నాలుగేండ్లకు శాస్త్రిగారు తీర్థయాత్రకు చనిరి వెంటనే రంగాజమ్మగారు కూడ వెళ్ళిరి

దారిలో ఒక వైశ్య కుటుంబము వారికి కలిసెను వారనాదిలో తెలుగు వారేనట! అప్పుడు మాత్రము మహారాష్ట్ర దేశములో కాపురము ఉండిరి అదొక యాసతో వారు తెలుగు మాటాడుట తెలుగు వారన్నచో ప్రాణములు విడుచుట తాము తెలుగువారమని చెప్పుకొని గర్వపడుట ఈ కారణముల వలన వారికి వీరికి పరిచయము కలిగెను ఆ వైశ్య శిఖామణి పేరు రామకృష్ణారావు చూచుటకు మహారాష్ట్ర బ్రాహ్మణుని వలె ఉండెను ఆయనయు ఆయన భార్యయు పదునాలుగేండ్ల కుమార్తెయు తీర్థ యాత్ర చేయుచుండిరి ఆ పిల్లకు పెండ్లి కాలేదు

ప్రతి మజిలీలోను శాస్త్రిగారు వండుటయు తాను భోజనము చేసి రంగాజమ్మగారికి పెట్టుటయు చూచి రామకృష్ణారావుగారు కొంత సందేహించి చివరకు శాస్త్రి గారిని వారి సంబంధమును గూర్చి ప్రశ్నించెను శాస్త్రి ఆమె తన భార్య అనియు క్షత్రియ అనియు తాను క్రమముగా బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలను చేసికొంటిననియు వైశ్య శూద్ర స్త్రీలను గూడ చేసికొనవలెనని ఉన్నదనియు చెప్పెను రావు మందహాసము చేసి ఊరకుండెను

తీర్థ యాత్రలు సేవించుచు సేవించుచు వారు నర్మదానదిని చేరబోయిరి స్నానము చేయుచు హైమవతి కాలు జారి ప్రవాహమున పడెను రావు దుఃఖావేశము చేత అయ్యా ఆ పిల్లను బ్రతికించుము నీకా పిల్లనిచ్చి వివాహము చేయుదు మనెను శాస్త్రి ప్రవాహమున నుండి కన్యను తెచ్చెను

రామకృష్ణారావునకు తరువాత పిల్లనిచ్చుట

అన్నంత తేలిక గా కన్పిం పలేదు హైమవతి చక్కని చుక్క మహారాష్ట్ర దేశమున ఉండుట వలన అంత [illegible] తెలుగు దేశములో నైనచో ఉండదు ఆమెకు శాస్త్రి శాస్త్రి భార్యను చూచినప్పటి నుండియు మనసులో నొక క్రొత్త పోకడ కలిగెను శాస్త్రి ఆజానుబాహువు ఎర్రనివాడు సుందరమైన మొగము నిత్యవ్యాయామము చేత కండలు చేరి నిగనిగలాడు శరీరము అతనిని చూచి ఏ స్త్రీ మోహించ దన్నట్లుండెను నిన్ను ఏ కన్యల్ కోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు అన్నట్లు రంగాజమ్మగారు ప్రబల సాక్ష్య మిచ్చుచుండెను పైగా తండ్రిగారి వాగ్దానము వలన తానది వరకే శాస్త్రిగారి భార్యనైతి ననుకొనెను కాని తండ్రి నుండి వదలించుకొనుట యెట్లు? రంగాజమ్మగారి కప్పటి కిరువది యేండ్లు ఆమెయు హైమవతియు కలసి కుట్ర చేసిరి శాస్త్రిగారికి మబ్బు విచ్చినట్లయ్యెను అయోధ్యలో ఒకనాడు రామకృష్ణారావుగారు నిద్రలేచి చూచుకొను సరికి హైమవతి భర్తతో కలసి యిరువది ఆమడల దూరము నందున్నది రావు వ్యవహారము నడిపెడివాడే భార్య వారించినది నిజమే! అతని భార్య నతడు తీసికొని వెళ్ళె నన్నది

శాస్త్రిగారింటికి వచ్చి వివాహము చేసికొనెను తరువాత నాలుగేండ్లకు భార్యాభర్త లిద్దరు మహారాష్ట్ర దేశమునకు పోయి హైమవతి తల్లి దండ్రులను దర్శించి వచ్చిరి రామకృష్ణారావు అల్లునితో సరిగా మాటాడలేదు గాని అత్తగారును బావమరదులు ఆదరించిరి హైమవతికి ఇద్దరు కుమార్తెలు ఒక కుమారుడును కలిగిరి శాస్త్రి గారు కూతుండ్ర కిద్దరకు మహావైభవముతో పెండ్లి చేసెను తరువాత వారిద్దరు కాపురమునకు పోయిరి హైమవతి శాస్త్రిగారికి నలుబదియవ యేట చనిపోయెను కుమారుడు శ్రీధరము తన పాల మమ్ముకొని వర్తకము చేయుట కని యే దేశమో పోయెను రామేశ్వరశాస్త్రిగారు రామచంద్రరాజును గొప్ప ధనుర్విద్యా పారంగతుని శ్రీధరమును వర్తక సార్వభౌముని చేయవలెనని ఊహించెను కాని వారిద్దరును తండ్రికి చెప్పకుండగనే దేశాంతరగతు లయిరి

# వేయి పడగలు

తన కుమారుడయిన ధర్మారావునకు వేదవిద్య చెప్పించవలయు ననుకొనెను కాని బావమరదియు భార్యయు చేసిన పోరాటము వలన అత డాంగిలేయ మభ్యసించెను ఈ రీతిగా నాయన యీ మూడా దర్శములును ఫలమునకు రాకపోయెను ఊరిలో ననే ఒక పేదకాపునకు మంగ అను కూతురుండెను మంగ విచిత్రమైన ఎల్ల నల్లనిది కోల మొగము ఎన్నడును జుట్టు దువ్వుకొనెడిది కాదు చిన్నప్పటి నుండి రామేశ్వరశాస్త్రితో పరిహాసము లాడు చుండెడిది చిన్నప్పుడు పరాచికమునకు శాస్త్రి మంగా! నిన్ను నేను పెండ్లాడెదను చూడు అనెడివాడు మంగ నన్ను పెండ్లి చేసికొని యేమి బాగుపడెదవు! నా చేత తన్నులు తినుటకా? అనెడిది శాస్త్రి సరే! తన్నుదువు గానిగా! అనును మంగ నవ్వును ఆ పేదకాపు కూతునకు పెండ్లి చేయలేక పోయెను అతని భార్య మంగ పసితనము లోనే చనిపోయెను మంగకు పదునెనిమిది ఏండ్లు వచ్చెను పెండ్లి కాలేదు కాపు పాపము మనోవ్యాధి తోడను ఉబ్బసము తోడను తీసికొని చనిపోయెను మంగ బ్రతుకు నిరాధారమయ్యెను వయసులోని వారు మంగను దుశ్శీలనుగా చేయ ప్రయత్నించిరి ఈ తిప్పలు పడలేక మంగ ఒకరోజున శాస్త్రి యొద్దకు వచ్చి నన్ను పెండ్లి చేసికొందును అంటివి కదా! చేసికొనుము నాకు తిండ జరుగుట లేదు అదిగాక దుర్మార్గులతో బాదపడలేకున్నాను తెల్లవారులు నా యింటి మీద గడ్డలు వెయి చున్నారు నాకు దిక్కులేదు నన్ను పెండ్లి చేసి కొందువా పొడయి పొమ్మందువా? అనెను

శాస్త్రి మంగను తన యింట నుండి పొమ్మనెను అప్పటికి సావిత్రమ్మగారు కాపురమునకు వచ్చెను హైమవతి ఆమె పెద్ద కూతురు ఎడాది ఎల్ల - ఆమెకు శాస్త్రిగారి యీ పెండ్లిండ్లు నచ్చలేదు మంగ నింట నిలువనిచ్చినది కాదు మంగ బాదలు చూడలేక శాస్త్రిగారు వేరే ఆమెకు ఇల్లు వేసి అన్యాయమేలయని ఆమె పది యెకరములు ఆమెకు వ్రాసి యిచ్చెను అప్పటి నుండి మంగ సుఖముగా జీవించెను మంగ బలవంతము మీద శాస్త్రిగారు ఆమెకు పుస్తె కట్టెను తరువాత నాలుగైదేండ్లకు మంగ కడుపున ఒక కాయ కాచెను ఆ కాయ మగశిశువు పురిటిలోనే ఆ శిశువును [illegible] మూర్ఛపోయెను అది ఏమి శిశువు! ఈన కళ్ళువుల్ల కన్ను సన్నము ఆకుపచ్చని రంగు చాత్తు బూడద రంగు అందరు నేమొ పాము ఎల్ల పుట్టె ననుకొన్నారు కాని రెండు కాళ్ళు రెండు చేతులు మొగము కన్నులు నాలుక యిన్నియు నుండగా పామ ను కొనుట యెట్లు' - సాటి కాపు పతుములు కులము చెడిన దీనికి మంచి పరాభవము జరిగినదని అనుకొన్నారు మంగ మూర్ఛదేరి శిశువు ఎదురు రొమ్మత్తుకొన్నది శిశువు కదలాడెను పాము మెలికలు తిరిగినట్లుండెను మంగ పొత్తిళ్ళతో అదిమి పట్టుకొనెను శిశువేడ్చెను పాము కూసినట్లున్నది మంగ సుబ్రహ్మణ్యేశ్వరుని తలచి పాప కాముదము పెట్టెను జనము విచిత్రముగా గుంపులు గుంపులై వచ్చి శిశువును చూచి పోదొడగిరి మరికొన్నాళ్ళకు మంగకు అబిమానము వేసి శిశువును దాచుకొనుచు వచ్చినది నెలపురుడు వెళ్ళినది శాస్త్రి శిశువును చూచుటకు వెళ్ళెను శిశువప్పుడే తండ్రిని గుర్తు పట్టెనేమో తండ్రి చేతిలోనికి పోవుచునే ఎడుపు మానెను శాస్త్రి శిశువు వంక చూచెను శాస్త్రి తీక్ష్ణాలోచనా పరుడయ్యెను మంగ చెక్కిళ్ళుల మీద చేయి వైచి మంగా! నీవదృష్టవంతురాలవు సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి నీ యందు చాల దయ వచ్చినది న యందు దర్మమింకను చెడిపోలేదు ఈ దర్మమును రక్షించు కొనుము అనెను మంగకు శాస్త్రి వగవంతుడు పొరుగమ్మల పెదవి విరుపులతో తన శిశువు మీద కొంత నిరాదరణ యిది వరకు కలిగినను మంగకి ఇప్పుడు తన శిశువు మీధ గల ప్రేమ యిబ్బడి ముబ్బడి అయ్యెను

శిశువునకు ఎడాది యీడు వచ్చెను ఉన్న చోట ఉండడు పాక యెక్కడకు పోవునో తెలియదు దొడ్డిలో పొట్ల పాదులు బీరపాదులు పెట్టె మంగ యెప్పుడును కాపించును శిశువు పోయి ఆ పాదులలో కూర్చుండును మంగకు అతడు కనబడడు పైగా పురుగు పుట్ర ఉండునేమోయని మంగ వయము ఒకసారి యిట్లే ఒక పొరుగమ్మతో అన్నది మంగ - పురుగో పుట్రో తల్లి? ఎప్పుడును పోయి ఆ పాదులలో గాని కూర్చుండడు ఆమె అన్నది పురుగో పుట్రో నా అమ్మా! నీ కొడుకే పురుగు నీ కొడుకే పుట్ర

మంగకు కోపము వచ్చినది కాని కోపమెట్లు చూపించవలయునో ఆమెకు తెలియదు

శిశువునకు ఐదేండ్లు వచ్చినవి బిడ్డ యీదురు గాలి కొట్టినచో నోరు తెరచుకొని ఆ గాలిని ఎల్చుకొనును తల్లికి తెలియకుండ పోయి యేచేనిలోనికో చొచ్చును జొన్న చేలు పెసర కాడలు వంగ తోటలు ఆకుమడులు వీని లోనికి పోయి ఆ మద్య నెచటనో పండుకొనును మంగ వెదకలేక వెదకలేక విసిగిపోవును పాపమెక్కడ అని వెదకును?

**జరిగిన కథ –4 :** సుబ్బన్నపేటలో ఒక యువతి వేయి పడగల పాము విప్పారుకొని వచ్చి కాటుందుకొన్నది కలలోన రాజును అని పాడుతూ ఉంటుంది ఆమె గణాచారి సుమారు మూడు వందల ఏళ్ళ క్రిందట అడవిలో ఒక పాముకి ఆవు పాలిచ్చిన చోట ఒక గుడిని కట్టించి ఒక గ్రామాన్ని కూడా నిర్మిస్తారు బ్రాహ్మణుడు వీరన్న గ్రామ నిర్మాణానికి ముఖ్య కారకులు ఆ గ్రామానికే సుబ్బన్నపేట అనే పేరు వస్తుంది తరాలు మారినా ఆచారం మారలేదు కాపు కూతురు గణాచారి అవుతుంది ఇప్పటి గణాచారి పాట పాడుతూ ధర్మారావుకు ఎదురువెదుతుంది ఐదవతరం వాడయిన రామేశ్వరశాస్త్రికి ధర్మారావు కుమారుడు ఇప్పటి జమీందారు కృష్ణమనాయడు రామేశ్వర శాస్త్రిగారి ఆస్తి అంతా దానధర్మాలతో హరించిపోతుంది ఇప్పటి జమీందారు కృష్ణమనాయడు రామేశ్వరశాస్త్రి స్నేహితులు ఒకనాటి రాత్రి రామేశ్వరశాస్త్రి నాగేశ్వరాలయంలో ప్రాణాలు విడుస్తాడు కృష్ణమనాయని సహాయంతో కర్మ జరుగుతుంది గోపన్నధర్మారావు విషయం జమీందారుకు వివరిస్తాడు కృష్ణమనాయడు ధర్మారావు ఆస్తి అప్పు వ్యవహారం పరిష్కరిస్తాడు రంగారావుగారికి ధర్మారావుఅంటే అంతగా గిట్టదు చదువుకోడానికి ధర్మారావు బందరు వెడతాడు జమీందారు మరణిస్తాడు ధర్మారావు చదువు మానివేసి సుబ్బన్నపేటకు వచ్చేస్తాడు

# ప్రముఖుల సందేశాలు



"చాలా మంధి అంటూ వుంటారు – నేను ఆర్థర్ హెయిలీ నుంచి ఉత్తేజం పొంది రచనలు చేస్తూ వుంటానని చాలా వరకూ అది నిజం కాదు చిన్నతనం నుంచీ నేను విశ్వనాద వారి రచనల ద్వారానే ఇన్స్పిరేషన్ పొందాను నా నవలల్లో ఒకటి రెండు చోట్ల ఈ విషయం ప్రస్తావించాను కూడా! విషయ సేకరణ – విషయ పరిజ్ఞానం – వివరణల విషయంలో మనం ఆంగ్ల రచయితల్ని చెప్పుకోవటం దురదృష్టకరం. అందరి కన్నా ఆద్యుడు విశ్వనాథ వారే. ఎవరు కాదన్నా నిజమిది!!!

మేమేదో మా పేర్ల ముందు కమర్షియల్ గిమ్మిక్స్‌గా సంచలన – ఇన్వెస్టిగేటివ్ – లాటి బిరుదులు తగిలించుకుంటున్నాం కానీ – నిజమైన ఎన్సైక్లో పీడియా కవి సామ్రాట్టే అంటే ఎవరైనా కాదనగలరా?

యండమూరి వీరేంద్రనాథ్

పూజనీయులు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాద సత్యనారాయణగారు అద్యతన భారతీయ 'సాహిత్యాకాశంలో బ్రాహ్మీమయ' మూర్తులై ప్రభాసిల్లిన అద్వితీయ వ్యక్తి. పోని, పోకడ లేని, తాకని సాహిత్య ప్రక్రియ మిగలని సాహిత్య క్షేత్ర మూర్ధాబి– షిక్తులైన శ్రీ విశ్వనాథవారు నన్నయ్య తిక్కన శ్రీనాథుడు మరల ఈ భూమిపైన ఒక్కరూపున ఉద్భవించిన వారు శ్రీ విశ్వనాథవారు అట్టి విశ్వనాథ వారి వేయి పడగలు మళ్ళీ ఈతరానికి మీ సచిత్ర వార పత్రికద్వారా అందించ



డానికి మీరు చేస్తున్న కృషి చాలా గొప్పది పరమానందంగావుంది ఇలాగే వారి రచనలు మీకు వీలయినన్ని ఈతరం పాఠకలోకానికి అందించ వలసింది గానా ఆకాంక్ష

–నేరెళ్ళ వేణుమాదవ్

వరంగల్

అందరు అతనిని పసరిక అని ఎలువజొచ్చిరి పసరికకు ఎట్లలు పాములు ఎక్కువ మిత్రులు పక్షులు వాని దగరనే ఆడును వానితో అతడేమో మ టలాడుచున్నట్లుండును పాములతనితో ఆడుటయే కాదు అతని శరీరమునందు మెలి వేసకొనును ఆకు మడులలో అతడు పండుకొని నిద్రించును పసరిక పాములు అతని చుట్టును తిరుగుచుండును మనుష్యులను చూచినచో అవి పారిపోవును

పసరికకు పదేండ్లు వచ్చినవి పచ్చని పాము తోక మీద నిలుచున్నట్లే ఉండునతడు నిలుచున్నపుడు పెద్ద గాలి వేసనచో పసరిక తూలిపోవును అతని నవ్వు అతని మాటలు అతని నడక – అది యొక విచిత్రము।

పసరిక గ్రామములో ఉన్నప్పుడు ఎల్లలు అతనిని విచిత్రముగా చూచుచుందురు ఊరిలో అందరకు అతడు అన్నచో ప్రేమ అతనిని ఎవరు ఎమియు అనరు అతనిని నవ్వింతురు కొంద రతనితో పరాచికములాడుదురు

పసరిక యెక్కువ మాటాడడు ఊరకే ప్రతిదానికిని నవ్వును ఎక్కువ పొలములోనే ఉండును ఇంటి దగ్గర సకృత్తు

క్రమముగా మంగకు కొడుకు మీద ఆదుర్దా తీరెను వాడంతే పైరు పచ్చవాడుగా పుట్టెను వానికి పైరునకు సంబంధము వాడే పైరు పైరే వాడు వాడు ఇంటి వద్ద ఎల యుండును? అని ఆమె నిర్ధారణ చేసకొన్నది

అతడెప్పుడైన ఇంటికి వచ్చెనా యింత అన్నము పెట్టును అతనికి అన్నము కూడ అక్కరలేదేమో! పొలాల మీద అతడు ఎది పడిన అదే తినును అన్నియు పచ్చి వస్తువులే తినును

పసరిక యెవరి తోడను ఎక్కువ కలియడు ఒక్క దర్మారావు తోడనే కలియును దర్మారావు కనంబడెనా అతనిని వదలిపెట్టి పోడు దర్మారావును అన్నా అని ఎలుచును అతనికి వచ్చిన దా యొక్కటియే మాట దర్మారావునకు కూడ పసరిక అన్నచో ప్రాణము దర్మారావుకు రాజా పోయినను సరే విద్యలు నశించినను సరే పసరిక ఉన్నచో చ లును

కనబడనచో పసరిక దర్మారావును వదలడు ఇద్దరును పోయి పొలాల వెంట తిరిగి తిరిగి పచ్చపైరులో విశ్రమించి ప్రొద్దు క్రుంకగాని యింటికి రారు దర్మారావున్నచో పసరిక దగ్గరకు పక్షులు సర్పములు రావు అవి యేమో అతని మిద కోపము వచ్చినట్లు చూచుచు చూచుచు పోవును తరువాత రెన్నాళ్ళ దాక అతనని సమీపించవు పసరిక వానిని కొట్టి తిట్టి మరల వానితో చెలిమి చేయవలయును

ధర్మారావు రంగాజమ్మగారి యింటి నుండి వచ్చుచు ఈ ఊహ తరంగములలో ఒడలు తెలియక నడచుచుండెను అప్పటికి ప్రొద్దు తిరిగినది దూరమున పసరిక ధర్మారావును చూచెను పసరిక అన్నా! అని కేక వేసెను ధర్మారావు అతనిని గురించియే ఊహించుచుండెను పసరిక వచ్చి ధర్మారావును కౌగలించుకొనెను తమలపాకు తీగ వచ్చి అవిసె మొక్క మీద వ్రాలినట్లున్నది

ధర్మారావు నాయనా! నీకు వేయేండ్లు ఆయుర్దాయ మనెను రెండు జాములపుడు ఆకాశమున ఎచట నుండి వచ్చినదో తీతువు ఎట్ల కూసెను ధర్మారావు హృదయములో ఏదో కొట్టి నట్లయెను పసరిక ధర్మారావును తన వెంట పొలాలకు రమ్మనెను ధర్మారావు యొక్క కలుక్కుమన్న గుండె నాయనా! అన్నము తినలేదు అని అభ్యంతరము పెట్టెను పసరిక ధర్మారావును వెనుతిరిగి చూచుచు చూచు మనే పోయెను ధర్మారావు మరల నడచుచుండెను

ధర్మారావునకు ఈ అపశకునము వలన మనోవ్యధ కలిగెను ఆ దెబ్బ కూడ ఆయమున తగిలెను అయ్యో! పసరికకే బంగమా! ధర్మారావు, శరిరము కూడ నశించెననుకొన్నాడు

ధర్మారావు మరల ఆలోచనా నిమగ్నుడయ్యెను వారి వెంట నడచుచుండెనో అతడు తన్ను తానెరుగడు

మరికొంత దూరము నడచిన తరువాత ఎవరో తన్ను వెనుక నుండి తాకినట్లయ్యెను వెనుతిరిగి చూచెను అతని కన్నులలోనికి వెన్నెలలు చిమ్మిన గ్రోవితో కొట్టినట్లయ్యెను అవి నవ్వులు

ఆ నవ్వినది పన్నెండేండ్ల ఎల్ల దాని యొడలిపైకి తెలియకుండ మన్మధుడు వచ్చుచున్నాడు దాని తెల్లని పలువరుస సుదర్శనాయుధపు టంచుల వలె పదును పెట్టినట్లుండెను దాని చెవులు శ్రీకారములై పాంచజన్యము లట్లుండెను దాని కన్నులు కమలములు దాని నాసిక కౌమోదకి దాని భ్రూయుగము శార్ఙ్గము ద్విధా విభక్తమైనట్లుండెను దాని మూర్తి వైకుంఠమై మనోజ్ఞమయ్యెను

దాని పేరు దేవదాసి అది రామేశ్వరశాస్త్రి గారు ఉంచుకొన్న భోగాంగన రత్నగిరి కూతురు దేవదాసి ధర్మారావును అన్నా! ఎచ్చటికి? అనెను ధర్మారావునకు ఒక్కసారిగ తన తండ్రి మూర్తి గోచరించెను

ఆయన వర్ణాశ్రమ ధర్మములన్నియు ముద్ద కట్టిన మూర్తి

ఆయన భారతదేశము యొక్క ఆత్మ

ఆయన త్రయీ విద్య కొక వ్యాఖ్యానము

## నాల్గవ అధ్యాయము

రంగారావుగారికి పట్టాభిషేకము ... బడెను పరగణాయే గాక రాజధాని అంతయు ఉత్సాహముతో నిండిపోయెను రంగారావుగారికి ముప్పదియైదేండ్లు ఆయన ఇంగ్లీషు విద్యలో సట్టచంద్రుడు ఆధునికమైన ...ము కలవాడగుట చేత ఆయన పరిపాలనయున రాజ్యములో చాల మార్పులు కలుగునని ప్రజా

క్షేమము వృద్ధి పొందునని లోకమనుకొనుచుండెను పూర్వమార్గము లన్నియు మంచివి కావు పాశ్చాత్య ఆదర్శములతో సాగించిన యే కార్యమైనను అభివృద్ధి సూచకమని సర్వత్ర అభిప్రాయములు గోచరించెను ముసలిరాజు దేశము ముందునకు పోవుచున్నను తాను పూర్వాచారములే పరిగణించెను అందుచే దేశములో అనేకులైన యువకులకు జీవితములందు తమ శక్తులు ప్రకటించుటకు వీలులేకపోయెను ప్రభువు నూతన సంస్థలను ప్రబలించవలెను యువకులు వానికి తేజస్సు తీసికొని రావలయును

కృష్ణమనాయుడు తన పూర్వులు చన్న మార్గముననే పోయెను గడచిన పదేండ్లు రంగారావుగారే వ్యవహారములన్నియు చూచుచున్నను, నాయని మాటయే సాగెను ఇపుడు రంగారావుగారు సర్వ శక్తిమంతుడగుట దేశము నోచుకొన్న నోము ఫలించుట అని అందరు అభిప్రాయపడిరి

రంగారావుగారు రాజ్యమునకు వచ్చినంతనే ప్రదానముగా కొన్ని మార్పులు చేసిరి నాయని కాలములో ఏ పనియు తొందరగా తేలెడిది కాదు ఎవరైన జమీందారు గారితో పని యుండ వచ్చెడి వారు వారిక దర్శనమే అయ్యెడిది కాదు దొరగారితో పని అనుట తోడనే సత్రములో భోజనము వారు నెలనాళ్ళు, రెండు నెలలు పడియుండి ప్రభు దర్శనము చేయుదురు చేసి యేమి లాభము? ప్రభువు గ్రామమడుగును, పేరడుగును సత్రములో భోజనము సదుపాయముగా నున్నదా" అని పరామర్శించును వారు చిత్తమందురు దొర ఏమి పని మీద వచ్చితిరని అడుగడు వారు తామే చెప్పుటకు జంకుదురు అట్లు మరల ఒకనెల జరిగిన తరువాత తెగించి వారు తమ వచ్చిన పని చెప్పుదురు ఉద్యోగము కొరకు వచ్చెనా" సరే పోయి, భార్యను ఎల్లలను తీసికొని రండ అనును అతడు పోయి సంసారము తెచ్చును జీతమింత యని ప్రభువు చెప్పడు వారు నోరు విడచి అడుగలేరు సర్వ పదార్థములు

# వేయి పడగలు

దేవిడీలో నుండి తెచ్చుకొనుటయు, తనుటయు ఇంటిలో కార్యకరామతులు వచ్చినచో ప్రభువుతో పోయి చెప్పుకొనుట మాత్రమే దొర, దగ్గరనున్న పెత్తనదారుతో ఫలానా వారింట వివాహమట! కావలసిన వన్నియు పంపించుడు అని చెప్పును ఇట్లు సర్వకార్యములు గడచిపోవును

దివాను వచ్చి అయ్యా! శిస్తు వసూలు కాలేదు అనును

ప్రభువు – ఏమియు వసూలు కాలేదటయ్యా?

దివాను – కాలేదండి, చాల బకాయి పడినది

ప్రభువు – ఏమాత్రము?

దివాను – ఈ గ్రామములో పది వేలకు తొమ్మిది వేలయినది వేయి రూపాయలు బకాయి మరియొక చోట ఎనిమిది వేలు, ఆరు వేలే జమ – ఇట్లున్నది

ప్రభువు – ముందు సంవత్సరము వసూలు చేయవచ్చునులే! వాండ్రకు సరిగా పండనదో, లేదో అది కనుగొంటివా? వారును పేదవారు, వారి మీద పడి పీకుకొని తినినచో మనకు మాత్రమేమి శుభము పదిమంది తిన్నదే మంచిది నాలుగు లక్షలలో రెండు లక్షలు వసూలయినచో మనకు చాలదా? ఏమందువు?

దివాను మరల మాటాడడు నాలుగయిదేండ్లు బకాయీలు పేరుకొన్న తరువాత ఆ గ్రామస్థులు వచ్చి జమిందారుగారి దర్శనము చేయుదురు ప్రభువునకు తమ యిక్కట్లులు చెప్పుకొందురు నాయుడు బకాయీలు రద్దు చేసి వచ్చిన వారిని సువారములో కడుపు నిండ మేపి సాగనంపును

ఒకసారి జమిందారుగారి మామిడి తోట విరగగాచి యుండెను గ్రామములో నున్న పది మంది ఎల్లలు తోటలో దొరబడి ఒందె కూడ లేకుండ దులిపి వేసిరి తోటమాలి పట్టుకొనబోగా వారతనిని తాడించిరి తోటమాలి పోయి ప్రభువుతో చెప్పి వారు ఫలానా వారి ఎల్లలని నిరూపించెను ఆ ఎల్లలతో ఇబ్బందిగా ఉన్నది వారిని

ఎట్లయినను దండించవలెనని పెత్తనదారునకు, దివానునకు కూడ పట్టుదలగా ఉండెను దొర వారిని పిలిపించెను వారు వచ్చిరి వారి గుండెలలో దడదడగా ఉండెను నాయుడు వారిని చూచి 'మామిడి కాయలు మీలో ఎవరు దొంగిలించిరి?" అనెను దివాను అందరును దొంగిలించిరి ఒకరేమిటి? అందరిని శిక్షించవలయును అనెను ఏమి శిక్ష యీవలె? అని రాజడిగెను. కొయ్యబండ వేయవలె అని దివాను చెప్పెను, సరేనని కొయ్యబండ తెప్పించిరి

నాయుడనెను ఏమయ్యా! ఉన్న దొక్క కొయ్యబండ వీరు పదిమంది ఎవరికి వేయవలెను? అనెను ఒకరి తరువాత నొకరి'కని దివానుగారు చెప్పిరి ప్రభువు వంటవానిని పిలిచి, యేదో రహస్యముగా చెప్పి సరే! వేయుదములే! అని అందరిని కూర్చుండుడని చెప్పి యేదో వ్యవహారము మాటలాడ జొచ్చెను గంటసేపయినది పిల్లలు కదులుటకు వీలులేదు, చివరకు వంటవాడు లడ్లును జిలేబియు వేడి వేడివి పెద్ద పళ్ళెము నిండ చేసి తెచ్చెను నాయుడు పళ్ళెము ఎల్లల ముందు పెట్టించి ఎవరు తక్కువ తిందురో వారికి కొయ్యబంధ వేయించెదను అనెను కుర్రవాండ్రు ఆశ్చర్యపడిరి తరువాత నొకరి మొగ మొకరు చూచుచు తిన గలిగినన్ని తినిరి పళ్ళెములో ఇంక సగము మిగిలెను నాయుడు చూచి ఎమిరా! ఈ మాత్రమునకేనా తోటలలో దొరబడి పండ్లు కోసి కొనుట? లెక్క పది జిలేబులు తినలేరు ఏమి ఎల్లలు! ఛీ! పొండు! ఆ మిగిలినవి కూడ తిసుకొని పొండ! యనెను పిల్లలవి కూడ తీసికొని యింటికి పరుపులెత్తిరి తోటమాలియు, దివానును తెల్ల మొగము వేసిరి

దొర పోనింతయ్యా! అల్లరి పిల్లలు చేయక పోయినచో ఎవ్వరు చేయుదురు! పిల్లలు భగవత్స్వరూపులు వారిని ఏమియు అనరాదు అని దివానును సముదాయించెను

(ఇంకా ఉంది)






నీ నెత్తిన కాలు పెట్టినా నువ్వు లోపలికి కూరుకుపోవడం లేదేమిటి బలి చక్రవర్తీ?!

ఇది **నాగార్జున సిమెంట్**‌తో చేసిన ఫ్లోరింగు స్వామీ - గట్టిగా ఉంటుంది - దీన్లోంచి చొచ్చుకుపోవడం అసాధ్యం!

MAM 51

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## మీ మూర్ఖత్వంతో పిల్లలను బలి చేయకండి

సింహాద్రి చొక్కాతో కళ్ళు తుడుచుకున్నాడు పొద్దుటి నుంచీ కడుపులో ఆకలి పుల్లగా పులిసిన తరవాణీ అన్నం తినాలంటే కడుపులో దేవింది

అమ్మా! నేనీ అన్నం తినను తమ్ముడికి వేడన్నం పెడతావు చెల్లాయి నీ దగ్గర పాలు తాగుతుంది నాన్నకి చేపల పులుసుంటే కానీ ముద్ద దిగదు కంచం ముందున్న ముద్ద దిగడం లేదు

పాతేస్తాను వెధవా! ఎదురు చెప్పడం బాగా అలవాటయింది తమ్ముడిలా అల్లరి చేయకుండా ఉన్నావా? వాడికి పస్టు మార్కులొచ్చాయి క(స్కా)లరుషిప్పు వచ్చింది చంటి ముండ మీద నీ కళ్ళా! మీ నాన్న పొద్దుటి నుండీ మన గురించేగా కష్టపడేది చదివే క్లాసు రెండేసిసార్లు పేలవుతావు" అప్పలమ్మ కొడుకుకి నీతులు చెప్తున్నాననుకుంది

సింహాద్రికింకా పన్నెండేళ్ళు నిండలేదు అమ్మకి కడుపు, పురుడు, ఇంట్లో చాకిరీతో విసుగు నాన్నకి తను బాగా చదవడనీ అల్లరి చేస్తాడనీ కోపం ఏదడిగినా అమ్మ తిట్లు నాన్న వీపు తట్లు తేలేట్లు కొడతాడు హాయిగా ఉండడానికి పుట్టలేదు తను పట్టుపరుపుల మీద నిద్రపోయి కార్లో ఊరేగాలన్నాడా? తమ్ముడితో మాట్లాడినట్లే అభిమానంగా మాట్లాడరు వేడి వేడి అన్నం, కంది పచ్చడి, తోటకూర ఇగురు వేసి పెట్టమంటే అమ్మ తిడుతుంది సాయంత్రం వరకూ బడికి పోకుండా ఇక్కడా అక్కడా ఆడాడు కడుపులో ఆకలి నకనకలాడిస్తోంది నాన్న మీద, అమ్మ మీద తెలియని కోపం నెమ్మదిగా ఇల్లు చేరాడు.

"ఏరా వెధవా! స్కూలుకెళ్ళలేదుట. తమ్ముడు చెప్పాడు. వెళ్ళి ముద్ద మింగి పడుకో!" అప్పలమ్మ వీధిలోనే కొడుకుకి స్వాగతం పలికింది

ఇంతలో తండ్రి వచ్చాడు వేడి చేపల పులుసు, కోడికూర వేసి తండ్రికి పెట్టింది పొద్దుటి అన్నం సింహాద్రి ముందుంచింది సింహాద్రి తలెత్తలేదు

చూడండి! ఇంటికి పెద్దవాడు వీడే చెప్పిన మాట వినకపోతే ఎలా?' అని అప్పలమ్మ ఏకరువు పెట్టింది

సింహాద్రి చిన్ని మనసుకి ఈ బరువు బాధ్యతలు ఎక్కుతాయా? తండ్రి కంచంలో పొగలు వచ్చే అన్నం, పులుసు వాసన, కమ్మని కోడికూర ఇవే నోరూరిస్తున్నాయి ఆకలి అవురావురు మంటున్నది అది తీరక కోపం, బాధ ఏం చెయ్యలేని అసహాయత మన దేశంలో ఇటువంటి పేద కుటుంబాల సంఖ్య అతడికి తెలియదు కద! కష్టపడి చదివి పైకి రావాలని ఇంగితం ఇంకా అలవడలేదు కద! అప్పలమ్మ కూడా నాగరికత తెలియని మనిషి. ఏటా కానుపు. భర్తకొచ్చే జీతం చాలీ చాలకుండా ఉంటుంది ఆ చికాకు ఎవరిమీద చూపాలో తెలియక సింహాద్రి పై విరుచుకుపడుతుంది



ఆ రాత్రంతా నిద్రలేదు సింహాద్రికి తెల్లారకుండా లేచి తండ్రి జేబులో చిల్లర తీశాడు టీకొట్టుకు వెళ్ళి టీ త్రాగుతుంటే అల్లరి చిల్లరి కుర్రాళ్ళతో జట్టుకుదిరింది వారి మాటలు తీయగా ఉన్నాయి సింహాద్రికి, ఆ కుర్రాళ్ళకు కూడా జారుడు మెట్ల మీద అడుగేస్తున్నామని తెలియలేదు బీడీలు కాల్చడం, చిల్లర కొట్టేయడం చూసి తండ్రి తన్నేవాడు అలా అలా చదువంటని సింహాద్రి చిన్న కొట్లో పనికి కుదిరాడు చేతిలో జీతం రాళ్ళు పడగానే తెలియని కసి. నాన్నకు సుష్టుగా పెట్టి తనకి తరవాణీ అన్నం పెట్టిన తల్లి గుర్తొచ్చి కోపం పెరిగింది బుద్ధిమంతుడుగా పేరు తెచ్చుకుంటూ ఇంట్లోవారి అభిమానం పొందుతున్న తమ్ముడు గడప దాటకుండా ఇంట్లో చాకిరీ చేసే చెల్లెలూ చాతకాని వారుగా తోచారు సింహాద్రి జీతం పట్టుకుని సారా అంగడికి వెళ్ళాడు అలా జీతం డబ్బులు సారా అంగడికి ధారపోస్తే తనని కష్టపెట్టిన తల్లితండ్రుల పై కసి తీర్చుకుంటున్నానన్న భ్రమలో కొట్టుకు పోయాడు. వ్యసనం పెరిగింది. ఇంట్లోవారు అతడిని మరింత లోకువ చేశారు అతడి కసి అతడినే ఓ రోజు బలిగొంది కల్తీసారా త్రాగి అకాల మృత్యువు వాత పడ్డాడు సింహాద్రి అతడు పోయాక పుత్రశోకంతో గోడు గోడున ఏడుస్తున్న అప్పలమ్మ ఏం చేయగలదు! సింహాద్రి బ్రతుకులో నిప్పులు కురిశాయి కద! అధ్వాన్నమైన అతడి జీవితం కొరగాకుండా పోయింది. సరిఅయిన వనరులు కల్పించి పిల్లలకు ప్రశాంతమైన వాతావరణం కల్పించాలన్న కనీస జ్ఞానం పేదతల్లి తండ్రులకు కలగాలికద! వారిలాంటి వారు



అజ్ఞానంలో కొట్టుకు పోయినన్నాళ్ళూ సింహాద్రి లాంటి వారు బలిఅవుతూనే ఉంటారు తెలివైన వారైనా, తెలివి తక్కువ వారైనా కన్నబిడ్డలకు సమానమైన ఆప్యాయతను పంచివ్వాలి

-కె. నాగేశ్వరి, పటమట, విజయవాడ

* * *

## 'తప్పు మనదే'

నేటి బాలలే రేపటి పౌరులై దేశ అభివృద్ధికి తోడ్పడాలి కానీ, వారి చిన్నారి మనస్సులు విషపూరితాలై, ఎంతో మంది మృగాల అకృత్యాలకు బలై, పెద్దల నిరాదరణకు గురై, అలనా పాలనా లేని అనాథలై, పూచిన మొగ్గ విరియకుండానే నేలరాలిపోతే అది ఎవరి తప్పు? మన తప్పు కాదా? లేక ఎన్నో ఆశలతో ఈ ప్రపంచంలో పుట్టిన ఆ చిన్నారి బాలలదా?

ఎక్కువ మంది పిల్లలకు జన్మనిచ్చి వారిని సరిగ్గా పోషించలేక చిన్న వయస్సులోనే వారి చేత వెట్టిచాకిరి చేయించడం, కుటుంబం గడవడానికి

వారిని అతి తక్కువ వేతనానికి కూలికి పంపించడం వంటి దారుణమైన పనులతో వారు తమ బంగారు భవిష్యత్తులో తీవ్ర పరిణామాలు ఎదుర్కొంటారు "పరిమిత కుటుంబమే చింతలేని కుటుంబం అనే సూక్తిని అందరూ గుర్తుంచుకొని తమ పిల్లల భవిష్యత్తుయే తమకు ముఖ్యమని ప్రతి తల్లిదండ్రులు భావించి వారిని సక్రమమైన మార్గంలో పెంచిన నాడు వారి భవిష్యత్తు నందన వనంలా వుంటుంది

క్షణికావేశంలో, క్షణికమయిన కోర్కెలకు తలవొగ్గి, జీవితంలో మోసగించబడిన మహిళలు చాలా మంది వున్నారు. ఒక బిడ్డకు జన్మనిచ్చిన తరువాత ఈ సమాజానికి జడిసి వారిని ఏ అనాథ శరణాలయాల పాలో, పేవ్‌మెంట్ల మీదో వదిలి వేస్తున్నారు తల్లిదండ్రుల నీడలో ప్రేమాభిమానాలతో పెరగవలసిన వారిని నాశనం చేసేది మనం కాదా? ప్రతి మహిళా నైతిక విలువలను తెలుసుకొని తన ప్రేగు తెంచుకొని పుట్టిన బిడ్డని తల యెత్తుకొని ధైర్యంగా పెంచి ఒక ఉత్తమ




పౌరుడుగా తీర్చిదిద్దిన నాడే వారు దేశాభివృద్ధికి తోడ్పడతారు

అనుకరణ అనేది పిల్లలకి ఊహ తెలిసిన నాటి నుంచి మొదలవుతుంది తల్లిదండ్రులు సక్రమమయిన మార్గంలో వున్నప్పుడే పిల్లలకి కూడా వారి నుంచి మంచి బుద్ధులు అలవడతాయి తల్లిదండ్రులు చేసే కొన్ని నికృష్టమైన, నీతి నియమం లేని పనులు అద్దంలాంటి స్వచ్ఛమైన వారి లేత మనస్సులపై తీవ్ర ప్రభావాన్ని చూపిస్తాయి వారిని సమాజంలో తలెత్తుకో లేకుండా చేస్తాయి ఈ పరిణామాలు వారిని భవిష్యత్తులో ఏ విధంగా మారుస్తాయో, వారిని ఏ విధంగా నాశనం చేస్తాయో మాత్రం ఊహించటం కష్టం కాని వారి భవిష్యత్తులో మాత్రం తీవ్ర అలజడిని రేపుతాయి

"పసి పిల్లలు దైవ స్వరూపాలు అంటారు స్వచ్ఛమైన, లేత వయస్సులో వున్న వారిపై రకరకాలుగా జరుగుతున్న ఈ దారుణాలను అరికట్టాలంటే ముఖ్యంగా తల్లిదండ్రులు బాధ్యత వహించవల్సి వుంటుంది అనాథ శరణాలయాల్లో పిల్లలు ఏ విధంగా వుంచబడుతున్నారో, వారి పోషణ సరిగ్గా వుందా లేదా అనే బాధ్యతలను



ప్రభుత్వము కూడా చాలా జాగ్రత్తగా నిర్వహించవలసి వుంటుంది అప్పుడే వారిపై జరుగుతున్న దారుణాలకు కొంతైనా పరిష్కార మార్గం దొరుకుతుంది

-మేచినేని అనూరాధ,
అశ్వారావుపేట

★ ★ ★

# బాధ్యులెవరు?

పిచ్చివాడి కోపంలా మండిపడుతున్నాడు సూర్యుడు అసలే రోహిణీ కార్తెమో ఎండ మహాప్రచండంగా వుంది ఎండకు జడిసిన జనం బైటకు రాక పోవడంతోనేమో – వీధంతా నిశ్రాత్రపు నిశ్శబ్దం ఆవరించివుంది పాపకు ప్రొద్దుటి నుండి మధ్యాహ్నం



వరకే స్కూల్– ఈ ఒంటి పూట బళ్ళవల్ల ఏం ప్రయోజనమో తెలీదు ఎర్రటి ఎండలో ఎర్రగా కమిలిపోయి వస్తారు పిల్లలు అదే నాలుగింటి వరకూ అయితే ఎండ ఇంత తీక్షణం వుండదుగా

పాపకు అన్నం పెట్టి – ఏడుస్తున్న చంటి బాబుకి గొంతెండి పోకుండా గ్లూకోజ్ నీళ్ళు ఆరారగా పోస్తున్న నేను 'అమ్మా– ఆకలి' అంటూ వినిపించిన కేకకి వీధిలోకి తొంగి చూశాను

ఎవరో ఏడెనిమిదేళ్ళ పిల్లవాడు బొద్దుగా వున్నాడు గాని తైల సంస్కారం లేని జుట్టుతో – వడిలిన పూవులా వున్నాడు "అమ్మా నిన్నటి నుండి అన్నం లేదు అన్నాడు నీరసంగా చక్కగా నీడపట్టునే కమ్మగా పెరుగన్నం తింటున్న మా పాప కన్పించింది 'తేడా' స్పష్టంగా వున్నా ఇద్దరి వయసూ – ఆకలి ఒకటే కదా అనుకొంటూ 'అలా అరుగుమీద కూర్చో' అని ఆ పిల్లాడికి చెప్పి ఒక పేపర్‌లో ఇంత అన్నం, కూరా పట్టుకెళ్ళి పెట్టాను అవురావురుమంటూ తింటోన్న ఆ బాబుని చూస్తే హృదయం ద్రవించింది

నీకు అమ్మా – నాన్నా లేరా అడిగాను కళ్ళలో నీళ్ళూరుతుండగా లేరన్నట్లు తలూపాడు

'మరి–మరి ఎక్కడుంటావ్

ఇలాగే అడుక్కు తింటూ ఏ రోడ్డు ప్రక్కనో పడుకొంటాను

అనాథాశ్రమా లుంటాయేమోగా– అందులో చేరక పోయావా అన్నాను ప్రభుత్వం చేసే నినాదాలేవో గుర్తొచ్చి

అక్కడుండే కన్నా ఇలా అడుక్కు తిండమే మంచిదమ్మా మాలాంటి వారికి కేటాయించిన రేషన్ మొత్తం ఆ అనాథాశ్రమ యజమానే దిగమింగుతాడు –పైగా మా అందరితో ఆయన ఫాక్టరీల్లో, ఇంట్లో వెట్టి చాకిరి చేయించుకొంటాడు అంటూ అటు ఇటూ చూసి కొందరు పిల్లల్ని అమ్మేస్తాడట గూడా నన్నలాగే ఎవరికో ఇచ్చాడు– మరెంత డబ్బు తీసుకొన్నాడో తెలీదు– వాడు ఈ పిల్లాడ్ని గుడ్డోడ్ని చేస్తే పైస లెక్కువొత్తయ్యా లేక కుంటోడ్ని చేస్తేనా అని ఇంకెవర్నో అడుగుతూంటే చాటుగా విన్న నేను ఇలా దూరంగా పరుగెత్తుకొచ్చేశాను అన్నాడు

వింటున్న నేను తెల్లబోయాను – అలాంటి వారుంటారా అనుకొంటూ

★★★★★★★★

ఓ నెల తర్వాతనుకొంటాను– మార్కెట్‌కి వెళ్ళి వస్తోంటే ఒకతను బాబూ నా కొడుకు పుట్టుగుడ్డి బాబూ, దానం చేయండి బాబూ అంటూ అడుక్కొంటున్నాడు అతని వెంబడే వున్న పిల్లాడ్ని చూస్తూ ఉలిక్కిపడ్డాను ఆపిల్లాడు – ఓ సారి మా గుమ్మంలోకి వచ్చి తన దీనగాథను చెప్పుకొన్న పిల్లాడే! అలా స్థాణువై నిల్చుండి పోయాను దీనికి బాధ్యులెవరనుకొంటూ

–వాలి హిరణ్మయీదేవి,
హైదరాబాద్ □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్

# ధన్యజీవి

## మద్దిరాల విజయశ్రీమణి

సెలవు రోజు కావటం వలన ఆఫీసులేదు ఇంట్లోనే సరదాగా గడుపుదామంటే శ్రీమతీ, పిల్లలు ఊళ్ళోలేరు చేసే పనీలేదు ఏదైనా చదవాలనే ఆసక్తి లేదు

లేచి డ్రెసప్ అయ్యాను.

మేమున్న వీధికి అవతలి వీధిలో నా కొలీగ్ శర్మ ఉంటున్నాడు వాళ్ళింటికి వెళ్ళి ఆయనతో కాసేపు బాతాఖానీకొట్టి, టైం పాస్‌చేసి అట్నుంచి హోటల్‌కు పోవచ్చు అనుకున్నా.

"శర్మగారున్నారాండీ?'

వాళ్ళ శ్రీమతి కనిపిస్తే అడిగాను

ఉన్నారు స్నానం చేస్తున్నారు "

'సరే, చేయనివ్వండి తొందరేం లేదు అందాక ఇలా కూర్చుంటాను "

అంతకు ముందు పరిచయమున్న ఫామిలీయే కనుక చనువుగా, ఆమె చెప్పకముందే అక్కడున్న కుర్చీలో కూర్చుని ప్రక్కనే ఉన్న పేపరు తీసుకున్నాను

ఏదో చప్పుడవటంతో అప్రయత్నంగా తలత్రిప్పి చూశాను అటువేపు

బాత్‌రూమ్ తలుపు చేసిన సవ్వడి అది నేను కూర్చున్న చోటికి పెరట్లో ఉన్న బాత్‌రూమ్ లోనికి వెళ్ళేవారు, వచ్చేవారు కనిపిస్తూనే వుంటారు

శర్మ, మరో స్త్రీ పనిమనిషిలా వుంది మరి వాళ్ళిద్దరి మధ్యగా ఒక వృద్ధురాలు నాకు తెలుసు ఆమె శర్మ తల్లిగారు

పనిమనిషి కూడా ఆసరాగా ఉన్నా, ఇంచుమించు తల్లి భారాన్నంతా తన మీదనే వేసుకుని నెమ్మదిగా నడిపించుకుని వస్తున్నాడు శర్మ

నాకు ఆశ్చర్యంగా వుంది

శర్మ శ్రీమతి చెప్పినట్లు స్నానం చేసింది శర్మకానే కాదు అతని లుంగీ! బనియన్ సగం తడిసిపోయి ఉన్నాయి అతని తల్లి మాత్రం అప్పుడే స్నానం చేసినట్లుగానూ అలసటగానూ, అస్తవ్యస్తంగా చుట్టిన చీరెతోనూ వున్నది

వాళ్ళు నా దృష్టినుండి తప్పుకుని అవతలి గదిలోనికి వెళ్ళిపోయారు

ఇదేమిటి? మగవాడు! శర్మ తాను చేయించట మేమిటి స్నానం? ఎంత తల్లయితే మాత్రం?'

ఎబ్బెట్టుగా అనిపించింది నాకు

భార్య ఉంది కదా? చేయించదా? అంత చెప్పి చేయించలేని అసమర్థుడా?

పోనీ ఎటూ పనిమనిషి ఉంది కదా? మరో పదో, పరకో ఎక్కువిచ్చి ఆమెనే చేయించేయ మనకూడదా?.

నా ఆలోచనలు చెదరగొట్టాయి శర్మ భార్య మాటలు 'మీ కసలు సిగ్గూ, లజ్జా లాంటివేం లేవు సరికదా, మీతో పాటు ఉన్నవాళ్ళకూడా ఉండనిచ్చేలా లేరు, ఛీఛీ "

ఏం ఇప్పుడు నీ సిగ్గుకు చిన్నతనమేమొచ్చింది?" విసుగ్గా అడుగుతున్నాడు శర్మ

"జయపాల్ గారొచ్చి అడిగితే మీరు స్నానం చేస్తున్నారని చెప్పాను ఇప్పుడు లోపలికి వచ్చేప్పుడు చూశారో ఏమో?"

"చూస్తే ఏం? నేనేం ఖూనీ చేశానా? చోరీ చేశానా? చేసే ఓర్పూలేదు చేస్తుంటే ఓర్చుకునే శక్తీ లేదు ఛ '

అసహనంగాఅంటున్నాడు శర్మ

ఈ సమయంలో రాకుండా ఉండాల్సింది నేను ఇప్పుడు చెప్పకుండా లేచి వెళ్ళిపోవటం బావుండదేమో

"ఇదిగో, చూడు నరసమ్మా, ఆ పౌడరు తెచ్చి, అమ్మకు ఒళ్ళంతా ఒత్తుగా రాయి

రాశాక, పళ్ళరసం త్రాగించు

పని మనిషికి పురమాయిస్తున్నాడు శర్మ

'మొహాలకు రాసుకోవటానికే నెలకో డబ్బా చాలటం లేదని ఛస్తుంటే, ఒంటికీ, ఇంటికీ కూడా వాడితే ఇంకెలా బాగు పడతాం? వచ్చే జీతం కాస్త ఈ సేవలకే సరి

శర్మ శ్రీమతి గొణుగుడు స్పష్టంగా వినిపిస్తుంది

"హలో, ఎంత సేపయ్యింది మీరొచ్చి'?

శర్మ పలకరింపుతో ఆలోచనలు విడిపోయాయి

చెప్పాను

ఫామిలీ వచ్చేశారా?

'లేదు అందుకే మీ యింటి మీదకు దండెత్తాను, బోర్ భరించలేక"

"ఓ కె ఫైవ్ మినిట్స్'

అంటూ లోపలికి వెళ్ళి పోయాడు శర్మ

అతను వెళ్ళిన ఐదు నిముషాలకు నాకు కాఫీ వచ్చింది

ఆ తర్వాత పావు గంటలో అతను స్నానం చేసి రెడీ అయి వచ్చాడు

ఇద్దరం కలిసి బైటపడ్డాం

ఏం మాట్లాడాలో తోచక మౌనంగా నడవసాగాము

వాళ్ళింట్లో సంభాషణ విన్నానేమోనని ఆయన ఫీల్ అవుతున్నాడేమో ననిపిస్తుంది నాకు

చివరికి నేనే అన్నాను

ఏమిటండీ ఆలోచిస్తున్నారు?

"అమ్మ గురించేనండీ "

"ఏమిటి మీ అమ్మగారి అనారోగ్యం?

'పక్షవాతంలా వచ్చింది ఓ కాలు, చెయ్యి స్వాధీనంలో ఉండవు మాటకూడా సరిగా మాట్లాడలేక పోతుంది

కొన్నాళ్ళు హాస్పిటల్‌లో ఉంచాము ఆశించినంత మెరుగేం కనిపించలేదు ప్రస్తుతం ఇంటి దగ్గరే ఉంచి ట్రీట్‌మెంటిప్పిస్తున్నా '

కొన్ని క్షణాలాగి అడిగాను

మీ తో బుట్టువు లెందరండీ? సిస్టర్స్ ఉన్నారా?

అర్థమయినట్లు అదోలా నవ్వాడు శర్మ నవ్వి అన్నాడు

'ఎవరూ లేరండీ, ఒక్కడినే నాన్న పదేళ్ళ క్రితమే పోయారు

కాసేపాగి, మళ్ళీ శర్మే అన్నాడు,

జయపాల్‌గారూ, అమ్మకు నేనే స్నానం చేయించటం మా ఆవిడకు చిరాకు కల్గించినట్లు, మీకో సందేహాన్ని కల్గించిందా?

"నో నో నేనసలు దాని గురించే ఆలోచించ లేదండీ?' బుకాయించబోయాను

"ఆల్‌రైట్, పోనివ్వండి, నేనే చెప్తాను అంటూ ఆగి, క్షణం తర్వాత చెప్పసాగాడు శర్మ

"అమ్మ మంచాన పడి తన పనులు తాను చేసుకోలేని అశక్తురాలయిన తర్వాత కొన్నాళ్ళవరకీ నేనామె పనులు గురించి ప్రత్యేకంగా పట్టించుకో లేదు

కారణం, ఇంట్లో మిగతా పనుల్లాగే అమ్మ బాధ్యత కూడా శ్రీమతే చూసుకుంటుందనే భరోసాతో

మందులూ, పళ్ళూ తేవటం, యోగక్షేమాలు కనుక్కోవటంతో నా పని అయిపోయిందనుకునే వాడిని

కానీ తరువాత్తరువాత తెల్సిందేమంటే శ్రీమతి నేను నమ్మినంత సహనవంతురాలు కాదు అనే నిజం

నన్ను కని పెంచిన తల్లి, మన శ్రేయోభిలాషిణి అయిన ఆమె అనారోగ్యంతో, వృద్ధాప్యంతో అసహాయురాలుగా వుంది మనం చూడాల్సిన వయస్సు, సమయం ఇదే

కన్నవారు తమ బిడ్డల మీద కురిపించే కొండంత ఆప్యాయతలో దాగిన రవ్వంత ఆశకూడా ఈ స్థితిలో చూస్తారనీ, చూడాలనే"

అంటూ ఎన్నోసార్లు నచ్చ జెప్పాను, అనునయంగా

ఫలితం లేదు ఆగ్రహించాను అధికారంతో ఆజ్ఞాపించాను జవాబుగా, నాతో ఎదిరించక పోయినా

నా మీది కోపం, విసురూ, అమ్మమీది విసుగూ అన్నీ కలిపి చూపులను, మాటలను ఈటెలుగా చేసి అమ్మమీద సంధించేది

మరో చిత్రం చెప్పమంటారా?

మనకు తెల్సినంత వరకీ అత్తలు ఆరడి పెట్టటం, కోడళ్ళు భరించటం అనేది సర్వ సాధారణంగా చెప్పుకుంటారు

కానీ, మా యింట్లో మాత్రం రివర్స్

కోడలే చిరాగ్గా మాట్లాడటం, చిందులు త్రొక్కటం అమ్మ అవన్నీ నావరకు రాకుండానే సరిపెట్టుకోవటం

తెలీనట్లు నటించే నాకు తెల్సిన సత్యం! ఎలాగో

వాళ్ళూ వాళ్ళే క్రిందా మీద పడి, సర్దుకు పోతారు నేను కల్పించుకుని తెగేదాకా లాగటం మంచిది కాదనుకుని తటస్థంగా ఉంటుండే వాడిని

ఓ రోజు నేను ఆఫీసు నుండి వచ్చాక అమ్మను పలకరిద్దామని ఆమె గదిలోనికి వెళ్ళాను

మంచంలో పడుకున్న అమ్మ క్రొత్తగా కనిపించింది ఆరోజు

పరిశీలనగా చూశాను

మా ఆవిడ చర్యకు నిప్పులు కురిపించేలా ఉన్ననాకళ్ళు అమ్మ మొహాన్ని చూసి వెచ్చని నీళ్ళను బొట్లు బొట్లుగా రాల్చాయి

నలుపూ, తెలుపుల సమ్మేళనంతో ఒత్తుగా ఉండే తలకట్టుతో, గంభీరంగా కనిపించే అమ్మ

నున్నటి బోడిగుండుతో పిచ్చిదానిలా భిక్షుకిలా నాగుండెను నలిపేస్తూ

చూడలేక, వేగంగా వెను తిరిగాను

'తలలో పేలుపడ్డాయి, రోజూ పని పెట్టుకుని చూసి, చిక్కులు తీసే ఓపిక, తీరిక నాకు లేవు అయినా ఇంకా ముసలిదానికి జుట్టు లేక పోతే నష్టం ఏవిఁటిట?

అదీ శ్రీమతి నిర్లక్ష్యపు జవాబు లాంటి ప్రశ్న జుట్టు ఎవరికి లేక పోయినా వచ్చే నష్టం ఏం లేదు

జుట్టుతో ఉండాలా? గుండుతో ఉండాలా? అనేది కాదు సమస్య

అవతలివ్యక్తి దయనీయస్థితిలో ఉన్నప్పుడు, మనం కర్కశంగా ప్రవర్తించి వాళ్ళను వేధించ కూడదనే నా ఉద్దేశం

రాగా, రాగా, అమ్మ దగ్గరకు వెళ్ళి కూర్చుంటుంటే, ఓ విధమైన దుర్వాసన రాసాగింది

కారణం ప్రతిరోజూ ఆమెకు శుభ్రంగా స్నానం చేయించి, బట్టలు మార్చక పోవటమే.

శ్రీమతిని తిట్టీ, కొట్టీ రోజూ ఆపని ఆమెతో చేయించవచ్చు కానీ ఇష్టం లేకుండా, ఆమెను అటు నెడుతూ, ఇటు నెడుతూ, చేసే సేవలు ఎంత సున్నితంగా, సుఖంగా ఉంటాయో ఆలోచించండి

ఉన్నవ్యాధికి, ఈ అవస్థలు తోడు చేసినట్లవుతుంది కదా?

పని మనిషి మీద వదిలేస్తే కాస్త భారీ శరీరం గల అమ్మ ఒక్కదానికీ అలవికాదు

అందుకే అప్పటి నుండీ పని మనిషి సాయంతో అమ్మ అవసరాలన్నీ నేనే చూస్తున్నాను

చూపు, వినికిడి తప్ప మాట లేని అమ్మ, మొదటి రోజు స్నానం చేయించబోతే

కన్నీరు కాల్వలు కడుతూంటే, కుంచించుకు పోతున్న శరీరంతో, దణ్ణం పెట్టినంత పని చేస్తూ, 'వద్దు వద్దంటూ' నన్ను వారించ బోయింది

ఉండమ్మా నేను స్నానం చేస్తుంటే నాకూ మీరే చేయించండి నాన్నగారూ అంటూ వచ్చే మన బేబీకి నేను చేయించటం లేదూ? నీవూ అంతే

అయినా అమ్మా నేను ఎనిమిదో తరగతి చదివే వరకు నీవు నాకు నలుగు పెట్టీ, ఒళ్ళు రుద్దీ, నీళ్ళు పోసే దానివి కాదూ? ఇప్పుడు నేను



పెద్దాడినయ్యాను నీవే పసి పాప లాంటిదానవు

నా బదులు తీర్చేసుకోనీ అమ్మా

ఈవిధంగా నచ్చ జెప్పే వాడిని

మా ఆవిడ అడుగుతూంటుంది

మీరలా చేయటం ఎవరేనా చూస్తే ఏమను కుంటారు?' అని

ఏమనుకుంటారు?

నేను మగాడినే కావొచ్చు

కానీ, అమ్మను మించిన మొనగాడినేం కాదుగా?

ఆమె స్త్రీ కావచ్చు అందుకే నాకు జన్మనిచ్చి, పాలిచ్చి పెంచిన నాతల్లి అయ్యింది

ఏ స్థితిలో ఉన్నా ఆమె నా తల్లి

ఎంత వయసొచ్చినా నేనామె బిడ్డను దట్సాల్

నా వెనుకే అయినా, కొందరేమని కామెంట్ చేస్తున్నారో తెల్సండీ? అడిగాడు శర్మ

ఏమంటున్నారు?

పెళ్ళానికి చెప్పి చేయించలేని వాజమ్మనని

బట్ ఐ డోంట్ కేర్‌దట్

ఎందుకంటే, బాదలు అర్ధం చేసుకునే వాళ్ళకు, బాద్యతలు పంచుకునే వాళ్ళకు మనం ప్రాదేయపడి చెప్పఖ్ఖర్లేదు

ఆ రెండూ తెలియని వాళ్ళకు చెప్పే వ్యర్ధమే ఏమంటారు?"బాధగా నవ్వుతూ అడిగాడు శర్మ

నిజమే

నెమ్మదిగానే అయినా, మనస్పూర్తిగా అన్నాను

సో మరొక్కమాట

## "ధన్యజీవి"

ఏమిటన్నట్లుగా చూశాను నేను

మీరేదో చూశారని గాని, మా ఆవిడ మాటలు విన్నారనిగానీ నేను గిల్టీగా ఫీలవుతూ, ఇవన్నీ మీకు చెప్పటం కాదండీ

ఆలోచనతో గుండె బరువెక్కి ఏదో మీకు ఫ్రెండ్లీగా

శర్మ మాటలు పూర్తిగాక ముందే నేనన్నాను

థాంక్యూ

కానీ నామనస్సులో ఏదో అలజడి రేగింది నేనూ, చెల్లాయి అమ్మా, నాన్న సంతానం

దాదాపు నాలుగేళ్ళ క్రితం అమ్మ చనిపోయింది నాన్న నా దగ్గరే ఉంటుండే వారు

ఆయన బాగున్నప్పుడే సమస్యా ఉండేది కాదు కానీ, ఏ కాస్త నలతగా ఉన్నా, ఆయన మందుల కన్నా, ఆహారం కన్నా పదేపదే 'అమ్మాయికి కబురు చేయరా' అనేవారు

నా బార్య అంటుండేది

ఎప్పటి కప్పుడు చచ్చిపోతున్నట్లు కూతుర్ని పిలవ మంటారేం మీనాన్న? ఏం మనం మనుషులం కాదా? అని

నిజానికి నాకూ ఆయన ఆదోరణి విసుగూ, కోపాన్ని తెప్పించేది చివరికి నాన్నతో చెప్పేశాను

"మీరు వెళ్ళి చెల్లాయి దగ్గరే ఉండండి నాన్నా మీరు అవును, కాదన్నా మీ కోడలు చెప్పినట్లు, నా మీద కంటే చెల్లాయి మీదే మమకారం ఎక్కువ

అయినా పర్లేదులే ఎప్పుడన్నా డబ్బులు పంపుతూ వచ్చి చూస్తుంటానులే

అని పంపాను ప్రస్తుతం ఆయనక్కడే ఉన్నారు కానీ నా కిప్పుడనిపిస్తోంది

ఈ వయస్సులో వాళ్ళు బిడ్డల నుండి ఆశించేది మొక్కుబడిగా పెట్టే తిండికోసం కాదని

దగ్గర కూర్చుని అబిమానంగా, ఆత్మీయంగా పలకరించే తీరు కోసమే తపిస్తారేమోనని,

శర్మ మాటలు నా ఆలోచనలను చెల్లా చెదురు చేశాయి

అరె మాటల్లో పడి చాలా దూరం వచ్చేశాం సరదాగా గడుపుదామని వచ్చిన మీకు నాగొడవంతా చెప్పుకుంటూ తలనొప్పి తెప్పించానేమో కదూ'

లేదండి పైకి సామాన్యంగా, చిన్నగా కనిపించే విషయాల వెనుక ఎలాంటి బాదలు దాగుండులూ ఉన్నాయో వివరించారు

ముందు హోటల్‌కు పదండి ఓ స్ట్రాంగ్ టీ త్రాగుదాం అంటూ అటు దారి తీశాడు శర్మ అనుసరించాను

శర్మా, మీ అమ్మలాంటి అమ్మలు చాలా మందిక ఉంటారు గానీ, మీ లాంటి కొడుకులు ఎందరుంటారు?

అందుకే మీరు కాదు మీ అమ్మ ధన్యజీవి శర్మతో అనలేదు అనుకున్నాను లోలోన □

# వారఫలం

## 8-5-1987 శుక్రవారం మొదలు 14-5-1987 గురువారం వరకు

★ **మేషం** . శ్రమకు తగిన ఫలితం అందగలవారం వ్యాపారాన లాభిస్తుంది పత్రికా వ్యాసంగం ఫలిస్తుంది ఎనీ చాన్సులకై యత్నిస్తే అనుకూలం సాహితీపరంగా మేలే స్త్రీలకు వృత్తి యందు పెంపు. ఉద్యోగరీత్యా మేలు. ఆదాయ మున్నది గ్రహించాలి

★ **వృషభం** సాటి వారి పోటీ హెచ్చు తుంది ఈ వారంలో ఏవేవో సాధించాలను కొంటారు. చివరకు ఏదీ సాధించలేక పోతారు ఇంటి నుండి పారిపోయిన వారి జోగట్టా తెలుస్తుంది అనవసర వ్యవహారంలో చిక్కుకొని కొందరు బాధపడుతారు స్త్రీలకు: నూతన యత్నాను కూలం ఆదాయం

★ **మిధునం** . నూతనాంశాలు గ్రహిస్తారు వృత్తి యందు ప్రగతి కనిపిస్తుంది వ్యవహార రంగాన మీకు అనుకూలం కోర్టు వ్యవహారాలుంటే అనుకూలం. యత్న కార్యసిద్ధి ఆశించిన విధంగా డబ్బు అందుతుంది స్త్రీలకు విలాస వస్తు సేకరణ. ఉద్యోగరీత్యా కొందరు ప్రైమెట్లు అందుకొంటారు

★ **కర్కాటకం** లేనిపోని తగాదాలు రావచ్చు గ్రహానుకూలత గల వారంగాదు చేయాలనుకొన్న వ్యవహారం అంత అనుకూలం గాదు రచనా విధానాన. నటనారంగాన చిక్కిన అవకాశాలను సద్వినియోగం చేసికోండి స్త్రీలకు ఆరోగ్య లోపం లేకుండా చూచుకోండి ఎవరెవరినో నమ్మటం తగదు

★ **సింహం** : ముందు వెనుక లాలోచించి చేసిన పనులకు ఆటంకాలు రావు ఈ వారమంతా అలా సంచరించండి ఆరోగ్యాన్ని కాపాడుకోండి వృత్తియందు ప్రగతి సాధించండి స్త్రీలకు క్రొత్త విషయాలు తెలిసి కొంటారు క్రొత్త వస్తువులు సేకరించుకో గలుగుతారు

★ **కన్య** ఒకానొక విషయంలో శుభ్రంగా మీకే అనుకూలం మాటకు విలువ పెరుగుతుంది. గౌరవాధిక్యత కొందరకు ప్రత్యేకంగా పత్రికా గౌరవానికి ఆస్కారం ప్రయోజనకరముల్లైన ఆలోచన లుంటాయి బాగస్థుల వలన మీ వ్యాపారాన యిబ్బంది రాకుండా చూచుకోండి స్త్రీలకు వృత్తి యందు పెంపు, ఆనందోత్సాహాలు

★ **తుల** సర్వవిధాలా మేలైన వారం ముఖ్యంగా డబ్బు చిక్కుతుంది నూతన మిత్రులు చేరుతారు తద్వారా ఆదాయ మున్నది రాజకీయా లలో ఏదో విఘాతం తప్పదు స్త్రీలకు వారాంతం యోగ్యం ఆదాయ మున్నది

★ **వృశ్చికం** వారమంతా ఆరోగ్యం చూచుకోవాలి మరి వయోవృద్ధులు జాగ్రత్త చూపాలి ఇంట జరుగవలసిన శుభం వాయిదా పడుతుంది మాటకు విలువ చేకూరుతుంది కళా సాహితీరంగాలలో అవకాశా లుంటాయి స్త్రీలకు సర్వానుకూల వారం ఆరోగ్యరీత్యా అభివృద్ధి

★ **ధనుస్సు** . నూతన వ్యాపారం చేయాలనే మి సంకల్పం నెరవేరుతుంది వృత్తి యందు పెంపు చెప్పదగిన సమయం మాటకు విలువ పెరుగుట గమనింప దగిన సమయం స్త్రీలకు అనుకూల దినాలు డబ్బు అందుతుంది అవసరాలు సునాయాసంగా తీరుటలో ఆనందం

★ **మకరం** . మీ యింటికి అనుకోకుండా బంధువులు రానున్నారు మాట నలుగురిలో చెలామణి అవుతుంది స్థితిగతులందు పెంపున్నది ఆదాయమందు అభివృద్ధి, వ్యాపార మందు అనుకూలం. సభా గౌరవానికి ఆస్కారం స్త్రీలకు వస్తు సేకరణకు అధిక వ్యాపారానుకూలం

★ **కుంభం** . ఒక విషయం చేయాలని కేంద్రీకరించి వేరొక విషయంపై దృష్టి నిలుపుతారు అనుకూల వారంగానే పరిగణన రాశి బలం అనుకూలం ఆశించిన ధనం అందుతుంది స్త్రీలకు నూతనాంశాలు గ్రహిస్తారు

★ **మీనం** ధనాదాయ మున్నది, వ్యాపార రీత్యా అనుకూలత. బాగస్థులతో తగాదాలు రాకుండా చూచుకోవాలి విద్యా విషయంగా మీకు పెంపు చెప్పదగిన సమయం దూరబారాలకు కొందరు వెళ్లాలనే యత్నం కొనసాగుట గమనించదగిన అంశం స్త్రీలకు ఉద్యోగరీత్యా పెంపు. అనుకూల వార్తా శ్రవణం

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



తమిళనాడు శాసన సభాపతి శ్రీ ఏ హెచ్ పాండ్యన్ తమకి రాజ్యాంగం ద్వారా సంక్రమించిన విశేషాధికారాలతో ప్రముఖ తమిళ వార పత్రిక ఆనందవికటన్ సంపాదకుడు శ్రీ ఎస్ బాల సుబ్రమణ్యానికి మూడు నెలల కఠిన కారాగార శిక్ష విధించారు ఆ వార పత్రిక అట్టమీద శాసన సభ్యులు మంత్రులు పెద్ద మనుషులు కారన్నట్లు చిత్రించిన వ్యంగ్య చిత్రాన్ని ఒక దానిని ప్రచురించినందుకు శ్రీ పాండ్యన్ ఆ చర్య తీసుకున్నారు శాసన సభ్యులని, మంత్రులని విమర్శించే పత్రికలన్నీ అశ్లీలమైనవేనని కూడా ఆయన అన్నారు దీనిపై పత్రికా స్వాతంత్ర్యాన్ని, బావ ప్రకటనా స్వేచ్ఛని. సునిశిత హాస్య ధోరణిని అరికట్టడానికి తమకు గల అధికారాలని ఉపయోగించ డానికి ప్రయత్నిస్తున్నారనే విమర్శలు చెలరేగాయి శ్రీ బాలసుబ్రమణ్యం తరఫున కేంద్ర దేశీయాంగశాఖ సహాయ మంత్రి శ్రీ చిదంబరం క్షమాపణలు చెప్పారు చివరికి 48 గంటల తర్వాత శ్రీ పాండ్యన్ తమ కోపాన్ని తగ్గించుకుని మరోసారి తమకి గల విస్తృతాధికారాలని వినియోగించి శ్రీ బాలసుబ్రమణ్యాన్ని విడుదల చేయించారు శ్రీ బాలసుబ్రమణ్యం ప్రఖ్యాత చలన చిత్ర నిర్మాత కీ శే ఎస్ ఎస్ వాసన్ కుమారుడు □



శ్రీమతి ఇందిరా గాంధి హత్యానంతరం చెలరేగిన హింసాకాండపై దర్యాప్తు జరిపిన విచారణ సంఘానికి అధ్యక్షత వహించిన సుప్రీం కోర్టు న్యాయమూర్తి శ్రీ ఎం పి ఠక్కర్ ఇప్పుడు సంచలనం సృష్టించిన మరో వ్యవహారాన్ని దర్యాప్తు చేసే విచారణ సంఘానికి అధ్యక్షులుగా నియమింపబడ్డారు ఫెయిర్ ఫాక్స్ గ్రూప్ వ్యవహారాన్ని కూలంకషంగా పరిశీలించే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం నియమించిన విచారణ సంఘానికి ఆయన అధ్యక్షులు ఆయనతో పాటు మరో న్యాయమూర్తి శ్రీ నటరాజన్ కూడా ఆ సంఘంలో సభ్యులుగా ఉన్నారు శ్రీ ఠక్కర్ ఫెయిర్ ఫాక్స్ వ్యవహారంపై తమ నివేదికని మూడు నెలలలో ప్రభుత్వానికి అందజేయవలసి ఉన్నది □

సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

కొంత దూరం నడిచి ఖాళీ ఆటో ఆపి ఎక్కి కూర్చుని వెనుక వస్తున్న ప్రత్యూషని కోపంగా చూసింది ప్రఫుల్ల

ఆ ఆటో కనుమరుగు అవుతూండగా మరో ఖాళీ ఆటో ఎదురుపడితే ఆపి ఎక్కేసింది ప్రత్యూష

ముందు పోతున్న ఆటోని ఫాలో అవమని చెప్పింది డ్రైవరుకి

ప్రఫుల్లకి తెలియకుండా రెండు మూడు రోజులు కాలేజీకి వెళ్ళి ఆమె ఫ్రెండ్సుని కలిసింది

ఈ మధ్య తరచుగా ప్రఫుల్ల క్లాసులు మిస్ అవుతోందని వారు చెప్పగా విని కలవరపడింది

క్లాసులు ఎగ్గొట్టి అది ఎక్కడికి వెడుతోందో మీకు తెలుసా? అడిగింది, ఆమె ఫ్రెండ్సుని

సారీ! మాకు తెలియదు ఓ బోయ్ ఫ్రెండుతో మొన్న ఒక రోజు పార్కులో చూశాను మర్నాడు కాలేజీకి వచ్చాక ఎవరే అని అడిగితే జస్ట్ ఫ్రెండ్ అని చెప్పింది అందామె

థాంక్యూ! అని బయటికి వచ్చేసింది

ఇంకా ఎవరినైనా అడిగితే ఇంకా ఎటువంటి మాటలు వినాల్సివస్తుందో నన్న భయం చేతను, ఇంకా తరిచి తరిచి అడిగితే రేపటి నుంచి చెల్లెలి గురించి వాళ్ళు చీప్‌గా ఊహించుకుంటారేమోనన్న భయం చేతను వెనక్కి వచ్చేసింది

ఇంతకు ముందు ప్రఫుల్ల ఫ్రెండు ఇంటికి వెడుతున్నా నన్నప్పుడు ఏ ఫ్రెండు అని అడిగి ఆమె వెళ్ళాక ఆ ఫ్రెండు ఇంటికి ఫోను చేసి ప్రఫుల్ల గురించి అడిగింది

ఆమె ప్రఫుల్ల మా యింటికి రాలేదు అని చెప్పడం నాలుగైదు సార్లు జరిగింది

అందుకే ఇకనుంచీ చెల్లెల్ని ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళ నివ్వకూడదని గట్టిగా నిర్ణయించుకుంది ప్రత్యూష

ఆ ప్రయత్నంలో భాగమే ఇప్పుడీ ప్రయాణం

జరిగిన కథ –6 ప్రహ్లాద్ స్నేహితుడు మనోజ్ మాలతీదేవి కుటుంబంతో నెల రోజులు గడిపి ప్రహ్లాద్ భార్య పత్నిల చెల్లెళ్ళు ప్రఫుల్ల, ప్రత్యూష మాలతీదేవిల మధ్య ఆప్యాయాను రాగాలకు ముగ్ధుడవుతాడు ప్రత్యూషను వివాహం చేసుకుని ఆ కుటుంబంలోకి రావాలని ఆకాంక్షిస్తాడు అతని ప్రస్తావనకు అంగీకరించబోయిన మాలతీదేవి అతను సావిత్రి కొడుకని తెలియగానే మళ్ళీ ముఖం చూపవద్దని శాసిస్తుంది ప్రహ్లాద్ తల్లి నుంచి ఆ విషయం మొత్తం తెలుసుకుంటాడు ప్రఫుల్ల స్వంత చెల్లెలు కాదని తెలుస్తుంది ప్రఫుల్ల అన్యమనస్కత గురించి ప్రత్యూష, మాలతీదేవి ఆందోళన పడుతుంటారు

ట్రాఫిక్ సిగ్నల్స్ అనుకూలించడం వల్ల ప్రఫుల్ల ఎక్కిన ఆటోని పట్టుకోవడం పెద్ద కష్టం కాలేదు ప్రత్యూషకి

కానీ, వెనుక ఉండడం వల్ల ప్రత్యూషని గమనించలేదు ప్రఫుల్ల కాసేపు ఆ వీధి, ఈ వీధి తిప్పి ఆఖరుకి ఇందిరా పార్కు ముందు ఆటో ఆపించి దిగి లోపలికి వెళ్ళింది వెనక్కి, పక్కలకీ ఒకసారి చూశాక

అల్లంత దూరాన్నే ఆటో ఆపించి మెల్లగా లోపలికి నడిచింది ప్రత్యూష

చెట్టెలి పక్కన ఒక యువకుడు ఉలిక్కిపడి ఒక పొద పక్కగా నిలబడి చూసింది

ఇద్దరూ విరగబడి నవ్వుతున్నారు మధ్య మధ్యలో ప్రఫుల్ల వెనక్కి తిరిగి చూస్తోంది తన కోసమేనని గ్రహించి కనిపించకుండా మరింత జాగ్రత్త పడింది ప్రత్యూష

ఇదిగో ధీరజ్, నువ్వేమో రమ్మని గొప్పగా, దర్జాగా ఫోను చేస్తావు ప్రతీసారీ నేనిలా రావడానికి ఎన్ని ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సి వస్తోందో తెలుసా? మా అక్కకి ఈ మధ్య నా మీద అనుమానం వచ్చి నన్ను వేయి కళ్ళతో గమనిస్తోంది తెలుసా? ఇవాళ దాన్ని తప్పించుకుని వచ్చేసరికి నా తలప్రాణం తోకకి వచ్చింది నువ్వు నీ మీద ఒట్టు పెట్టుకోక పోయిఉంటే హాయిగా మా యింట్లో చెప్పేసేదాన్ని

నేను చెప్పేది అర్థం చేసుకోవేం ప్రఫూ! నాకో మంచి ఉద్యోగం రానీ నేనే వచ్చి మీ అమ్మగారిని అడిగి మరీ నిన్ను నా స్వంతం చేసుకుంటాను ఇప్పుడు మీ అన్నయ్యగారి దయా ధర్మంతో బ్రతుకుతున్న వాడిని ఆయన ముందు నిలబడి మీ చెల్లెల్ని నా కిచ్చి పెళ్ళి చెయ్యండి అంటే, నీకే గతిలేదు, అల్లారు ముద్దుగా పెరిగిన నా చెల్లెల్ని ఎలా పోషిస్తావు అని అడిగితే నేనేం సమాధానం చెప్పగలను చెప్పు? గట్టిగా మాట్లాడితే ఉద్యోగంలో నుంచి తీసి పారేస్తారు ఈ రోజుల్లో ఈ మాత్రం ఉద్యోగం దొరకడం ఎంత కష్టమో నాకు బాగా తెలుసు కొన్నాళ్ళు ఓపిక పట్టు నా కోసం ప్లీజ్

ఇక్కడికి రమ్మని, అక్కడికి రమ్మని ఇంకోసారి నాకు ఫోను చెయ్యకు చచ్చినా రాను కాలేజీ ఉన్నప్పుడు అయితే ఎవరికీ తెలియదు గానీ హాలిడేస్‌లో నావల్ల కాదు స్పష్టంగా చెప్పేసింది ప్రఫుల్ల

అలా అంటే ఎలా ప్రఫూ! నీకు కాలేజీ ఉన్న రోజుల్లో నాకు డ్యూటీ ఉంటుంది డ్యూటీని నిర్లక్ష్యం చేసి ఆదరించి ఉద్యోగం ఇచ్చిన మీ అన్నయ్య గారిచేతనే చెడుగా అనిపించుకోవడం నాకు ఇష్టం లేదు అలా అని నిన్ను చూడకుండా ఉండలేక పోతున్నాను

నిన్ను చూడకుండా నేను మాత్రం ఉండ గలుగుతున్నా నేమిటి? ఒక్క రోజు అయ్యేసరికే పిచ్చెక్కి పోతోంది ఆ చిరాకులో అమ్మతో, అక్కతో అందరితో నూ భలే పోట్లాడేస్తున్నాను అక్క అయితే తిడుతుంది గానీ, అమ్మ అయితే నన్నేమీ అనలేక ఏడుస్తోంది పాపం! నా నోరు కట్టేసి మా అమ్మని ఏడిపిస్తున్న పాపం నీదే" చిరుకోపం ప్రదర్శించింది ప్రఫుల్ల

'పిచ్చి ప్రఫూ! మరీ అంతలా తల్లిని ఏడిపిస్తారా ఎవరైనా! తప్పుకదూ! కొద్ది

రోజులు ఓపిక పట్టు చిన్నీ వేరే ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను అది రాగానే నేనే వచ్చి చెప్తాను అంతవరకూ నా గురించి మీ ఇంట్లో చెప్పకు ప్లీజ్ బ్రతిమాలాడు

సర్లే! నీకు ప్రామిస్ చేశాక ఎందుకు చెప్తాను

ప్రఫుల్ల చెయ్యి అతని చేతుల్లో నలుగుతూంటే ఇక్కడ ప్రత్యూష గుండె దడదడలాడుతోంది కాళ్ళు వణుకుతున్నాయి

ఛీ! దీనికసలు బుద్ధిలేదు చెల్లెల్ని తిట్టుకుంది

ఇదిగో! నువ్విలా మూతి ముడిచి పెట్టుకుని కూర్చుంటే నేను చెడ్డవాడినై పోవాల్సివస్తుంది ఆ తరువాత నీ ఇష్టం!



# ప్రత్యూష పవనాలు

'ఆ' అపుతావు పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే జన్మలో నీ ముఖం చూడను". బెదిరించింది ప్రఫుల్ల

'ఒ కె! ఒ కె! నీ కిష్టంలేని పని నేనెప్పుడూ చెయ్యను. ఎంతో అల్లారు ముద్దుగా పెరిగిన నువ్వు ఏమాత్రం బాధపడినా నా మనసు విలవిల్లాడి పోతుంది "

చాల్చాల్లే! సుత్తి కొట్టకింక. ఇంక నేను వెడతాను నేనెక్కడి కెళ్ళానో తెలియక మా అక్క కంగారుపడుతూ ఉంటుంది " ధీరజ్ చేతుల్లో ఉన్న తన చేతిని విడిపించుకుని లేచి నిలబడింది ప్రఫుల్ల

"మళ్ళీ ఎప్పుడో దేవిగారి దర్శనం " తనూ లేచి నిలబడ్డాడు ధీరజ్

"తమరు కోరుకున్నప్పుడు" అంటూ నవ్వింది ప్రఫుల్ల

'ఒ కె థాంక్యూ పద వెడదాం '

'నువ్వు ఇప్పుడే రాకు మహానుభావా! మా అక్క ఎదురుపడిందంటే తోడుదొంగలం బయటపడి పోతాము. మనం చెప్పక్కర లేకుండానే అంతా గ్రహించేస్తుంది అదసలే ఆవలిస్తే పేగులు లెక్కపెట్టేరకం ఆ తరువాత యక్ష ప్రశ్నలతో నన్ను వేధించి చంపుతుంది అది అలా నిలదీసి అడిగితే కరిగిపోయి ఉన్నదున్నట్లు చెప్పెయ్యనైనా చెప్పెయ్యాలి లేదా, అకారణంగా దాన్ని ఎదిరించి అల్లరి చెయ్యనైనా చెయ్యాలి "

'బాప్‌రే! అసలు నిన్నెలా అర్థం చేసుకోవాలో నా కర్థం కావడం లేదు చిన్నీ ఒ కె! నీకు లేటు అవుతోందేమో వెళ్ళు మళ్ళీ కలుద్దాం" సున్నితంగా ఆమె చెయ్యి నొక్కి వదిలేశాడు ధీరజ్

జారిపోతున్న హేండ్‌బేగ్‌ని సరిగ్గా భుజమ్మీదికి పెట్టుకుని గబగబా ముందుకి నడిచింది ప్రఫుల్ల

అంతకు ముందే బయటికి వెళ్ళిపోయిన ప్రత్యూష అప్పుడే లోపలికి వస్తున్న దానిలా వస్తూ ప్రఫుల్లని చూసి ఆగిపోయి ఆమె దగ్గరకి వచ్చాక, ఇక్కడున్నావా? ఇంకా ఎక్కడి కెళ్ళావా అని హడలి చస్తున్నాను నేను" అంది నిజంగా హడలి పోతున్న దానిలా నటిస్తూ

"చాల్లే పెద్ద కొలంబస్‌వి బయలుదేరావు ఇక్కడికి ఎందు కొచ్చినట్లు?" కోపంగా అంది విసవిసా నడుస్తూ

ఎందుకొస్తాను? నా చెల్లెల్ని ఏ కాకో, పిల్లో ఎత్తుకు పోయిందేమోనని భయం వేసి వెతుక్కుంటూ సిటీ అంతా తిరిగి తిరిగి చివరికి ఇక్కడి కొచ్చిపడ్డాను గాడ్ ఈజ్ గ్రేట్! లక్కీగా నువ్వు ఇక్కడ కనిపించావు బైదిబై! ఇంక ఇంటికి వెళ్ళడమేనా? ఇక్కడ ఇంకా ఏమైనా పనుందా?" నవ్వుని బిగబట్టి అడిగింది ఏమీ ఎరుగనిదానిలా

తను చూసిన దృశ్యం మనసులో కలవరాన్ని రేపినా తను చూసినట్లు తెలిస్తే చెల్లెలు ఇంకా రెచ్చిపోయి గొడవ చేస్తుందని జోకీగా మాట్లాడడం మొదలుపెట్టింది

"నేనేదో అఘే రిస్తాను నువ్వు పద!" విసురుగా నడుస్తూ కాలు స్లిప్ అయి పడబోయింది కానీ, గబుక్కున పడకుండా పట్టుకుంది వెనుక ఉన్న ప్రత్యూష

కాలు పైకెత్తి పట్టుకుని ప్రత్యూషని అనుకుని నిలబడి పోయింది ప్రఫుల్ల

'చిన్నీ! వెనుకా ముందూ చూసుకోకుండా తప్పటడుగు వేస్తే ఫలితం ఇలాగే ఉంటుంది ఏ విషయంలోనైనా." అంది, కాలు సరిచేస్తూ

"నిన్నేమీ, ఎవరూ అడగ లేదు" కోపంగా ముఖం పక్కకి తిప్పుకుంది ప్రఫుల్ల.

"నువ్వు అడక్కపోయినా నువ్వు తప్పటడుగు వేస్తుంటే సరిచేయ వలసిన బాధ్యత నీ అక్కగా నా మీద ఉంది! ఆఁ! మెల్లగా నడు " రెక్క పట్టుకుని నడిపించింది

"బాధ్యతట బాధ్యత! నేనేదో తప్పుడు పనులు చేస్తున్నట్లు. .. అక్కడికి తనేదో మొనగత్తె అయినట్లూను!"

ఖాళీగా పోతున్న ఆటో ఆపి, "ఊఁ! సణుగుడు ఆపి ఆటో ఎక్కు " కసిరింది ఇంటికి వచ్చేవరకూ ప్రత్యూషతో మాట్లాడ లేదు ప్రఫుల్ల

రాగానే తల్లి బలవంతంతో రెండు మెతుకులు తిని తలనొప్పిగా ఉందంటూ ముసుగెట్టుకుని పడుకుంది ప్రఫుల్ల, ప్రత్యూషకి ఏమి మాట్లాడడానికీ అవకాశం ఇవ్వకుండా

ఒకవేళ అక్క తమని చూసిందేమో అన్న అనుమానం ప్రఫుల్ల మనసులో చెదపురుగులా తొలుస్తోంది నిలదీసి అడిగితే దాపరికం లేకుండా తన ప్రమేయం లేకుండానే నిజం బయట పడిపోతుంది అసలు అలా అడిగేందుకు అవకాశం ఇవ్వకుండా ఉంటే మరునాటికి పాతపడి పోతుంది కదాని ఆమె ఉద్దేశ్యం. అందుకే నిద్రపోతున్నట్లు కదలకుండా పడుకుండి పోయింది

* * * * * *

"చిన్ని ధీరజ్‌ని ప్రేమిస్తోంది. అతనికి మాట ఇచ్చిన కారణంగా ఆ విషయం బయట పెట్టలేక పోతోంది అలా అని అతన్ని కలుసుకోవడం మానదు మనసులో దాచుకోలేక, బయటికి చెప్పలేక పిచ్చిదానిలా ప్రవర్తిస్తోంది. అతనికి సరియైన ఉద్యోగం దొరికేవరకూ ఈ కథ ఇలా నడుస్తూనే ఉంటుందన్న మాట. కానీ, అతనికి వెంటనే మంచి ఉద్యోగం ఎలా దొరుకుతుంది? తనవల్ల అయ్యే పని కాదు. ఈ కథ ఇలా కొనసాగడం మంచిది కాదు కాబట్టి అన్నయ్యకి చెప్పి ఏదో పరిష్కార మార్గం ఆలోచించి, దాని పెళ్ళి త్వరగా జరిగేలా చూడాలి." అనుకున్నాక గానీ, నిద్ర పట్టలేదుప్రత్యూషకి.

* * * * * *

టేప్ రికార్డరు ఆఫ్ చేసి తలెత్తి చూశాడు ప్రహ్లాద్

"మైగాడ్! మైగాడ్!" పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు మనోజ్.

"మనూ! టేకిట్ ఈజీ" భుజం తట్టాడు ప్రహ్లాద్

"ఆ మాట. . ఆ మాట నువ్వెలా అనగలుగు తున్నావురా! ఓహ్! నువ్వు... ఆ దేవత కడుపున పుట్టిన పుణ్యాత్ముడివి కదూ? కానీ. .. నేను..... నేను ... రాక్షసవంశంలో పుట్టినవాడినిరా. నా తల్లి ఒక రాక్షసి. నా తల్లిని కన్న తల్లి ఒక బ్రహ్మరాక్షసి. నేను నీలా ఈ విషయాన్ని ఈజీగా తీసుకోలేక పోతున్నాన్రా!"

"మనూ! మీ అమ్మ నుంచి ఏ విషయం రాబట్టలేక పోయానని నువ్వు ఆవేదనతో ఉత్తరం రాస్తే అసలు విషయం నీకు తెలియ జేసి నీ ఆవేదన చల్లార్చాలని నిన్ను రమ్మని రాశాను గానీ, నువ్విలా పిచ్చివాడిలా తయారవుతా వనుకుంటే అసలు రమ్మని రాసేవాడినే కాదు. పెద్దవాళ్ళ వల్ల జరిగిన పొరపాట్లకి నువ్వు ఇప్పుడు బాధపడి చెయ్యగలిగే దేముంది?" అనునయంగా భుజం తట్టాడు ప్రహ్లాద్.

"ఏముందా? ఒరేయ్! ఇన్నాళ్ళు అమ్మ మాటకి ఎదురు చెప్పకుండా ఆవిడ చెప్పిన దానికల్లా గంగిరెద్దులా తలూపుతూ కాలం గడిపాను. ఇక చూపిస్తాను నా తడాఖా. అటునుంచే కథ నడుపుకొస్తాను "

"మనూ! ప్లీజ్ అలా ఆవేశపడకురా!"

"ఆవేశం కాదురా. బాధ– నాకు చెప్పలేనంత బాధగా ఉంది. అంతకంటే ఎక్కువగా సంతోషంగా కూడా ఉంది. ఎందుకో తెలుసా? మీ కుటుంబంతో బంధుత్వం కలుపుకోవాలను కున్నాను. ఇప్పుడు మనం నిజంగానే బంధువులం అని తెలిశాక నాకు చెప్పలేనంత ఆనందంగా ఉంది. ఒరే బావా! మీ చెల్లెల్ని నా కిచ్చి పెళ్ళి చెయ్యక పోయినా బాధలేదు. తనెక్కడ ఉన్నా సుఖంగా సంతోషంగా ఉండాలి. అదే నా కోరిక. ఒరేబావా! చిన్నీని మొదటిసారి చూసినప్పుడే ఎక్కడో, ఎప్పుడో చూసినట్లు అతిపరిచితమైన వ్యక్తిలా అనిపించింది. అందుకే అలా

హలో! మీరంతా వారం, వారం "సినిమారంజని" చదువుతున్నారా?

చలనచిత్ర
రంగానికి సంబంధించిన
ఎన్నో కొత్త, కొత్త
విషయాలు
తెలుస్తాయి!!




చదవండి!!

నవ చలనచిత్ర వారపత్రిక

# సినిమా రంజని

**ఆంధ్రపత్రిక**

సంస్థ నుంచి మరో ఆణిముత్యం!!

# ప్రత్యూష పవనాలు

తేరిపార. గుచ్చి గుచ్చి తనని చూసేవాడిని ఇలా మింగేసేలా చూస్తావేమిటి అని గొణుక్కుంటూ ముఖం చిట్లించుకుంది నా ఎదురుగానే ఎన్నోసార్లు అయినా ఆ విషయం గమనించనట్లు నటించే వాడిని నా అతి చనువు చూసి కోపంగా మాట్లాడినా ఏదో చిన్నతనపు చేష్టగా తోచేది మైగాడ్! తను. నాకు పిన్ని. ఇప్పుడు ఆమె ఎదురుగా వెళ్ళి అప్పుడు నన్నంతగా చీదరించు కున్నావు నువ్వు నాకు పిన్నివి నేను నీకు కొడుకుతో సమానమైన వాడిని అని చెప్పాలని ఉందిరా

'చాల్చాలు ఇంకాగు ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేస్తావనుకుంటే నిన్నసలు ఈ ఊరు కూడా రానిచ్చేవాడిని కాదు నిన్నీ హోటల్లో పెట్టడం మంచిదే అయింది విసుక్కున్నాడు ప్రహ్లాద్

'నువ్వు రమ్మన్నా ఇప్పుడు ఇంటికి వచ్చేవాడిని కాదు నేను ఆంటీ ముందు నిలబడాలంటే తగిన బలం, ఆధారం ఉండాలి ఆమె గొంతులో ఆప్యాయతని, ఆ కళ్ళల్లో కరుణనీ చూసిన నాకు, ఆమె గొంతులో కాఠిన్యతనీ, కళ్ళల్లో తీక్షణతనీ చూసి భరించగలిగే శక్తి లేదురా అందుకే ఇప్పుడు నేనిలా వచ్చినట్లు నీకు తప్ప మరెవరికీ తెలియ కూడదు ఆ సమయం వస్తే నా అంతట నేనే ఆ యింట అడుగు పెట్టి అత్తయ్యా అంటూ ఆంటీ ఎదుట తలెత్తుకుని నిలబడతాను."

"మంచిదేగానీ, అందుకోసం పిచ్చి పిచ్చి పనులు చేసి పీకల మీదికి తెచ్చుకోకు "హెచ్చరించాడు

'ఇంక ఆ విషయాలు నాకు వదిలేయ్. ఆఁ! మా చెల్లెమ్మ ఒంట్లో కులాసాగా ఉంటోందా?'

"ప్రస్తుతానికి కులాసాయే. ఆ పిండం కాస్తా బయటపడే వరకూ దిన దిన గండమే కదా! తనని చూస్తే నాకే బాధగా అనిపిస్తోంది ' అతని గొంతులో భార్య పట్ల ప్రేమ వ్యక్తం అవుతోంది

"అలా అనుకుంటే ఎలాగరా కొన్నాళ్ళు ఓపిక పట్టాలి మరి మంచివాళ్ళకి దేముడు ఎప్పుడూ మంచే చేస్తాడు నువ్వు అనవసరంగా గాభరా పడకు " ధైర్యం చెప్పాడు.

కాసేపు ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు

"ఒరే బావా! నేను సాయంకాలం బండికే వెళ్ళిపోతాన్రా."

"అదేమిట్రా! పొద్దున్నేగా వచ్చావు."

"అవుననుకో వచ్చిన పని అయిపోయిందిగా."

"సరే. నీ ఇష్టం. అనవసరంగా మీ అమ్మా నాన్నలతో గొడవ తెచ్చుకోకు. వాళ్ళు ఎటువంటి వాళ్ళు అయినా నీకు జన్మ ఇచ్చిన తల్లిదండ్రులు. అంచేత కొన్ని కొన్ని విషయాల్లో నువ్వు మౌనం వహించక తప్పదు. తల్లిదండ్రుల




ఆస్తులకే కాదు అప్పులకి కూడా బాధ్యత వహించినట్లు మంచి పనులకే కాదు కొన్ని చెడ్డ పనులకి కూడా బాధ్యత వహించవలసి ఉంటుంది తప్పదు "

"ఇంక ఆ విషయం వదిలెయ్ నా తిప్పలేవో నేను పడతానుగా "

"ఇంక నేను వెడతాను సాయంకాలం తొందరగా స్టేషనుకి వచ్చెయ్ అక్కడ కలుస్తాను " అన్నాడు బయల్దేరుతూ

"అలాగేలే. లంచ్ టైము అవుతోంది ఏకంగా భోజనం చేసేసి వెడుదువుగాని ఆగు " అంటూ బలవంతంగా ఆపు చేసి రెండు మీల్స్‌కి ఆర్డరు చేసి తెప్పించాడు మనోజ్

ఇంట్లో తల్లి ఎదురు చూస్తుంటుందని తెలిసినా మిత్రుని కోరిక కాదనలేక కబుర్లు చెప్తూ భోజనం చేసి మరీ బయలుదేరాడు ప్రహ్లాద్

అతనికిప్పుడు చాలా సంతోషంగా ఉంది "మిత్రుడు కేవలం మిత్రుడు మాత్రమే కాదు, బంధువు కూడా మున్నీని వీడికిచ్చి పెళ్ళి చెయ్యడానికి అమ్మ ఒప్పుకుంటే బాగుండును " అనుకోకుండా ఉండలేకపోయాడు

*     *     *     *     *

'హలో! డాక్టర్ కరుణగారేనా? నమస్కారమండీ! ఆఁ! నేను ప్రత్యూషని ఆఁ! వదినకి పెయిన్స్ మొదలయ్యాయి అమ్మ ఇప్పుడే మా నర్సింగ్ హోముకి తీసి కెళ్ళింది వదిన్ని వెళ్ళేముందు వదిన మీకు ఫోన్ చేసింది మీరు ఇంటి దగ్గర లేరని. అహ అక్కడికి వెళ్ళాక వదిన మీకు, మళ్ళీ ఫోను చేస్తానంది అనుకోండి కానీ, నా మనసు ఆగక ఈలోగానే నేను చేస్తున్నాను మీరు వెంటనే బయలుదేరి రాగలరా. థాంక్యూ. థాంక్యూ సోమచ్ ఉంటాను' ఫోను పెట్టేసి, గుండెల నిండుగా గాలి పీల్చుకుంది ప్రత్యూష

'అక్కా! నా కెందుకో భయంగా ఉందే" బేలగా అంది ప్రఫుల్ల ఆమెకి గతంలో నర్సింగ్‌హోములో చూసిన దృశ్యమే కళ్ళల్లో మెదులుతూ కలవర పెడుతోంది

'వదిన కూడా అలా బాధపడుతుందా? బాధతో అలా ఆస్పత్రి గోడలు దద్దరిల్లేలా అరుస్తుందా?" పదేపదే అనుకుంటోంది వత్సల అరుపులతో ఆమె చెవులు గింగురు మంటున్నాయి

"అబ్బ! ఆగవే, అసలే గాభరాతో నేను ఛస్తుంటే మధ్యలో నీ గొడవేమిటి?" విసుక్కుంది ప్రత్యూష

"అదికాదే వదినకి త్వరగా డెలివరీ అయిపోతుం దంటావా?'

"ఎవరినైనా సోది అడుగుదాం పద" కోపంగా అంది

"ఎందుకమ్మా అలా కోప్పడతావ్?" ఆమాత్రానికే కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి ప్రఫుల్లకి

"కోప్పడక ఏం చెయ్యమంటావ్? అక్కడికి నువ్వేదో నాతో సవ్యంగా మాట్లాడు తున్నట్లు? నేనేదో నీకు బద్ధ శత్రువుని అన్నట్లు ప్రవర్తిస్తున్నావు నువ్వీ మధ్య."

"నేనేం చేశానక్కా?" అంది వెక్కుతూ.

"చాల్లే ఏడుపు ఆపు. నీకీ మధ్య బొత్తిగా భయం భక్తి లేకుండా పోయింది. మొండితనం, పెంకితనం బాగా ఎక్కువయ్యాయి. రహస్యాలు, దాపరికాలు ఎక్కువ అయ్యాయి. సర్వ స్వతంత్రురాలివై పోయావు నువ్వు."

"అక్కా! ప్లీజ్ అలా మాట్లాడకే"

"నువ్వు చేసేపన్లు అలా ఉంటే ఇంకెలా మాట్లాడ మంటావు? ఇదివరకు ఎప్పుడైనా ఏ విషయం అయినా నా దగ్గర దాచిపెట్టావా?" సూటిగా అడిగింది.

"ఇప్పుడు మాత్రం నీ దగ్గర నేనేం దాచిపెట్టాను?"

"ఇలా నా కళ్ళల్లోకి చూసి చెప్పు నాదగ్గర ఏమీ దాచిపెట్టడం లేదూ?" భుజాలు గుచ్చి పట్టుకుని గట్టిగా కుదిపింది ప్రత్యూష

అప్రయత్నంగా తల దించుకుంది ప్రఫుల్ల

"సారీ అక్కా! ధీరజ్‌కి ప్రామిస్ చేశాను ఎవరికీ చెప్పనని చెప్పింది మెల్లగా

"స్టుపిడ్! అక్కని. . నాకంటే, అన్నయ్య కంటే, అమ్మకంటే నిన్నకాక మొన్న పరిచయం అయిన ఆ ధీరజ్ ఎక్కువయ్యాడా నీకు?" కోపంగా అంది.

"అది కాదక్కా! నేను– నేనతన్ని ప్రేమిస్తున్నాను" వెక్కుతూ చెప్పింది.

"అఘోరించలేక పోయావ్. అమ్మముందు నిలబడి ధైర్యంగా ఆ మాట చెప్పడానికి భయపడే పిరికిపందవి నీకు ప్రేమేమిటే?" కస్సుమంది.

"నాకేం భయంలేదు. చెప్పానుగా చెప్పనని ధీరజ్‌కి ప్రామిస్ చేశానని."

రోషంగా అంది ప్రఫుల్ల

అదే ఎందుకు చేశావు అని అడుగుతున్నాను మీ ప్రేమని అంత రహస్యంగా కప్పెట్టుకోవలసిన అవసరం ఏం వచ్చింది' రెట్టించింది

అతనికి మరో మంచి ఉద్యోగం దొరికాక అప్పుడు

దొరకకపోతే' ఇలా ఎన్నాళ్ళు నాటకం ఆడతారు'

ఎందుకు దొరకదు?

ఏ ఉద్యోగం దొరకక పోవడం వల్లనే మూడేళ్ళు నిరుద్యోగిగా అనుభవం గడించిన తర్వాతనే నీ తలతిక్క వల్ల అన్నయ్య అతనికి ఆ ఉద్యోగం ఇచ్చాడనే విషయం నువ్వు మరచి పోయినట్లున్నావు చేతుల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న చెల్లెల్ని చూసిన ప్రత్యూష కోపం మంచులా కరిగి పోయింది

ప్రఫుల్ల భుజాల చుట్టూ చేతులు వేసి దగ్గరకి తీసుకుని చిన్నీ' ఆ విషయం లోపల ఇముడ్చుకోలేక బయటికి చెప్పలేక నీలో నువ్వే కుమిలిపోతూ నువ్వేలా తయారయ్యావో తెలుసా? నిన్నిలా చూడలేక నిన్నేమి అనలేక అమ్మ అనుక్షణం నీ గురించే బాధపడుతోంది ఆ విషయం అంత రహస్యంగా దాచుకోడానికి మేము నీకు శత్రువులం కాదే' ధీరజ్ మంచివాడు కనుక సరిపోయింది అదే మరొకడు అయివుంటే ఈ పాటికి నీ జీవితం ఏమై ఉండేది' చిన్నీ' లోకం పోకడ గ్రహించలేనంత మరీ చిన్న పిల్లవి కాదే నువ్వు ఎందుకే ఇలా నీ జీవితాన్ని నువ్వే చేతులారా నాశనం చేసుకుంటున్నావు? ఆ ధీరజ్ ఒక్కడే నీకు ఆప్తుడు అయినట్లు మేమందరం శత్రువులైనట్లు నువ్వు ప్రవర్తిస్తున్నావు గానీ మేమందరం అనుక్షణం నీ గురించి కుమిలి పోతున్నాము కన్నీళ్ళతో ప్రఫుల్ల శిరసు తడిపేసింది

సారీ అక్కా' రేపే అమ్మకీ అన్నయ్యకీ చెప్పేస్తాను ఈ మధ్య కారణం లేకుండానే నీతో చాలా సార్లు పోట్లాడాను నన్ను క్షమించక్కా

ఛ! మనలో మనకి క్షమార్పణలు ఏమిటే? నీ పొరపాటు ఏమిటో నువ్వు గ్రహించు కున్నావు నాకంతే చాలు నువ్వు మళ్ళీ మునుపటి చిన్నివి కావాలి ఆ ధీరజ్‌ని నువ్వు మనస్ఫూర్తిగా ప్రేమించినట్లయితే అతనూ నువ్వు కావాలని కోరుకున్నట్లయితే అమ్మని అన్నయ్యనీ ఒప్పించి నేను నీ పెళ్ళి జరిపిస్తాను

అక్కా'

అవును చిన్నీ' నువ్వు ఇంక నిశ్చింతగా మునుపటిలా చలాకీగా ఉండు పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి ఈ మధ్య అసలు పుస్తకం ముట్టలేదు ఇక నుంచైనా శ్రద్ధగా చదువు

అలాగే అక్కా' బుద్ధిగా తల ఊపింది

మా చిన్ని గుడ్‌గాళ్' ప్రఫుల్ల బుగ్గమీద ముద్దు పెట్టుకుంది ప్రత్యూష కళ్ళల్లో నీళ్ళు తళుక్కు మంటూంటే పక్కున నవ్వింది ప్రఫుల్ల

అప్పుడే ఫోను గణగణా మోగింది

ప్రత్యూషని పక్కకి నెట్టి పరుగెత్తుకుంటూ వెళ్ళి రిసీవరు అందుకుంది ప్రఫుల్ల

ఆ' నేనే చిన్నిని మాట్లాడుతున్నా నన్నయ్యా వెరిగుడ్' నీకు వదినకి డబుల్ కంగ్రాట్యులేషన్స్ నేను అక్క ఇప్పుడే వచ్చేస్తున్నాం అంటూ ఫోను పెట్టేసి అక్కా' వదినకి ట్విన్స్ ఆడపిల్లలు పుట్టారట పద వెళ్ళి చూసొద్దాం అంది ఉత్సాహంగా

అంతకు ముందు ఆవహించుకున్న భయం ఇట్టే మాయమై పోయింది

పద మల్లిని పిలిచి ఇల్లు జాగ్రత్తగా చూసుకోమని చెప్పు నేనీలోగా ఏమైనా తీసుకు రమ్మంటుందేమో ఫోను చేసి అడుగుతాను అంటూ ఫోను దగ్గరకి పరుగెత్తింది ప్రత్యూష

అయ్యో! నాకా విషయం తోచనే లేదు

ఉత్తి కంగారు తప్ప ఆలోచన ఉంటేగా' నంబరు డయల్ చేసి తల్లిని పిలిచి ఏం తీసుకు రమ్మంటుందో అడిగింది

ఏమీ అవసరం లేదమ్మా నేను అన్నీ తీసుకునే వచ్చాను ఒక ఫ్లాస్కు నిండా కాఫీ పోసి తీసుకురా చాలు ఇక్కడ హోటల్లో కాఫీ కషాయంలా ఉంది తాగితే వాంతి వస్తోంది అంది మాలతీదేవి

అలాగేనమ్మా నవ్వింది ప్రత్యూష

కాఫీ కలిపి ఫ్లాస్కులో పోసేసరికి బయట నుంచి కారు హారన్ వినిపించింది ఇద్దరూ వెళ్ళి కార్లో కూర్చున్నారు (ఇంకా ఉంది)



గోరా అభయనివాస్




ప్రియదర్శిని వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్

# స్త్రీ సేవా కార్యక్రమాలలో వాసవ్య మహిళా మండలి

ఒక ప్రక్క సమాజంలో స్త్రీకి సమాన హక్కులు కావాలని పోరాడుతున్నారు మరో ప్రక్క ఆడది అర్థ రాత్రి ఒంటరిగా ఇంటికి చేరిననాడే సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినట్లు అంటున్నారు

అసలు ఆడది చదువుకోవాలన్నా ఉద్యోగం చెయ్యాలన్నా సంఘంలో ఒంటరిగా నివసించడానికి భయపడుతోంది అందుకు కారణం అండలేని ఆడదానిమీద చులకనభావం ఉండటమే' అందుకే ఘోరాలూ అత్యాచారాలు అమాయకులపై ఎక్కువగా జరుగుతున్నాయి

స్త్రీ సంఘంలో ఒంటరిగా నివసించగలదు తను సాధించాలనుకున్నది తప్పక సాధించగలదు అన్న ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించడానికి స్త్రీలకు ప్రత్యేక హాస్టల్ సదుపాయాలు అవసరం'

విజయవాడలో తొలిసారిగా వర్కింగ్ ఉమెన్స్

బేబీ కేర్ సెంటర్



వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో ఒక గది





టి. వి. అసెంబ్లింగ్ నేర్చుకుంటున్న మహిళలు



టైలరింగ్ సెంటర్

హాస్టలు నిర్మించాలన్న సంకల్పం మాజీ పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి చెన్నుపాటి విద్యగారికి కలగడం వెంటనే కార్యరూపం దాల్చి వాసవ్య మహిళా మండలి ఆధ్వర్యంలో ప్రియదర్శిని వర్కింగ్ ఉమెన్స్ హాస్టలు రూపు దిద్దుకోవడం జరిగిపోయింది

1985 ఆగస్టు 9వ తేదీన భారత ఉప రాష్ట్రపతి శ్రీ ఆర్ వెంకట్రామన్‌గారు ప్రియదర్శిని ఉమెన్స్ హాస్టల్‌ను ప్రారంభోత్సవం చేశారు

## 'అభయనివాస్

ఈ ఉమెన్స్ హాస్టల్‌లో భాగంగా వాసవ్య మహిళా మండలి రాష్ట్ర స్త్రీ సంక్షేమ మంత్రిత్వశాఖ సహాయ సహకారాలతో సంఘంలో దురాచారాలకు, బాధలకు గురి కాబడిన మహిళోద్ధరణకు కంకణం కట్టుకుని గోరా అభయనివాస నివాస్‌ను ఏర్పాటు చేశారు

మానసికంగా శారీరకంగా బాధలకు గురి కాబడిన స్త్రీలు ఇందులో చేరి టైలరింగ్ బుక్ బైండింగ్, నర్సింగ్ అల్లికలు టి వి అసెంబ్లింగ్ మొదలైన పనులను నేర్చుకుని మనస్థైర్యాన్ని సంఘంలో గౌరవ స్థానాన్ని సంపాదించుకో గలుగుతున్నారు. కొంతమంది ఈ అభయ నివాస్‌లో కొంతకాలం ఉండి తాము నేర్చుకున్న వృత్తి విద్యతో ఉద్యోగాలు సంపాదించుకుని వెళుతున్నారని మహిళా మండలి సెక్రటరి శ్రీమతి రశ్మి అన్నారు

స్త్రీ కేవలం వంటింటికే పరిమితం కాదన్న ఉద్దేశ్యంతో వాసవ్య మహిళా మండలి మరికొన్ని కార్యక్రమాలను నిర్వహిస్తోంది

## టైలరింగ్, ఎంబ్రాయిడరీ

ఇప్పటివరకు సుమారు ఐదు వందల మంది మహిళలు టైలరింగ్‌లో ఎంబ్రాయిడరీలో శిక్షణ పొంది ప్రభుత్వ టెక్నికల్ పరీక్షలలో ఉత్తీర్ణులై టైలరింగ్ శిక్షణా తరగతులకు టీచర్లుగా కూడా సెలక్ట్ అయ్యారు

## నిట్టింగ్, లేసింగ్

ఆంధ్రప్రదేశ్‌లో మొట్ట మొదటి నిట్టింగ్ యూనిట్ వాసవ్య మహిళా మండలిది. ఇక్కడ శిక్షణ పొందిన మహిళలు ఉలెన్, నైలాన్, కాటన్‌లతో దుస్తులు తయారు చేస్తున్నారు. లేసింగ్‌లో శిక్షణ పొంది టేబుల్ క్లాత్‌లు, బెడ్‌షీట్సు, పిల్లో కవర్స్. ఇతర అలంకరణ పరికరాలను చేతి నైపుణ్యంతో తయారు చేసి విదేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నారు.

## కార్పెట్, వీవింగ్

భారత ప్రభుత్వ కామర్స్ మంత్రిత్వశాఖచేత ప్రారంభించబడిన ఈ కార్పెట్ వీవింగ్ శాఖలో ప్రతి సంవత్సరం యాభైమంది స్త్రీలు శిక్షణ పొందుతున్నారు

తివాసీ నేస్తున్న వనిత



ఇంకా ప్రింటింగ్ టెక్నాలజీ నర్సింగ్ డోర్ టు డోర్ కస్టమర్ సర్వీసు స్కీములు అడల్ట్ ఎడ్యుకేషన్‌లలో శిక్షణ పొందుతున్నారు వాసవ్య మహిళా మండలి స్త్రీలు

## 'ప్రియదర్శిని' వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్

98 మంది స్త్రీలకు అన్ని సౌకర్యాలతో వసతి సౌకర్యం కల్పించారు మంచి లైబ్రరీ రిక్రియేషన్ క్లబ్బు నృత్యవిహార్ సంగీత శిక్షణాలయాలతో కళ కళలాడుతూ ఉంటుంది ప్రియదర్శిని

ఉద్యోగాలు చేసుకునే స్త్రీలకు ఎంతో అనువుగా వున్నది మా వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్

బెడ్‌కాఫీ బ్రేక్‌ఫాస్ట్ లంచ్ టీ డిన్నర్‌లతో విలాసానికి మనిషికి రూ 350/– నుండి రు 400/– దాకా ఖర్చు కింద వసూలు చేస్తున్నారు వైద్య సదుపాయాలు ఉచితంగా ఏర్పాటు చేస్తున్నారు

## బేబీ కేర్ సెంటర్

భార్యా భర్తలిద్దరూ ఉద్యోగస్తులైన వారికి తమ పిల్లల పర్యవేక్షణ కష్టమైతే వాసవ్య మహిళా మండలిలో ఉన్న బేబీ కేర్ సెంటర్‌లో చేర్పవచ్చు ఇన్ని సదుపాయాలతో పాటు స్త్రీలలో కార్యసాధన లక్ష్యాన్ని పెంచేందుకు హాస్టల్ ఏజన్సీ నిర్వహిస్తూ ఇద్దరు స్త్రీలకు ముక్తి ఏర్పాటు చేయడం వాసవ్య మహిళా మండలి గొప్పతనం!

అంతే కాకుండా పెయింటింగ్ టైప్‌రైటింగ్ హిందీ క్లాసులు కూడా నిర్వహించి మహిళా లోకానికి ఎనలేని సేవలు చేస్తున్న శ్రీమతి విద్యగారిని వారి కుమార్తెలను అభినందిస్తూ వాసవ్య మహిళా మండలి మరిన్ని సేవా కార్యక్రమాలను చేపట్టి మహిళాభ్యున్నతికి మరింతగా తోడ్పడాలని ఆకాంక్షిద్దాం!

-కృష్ణాజీ

ఫొటోలు రమేష్

# తుంపర

## పొంచుంకి ముబ్బుముళ్ళి

"ఏం(పండీ'

ఉఁ పేపరులోకి చూస్తూనే బదులిచ్చాడు వేణు రుక్మిణి మరింత దగ్గరకు జరిగి భర్త మోకాళ్ళపైన చేతులుంచి నిశ్శబ్దంగా ఉండిపోయింది పన్నెండేళ్ళ సంసార జీవితాన్ని ఆమెతో చెట్టాపట్టా లేసుకొని గడిపిన వేణు ఆ స్పర్శలోని సంకేతాన్ని గుర్తించి అదేదో ముఖ్యమైన విషయమే కాబోలన్నట్లు పేపరు మడచి ప్రక్కన పెడుతూ ఉఁ చెప్పు అని భార్యవేపు కుదురుగా తిరిగాడు వివిధ సమయాల్లో వివిధ కారణాలను సూచిస్తూ భార్య చేసే పలు సంకేతాలు అతనికి కరతలామలకం ఇప్పుడామె చేసిన ఆ మృదువైన సంకేతం హృదయాన్ని బొప్పచ్చేది గుండెను మెల్లగా నిమిరేది అందుకే అతను సర్వమూ నీకే అప్పగిస్తున్నాను అన్నట్లు ఆమె వేపు తిరిగి, పేపరు దూరంగాగిరాటు వేసి విషయం వాకబు చేశాడు

"కోపగించుకోరు కదా" ఆమె తలెత్తకుండానే అంది

నేనంతటి కోపిష్ఠినా?

మరేం లేదు మొన్న నారాయణి భర్త సుబ్బారావు దారిలో కనిపించి హెడ్‌క్లర్కు డిపార్టుమెంటు పరీక్షలు వస్తున్నాయని చెప్పారు నిజమేనా? వేణు ముఖం క్షణాలలో ఎరుపెక్కింది నుదురు చిట్లించి గోడవేపు తిప్పుకున్నాడు ముఖాన్ని భార్య రాబోయే డిపార్టుమెంటు పరీక్షల గురించి అంత సీరియస్‌గా ప్రసక్తి లేవదీసిందంటే భూమి గుండ్రంగానే ఉంటుంది సుమా అని నిరూపిస్తుందన్నమాట

మౌనంగా ఉండి పోయారు నా ఆలోచనలో పొరపాటు ఉందండి?

ఉందని పలుసార్లు నచ్చ జెప్పాను వాస్తవానికవి డిపార్టుమెంటు పరీక్షలు కావు, దగుల్బాజీ ఎగ్జామ్‌లు అసలు సీనియారిటీ సిద్ధాంతాన్ని ఓవర్‌లుక్ చేసి ఎగ్జామ్ పెట్టడమే పొలిటిక్సు ఆ పొలిటిక్సు వెనుక మమ్మల్ని పెంపుడు కుక్కల్ని చేసి ఆడించాలన్న తతంగం మాత్రమే ఉంది అందుకే డిపార్టుమెంటు ఎగ్జామ్‌లంటే, సలసల కాగే నీళ్ళు నడినెత్తిన పడినట్లు మండి పడుతుంటాను నో టెల్‌మి నీకు క్లర్కు మొగుడితో కాపురం చేయడం నామోషీగా ఉందా? బి ఫ్రాంక్ తుమ్మకమండ ముళ్ళు అరికాలిలోకి కసుక్కున దూసుకున్నట్లు ఉలిక్కిపడి కలవళపడే ముఖంతో చూసింది రుక్మిణి ముళ్ళు శరీరాన్ని ఒరుసుకుంటే, రక్తపు చారలు మాత్రమే ఏర్పడుతాయి కొన్ని మాటలు సూటిగా వాటికి తగిలి గుండెన్ను రక్త సిక్తం చేస్తాయి కన్నీటి అల గొంతువరకూ తీవటం వల్ల, ఆమెకు మాటల్ని ప్రోగు చేసుకునేందుకు కొద్ది సేపు పట్టింది వణికే గొంతుతో మాటల శృతిని బిగిస్తూ మెల్లగా అంది–

ఎంతటి మాట అనేసారు! నా మొగుడు అందరిలాగే హోదాలో ఎదగాలని ఆశించటం పొరపాటా?

మా ఆఫీసు ఎగ్జామ్ పద్ధతుల గురించి తెలుసుంటే అలా ఆశించడం పొరపాటే అవుతుంది ఎగ్జామ్ లంటే మరేవో కావు ఆఫీసర్ల చేతుల్లోని చక్రాలే!

ఇలా ఆఫీసర్ల పైనా, ఆఫీసు ఎగ్జామ్‌లపైనా కారాలు మిరియాలు నూరుతూ ఉంటారేగాని అసలు విషయానికి రానంటారు మీకు అందరిపైనా కోపమే, నా పైన తప్ప ఆఫీసర్లతో గొడవలు పెట్టుకుంటారు తోటి క్లర్కులతో సర్దుకు పోనంటారు ఇటువంటి పోకడ రేపు మీ ఫ్యూచర్ కారియర్‌పైన ఎటువంటి దెబ్బ తీస్తుందో ఆలోచించనంటారు సీనియారిటీని నమ్ముకొని కూర్చోవడం గుర్రం ఎక్కి హిల్‌స్టేషన్ చేరుకోవడం వంటిదంటే ఒప్పుకోనంటారు

అవును నాకు ఆఫీసర్లపైన కోపమే! గొడవ లంటావా, నేనుగా వాళ్ళతో పెట్టుకోను ఆ మాటకు వస్తే వాళ్ళే నాతో పెట్టుకుంటారు స్టాపునందరినీ అలా ఉండాలి, ఇలా ఉండాలని శాసించడం వరకే వాళ్ళ బాధ్యత అనుకుంటారు తాము చెప్పేవాటిని పాటించడం తమ వంతు కాదంటారు అటువంటి ఆఫీసర్లంటే నాకు తగని మంట ఇకపోతే, నీ రెండవ అభియోగానికి నా సమాధానం ఆత్మాభిమానాన్ని చంపుకొని సహోద్యోగుల పైన ఎతూరీలు చెపుతూ తిరిగే కొందరు క్లర్కులంటే నాకు నిజంగానే కోపం అటువంటి బ్లాక్ లెగ్సుతో సర్దుకు పోలేను సర్దుకు పోవల్సిన అవసరం నాకు లేదు నెక్స్టు? రుక్మిణి మనసున ఓ భారీ భయపిచిక ఇనుప గుండులా దొర్లింది. తను అనుకోకుండా ఆవేశానికి లోనయి భర్తను రెచ్చ గొట్టిందేమో! మనసు ముక్కలవుతున్న సమయాన నిదానానికి ఆస్కారం ఉండదేమో! అయినా తను చేసిన నిర్వాకం యేమిటి? నచ్చ జెప్పడం మరచి రెచ్చగొట్టడమా? కొద్దిసేపు భర్తకు అడ్డురాకుండా ఉండడమే శ్రేయస్కరమని తీర్మానించి ఊరుకుంది

నేడు దేశం నైతికంగా అధఃపాతాళానికి వెళ్తున్నందుకు కారణం రాజకీయ వాదుల నీచత్వం మాత్రమే కాదు కొంతవరకు మా బోటి ప్రమత్వోద్యోగుల కుటిలత్వం కూడా కారణం ఇప్పుడు చెప్పు నీ వయస్సెంత? ఇరవై ఎనిమిది మి కంపెనిలో నీకున్న సర్వీసెంత? తొమ్మిదేళ్ళు నీ జీవితానుభవంలో నువ్వు చూసిన ఓ నిజాయితీ పరుడైన ఆఫీసరు పేరు చెప్పు కళ్ళు మూసుకొని తెరిచే లోపల టక్కున చెప్పాలి

ఆమె మనోనేత్రం ముందు ఏ విగ్రహమూ లేవలేదు హెడ్‌మాష్టారుగా రిటైరు అయిన తన నాన్నగారు మనసున మెదిలారుగాని ఆయనెలా ఆఫీసరవుతారు? ఆమె ఆలోచనలకు అడ్డువచ్చి వేణు అన్నాడు– నాకు తెలుసు నువ్వు అంత తేలిగ్గా చెప్పలేవని నా విషయం అంటావా? నేను చూశాను కాని ఎంత మందిని? నూరు మందిలో ఒకరినో ఇద్దరినో! మరి మిగతావారి విషయం? ఈ మిగతా ఆఫీసర్లు సెటప్ చేసే ఎగ్జామ్‌లు ఎలా ఉంటాయో మనం నిక్షేపంగా ఇక్కడ, ఈ మూల కూర్చునే ఓ నిర యానికి రావచ్చు మానవత్వం, మంచితనం, శ్రమ వీళ్ళకు అవసరం లేదు అనాటి అమెరికాలోని నల్ల బానిసలా సర్వ విధాలా విధేయుల్లా పడి ఉన్న వాళ్ళు మాత్రమే వీళ్ళకు మంచివాళ్ళుగా గోచరిస్తారు పది మంది మంచి కోసం కాస్తంత ఊపిరి పోసుకొని కొంచెం గొంతు పెద్దది చేసి పలికిన వాడు శత్రువుగా మారిపోతాడు

మీ ఆఫీసులో ఇటువంటి అపకతవకలు ఎప్పుడైనా జరిగాయా? ఈ ప్రశ్న ఆమె నిదానంగా ఆచి తూచి వేసింది

బోలెడు

ఒకటి రెండు చెపితే వింటాను

యూనియన్ వ్యవహారాల్లో ఎవరెవరు యాక్టివ్‌గా కనిపిస్తారో వాళ్ళందరూ డిపార్టుమెంటు పరీక్షల్లో పరాజయం పొందుతారు మహా చవటలు, దద్దమ్మ గొబ్బెమ్మలు విధేయులన్న ఒకే ఒక క్వాలిఫికేషన్ కారణాన మొదటి అటెంప్టులోనే ప్యాసవుతారు మా సెక్రటరీకి ఎదురయిన దుస్థితి వింటే నువ్వు తల్లడిల్లిపోతావు మా సెక్రటరి మూడు సార్లు ఏకబిగిన వ్రాశాడు అతనికిమానసిక క్షోభ కలుగ జేయాలన్న ఉద్దేశ్యంతో, మొదటిసారి అతణ్ణి రెండే రెండు మార్కుల తేడాతో ఫెయిల్ చేశారు రెండవ దఫా మూడు మార్కుల తేడాతో పడగొట్టారు మూడవసారి ఒకే ఒక మార్కు తేడాతో ఫెయిల్ చేయించారు మూడు చాన్సులూ పోవడాన తనకిప్పుడు పరీక్షలు వ్రాసే అవకాశమే లేకుండా పోయింది అంటే ఏడింగ్ ఇన్‌సల్టు టు ఇంజ్యూరీ అన్నమాట అర్హతలనూ, యోగ్యతలనూ నేలరాస్తూ ఒక మనిషి మరో మనిషి ముందు ఎందుకు మోకరిల్లాలో తెలియడంలేదు ప్రతి చిన్నదానికీ ప్రదక్షిణం చేయడానికి ఆఫీసర్లే ఇండ్లు గుళ్ళు కావు వేళాపాళా లేకుండా తిరగడానికి మేము బికారులమూ కాము"

రుక్మిణి మౌనం వహించింది ఆమెకు తెలుసు భర్త అభిమాన ధనుడని తొమ్మిదేళ్ళుగా తను ఉద్యోగం చేస్తూంది తన సంపాదన గురించి నేటి

వరకూ ఒక్కసారి కూడా అడగలేదు. ఆయన జీతం తన చేతికిచ్చి ఖర్చులు పోగా నెలాఖరున మిగిలినదెంతని ఏనాడూ అడగలేదు పోయిన ఏడాది ఆడపడచు పెళ్ళికి దస్కం కావల్సి వచ్చింది తను ఆఫీసు నుండి ఏదో ఒకలా సేకరించి తెచ్చిస్తానంది. ఆతను అంగీకరించలేదు. నాయనమ్మ విడిచివెళ్ళిన వెండి వడ్డాణం, తల్లి బంగారు పట్టెను తాకట్టు పెట్టి, తన వంతు సొమ్ము పెద్దన్నయ్యకు అందించాడు తను వీలు చూసుకొని వెళ్ళి, ఆ వెండి వడ్డాణం, బంగారు పట్టె విడిపించుకు వచ్చింది అవేవో అరియర్సు వచ్చాయని చెప్పి భర్త సున్నితమయిన మనసుని గుర్తించి, పలుసార్లు అనుకొనేది ఉద్యోగం మానేద్దామని ఆ ఒక్క మాటా భర్త నోటమ్మట తానుగా రావాలని ఎదురు చూసింది ఆర్థికంగా తనవల్ల భర్తకు ప్రయోజనం లేనప్పుడు. తను ఉద్యోగం చేసినా, చేయకపోయినా ఒక్కటే కదా! తానుగా ఉద్యోగం మానేయాలంటే తనకున్న కొద్దిపాటి లౌకికమూ ఒప్పుకోదు చాలా మందిలా తన భర్తకు పార్టు టైం జాబ్‌లు, మరో విధమయిన ఇన్‌కమ్‌లు నచ్చవు రేపు ఏదయినా ముంచుకు వస్తే తన సంసారం గతి!' బాబు భవిష్యత్తు విషయం! ఆమె తన ఆలోచనల్ని దూరంగా నెట్టి, అసలు విషయం పైకి మనసు పోనిచ్చింది

ఆఖరుసారిగా ఒకటి అడుగుతాను".

"అడుగు' భార్య ముఖంలోకి చూసి, చిన్నగ నవ్వి అన్నాడు వేణు

'నిదానంగా చెప్పాలి కస్సుమని లేవకూడదు!"

"సరే, కోపం రాకుండా చూసి బదులిస్తాను అడుగు"

"మీరెప్పుడైనా పరీక్షలు వ్రాసి ఫెయిల్ అయారా?"

ఇది విని, వేణు కాస్తంత నివ్వెరపోయినట్లు చూసి, ఆ తరువాత మెల్లగా చూపులు మరల్చు కున్నాడు భార్య ప్రశ్నలోని గూఢార్థాన్ని అతను గ్రహించాడు అది అతని గుండె కవాటాన్ని తాకుతూ పైకి ఎగసి నసాలాన్ని అందుకుంది

"మా యూనియన్ లీడర్స్‌కి పట్టే గతే నాకూ పడుతుందని వ్రాయలేదు అవమానభారాన్ని తేలిగ్గా భరించగల శక్తి నాకు లేదు"

"ఒప్పుకుంటాను కాని జరగబోయే న్యాయా న్యాయాలను, మంచీ చెడును కేవలం ఊహాగానం పైన మోపుతూ వెళ్ళడం, భావ్యంకాదేమోనండి"

"ఓకో ఓకో అర్థమయింది" ఈ మాటల్ని అతను గట్టిగా ఒత్తి పలికి, ఆ తరువాత, భార్య ముఖంలోకి సూటిగా చూసి,

ఎదుటివారి అనుభవాన్ని నాదిగా భావించి, ఊహాపథాన్ని రచించి చెప్పడం సబబు కాదని వాదిస్తున్నావు సరే, ఇప్పుడు నన్నేమి చేయమంటావు?" అని అడిగాడు. అంతవరకూ క్యారమ్ బోర్డుకు నలువైపులా తప్పించుకు పోతున్న రెడ్ కాయిన్, చిట్టచివర సజావుగా వెళ్ళి హోల్‌లోకి దూరి పడినట్లయింది రుక్మిణికి.

"నా కోసం ఒక్కసారి డిపార్టుమెంటు పరీక్షలు వ్రాయమంటున్నాను. అదీను లీవు పెట్టి, బాగా చదివి వ్రాయమంటున్నాను." వేణు అప్రయత్నంగా నిట్టూర్చి, భార్యలోకి తేరపార చూసి తలాడించాడు

"థాంక్స్, మెనీ మెనీ థాంక్స్". రుక్మిణి విప్పారిన ముఖంతో అరచినంత పని చేసింది. సంతోషంతో వెలిగిపోతున్న భార్య ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు వేణు

ఎందుకలా చూస్తున్నారు?"

"అవి మా ఆఫీసు ఎగ్జామ్‌లు వాటిపైన నాకు లేని నమ్మకం నీకెలా పుట్టుకొచ్చిందో తెలియటం లేదు".

"నా నమ్మకం వెనుక ఓ బలమైన కారణం ఉందండి. ఏమిటన్నట్లు వేణు కనుబొమ్మల్ని పైకి ఎగరేసాడు.

"ఈ ప్రపంచం నలుమూలలా ఉన్నది చెడు అని, అందరూ చెడ్డవారని నేనెన్నడూ భావించలేదండి ఇకపైన కూడా భావించనండి'

వేణు నవ్వి, దీనికి జవాబు తన వద్ద లేనట్లు, రెండు చేతులూ పైకెత్తి ఓసారి ఒళ్ళు విరుచుకొని, మెల్లగా వాలుకుర్చీ నుండి లేచి స్నానాల గదివైపు నడిచాడు భర్త దరహాసాన్ని చూసి పురివిప్పిన నెమలిలా గాలిలోకి లేచిన మనసు, అతణ్ణి ఆపి, ఒడిలో నున్న బ్యాంకు ప్యాస్ బుక్కుని చూపించమని పురమాయించింది కాని ఆమె



మెదడు పొరల్లోని లౌకికం "ఆగు సుమా!" అని వారించింది. ఏదో ఆరో సెన్సు వంటిది ఆమెను ఆపి, అమృతప్రాయమైన తరుణాన్ని ఛిన్నాభిన్నం చేయకని గద్దించి కుదురుగా కూర్చోబెట్టింది

★ ★ ★ ★ ★ ★

డిపార్టుమెంటు పరీక్షా ఫలితాలు ప్రకటించారు.

ఆలిండియా ప్రాతిపదిక పైన మొత్తం పదిమంది ప్యాసయారు వారిలో వేణుది మూడవ రేంకు యూనియన్ కమిటీ మెంబర్లు అతణ్ణి ఆకాశంలోకి ఎత్తేసినంత పని చేశారు. ఒక యాక్టివ్ యూనియన్ మెంబరు అంత మంచి రేంకుతో ప్యాసవడం వాళ్లను ఆనందసాగరంలో ముంచింది వాళ్ల సంతోషానికి అసలు కారణం – సూపర్‌వైజరీ కేడర్‌లోకి ఒక యాక్టివ్ యూనియన్ మెంబరు జొచ్చుకు పోవడం మెంబరుషిప్పు ఉద్యమానికి పట్టుగొమ్మ వంటిది

చేతులు చాస్తూ ఎదురొచ్చిన మిత్రులతో కరచాలనం చేస్తూ, వాళ్ల శుభాకాంక్షల్ని స్వీకరించి, వాళ్లను క్యాంటీనుకి తీసుకెళ్లి కాఫీలు ఆఫర్ చేస్తున్నాడన్న మాటేగాని, అతని మనసు ఎక్కడో మేఘాల మధ్య సంచరిస్తూంది తనువు విహంగంలా మారి గగనంలోకి తేలిపోతున్నట్లు ఒక ఆనందోద్రేకం అతణ్ణి ఆనందంకంటే ఆశ్చర్యమే ఊపి పారేస్తుంది విజయోత్సాహాన్ని ఎంతగా అణుచుకునేందుకు ప్రయత్నించినా, సన్నటి చిరునవ్వుని ప్రకటిస్తూ, పైకి మామూలుగా కనిపించేందుకు ప్రయాసపడినా, అంతరంగం అడుగున ఆనందసాగరం పొంగి పొర్లుతూనే ఉంది కష్టపడి చదివి, ప్యాసయిన తరువాత పొందబోయే ప్రమోషన్‌లో ఎటువంటి ఆనందం, ఔన్నత్యం ఉంటాయో అతను జీవితంలో మొదటిసారిగా చవిచూశాడు మత్తుగా ఫీలవుతున్నాడు అతనలా చాలాసేపు అందరినీ పరామర్శించి, కాసేపటికి అలసటగా లేచి తన సీటులోకి వచ్చి కూర్చున్నాడు అప్పుడతని మనోనేత్రం ముందు ఓ పాలరాతి విగ్రహంలా ఓ నిండు రూపం లేచి నిల్చుంది

# తుంపర

రుక్మిణి! విజయం సాధించిన ప్రతి మగాడి జీవితంలోనూ ఒక ఆడదాని నీడ తోడై నిలిచి ఉంటుందంటారు ఎంత వాస్తవం! అతడి హృదయ కవాటం నుండి ప్రేమ, అభిమానమూ ఒకేసారి రెండు ఉత్తుంగ తరంగాలులా లేచాయి అతడిక కుదురుగా కూర్చోలేకపోయాడు. చటుక్కున లేచి, భార్యకు ఫోను చేసి చెప్పాలనిపించింది. నో! నేరుగా వెళ్లి చెప్పాలి ఒకసారి రుక్మిణి పనిచేస్తున్న కంపెనీ చూసినట్లుగా కూడా అవుతుంది వేణు సెక్షన్ హెడ్ వద్దకు వెళ్లి, అవసరం లేదని వారిస్తున్నా వినకుండా ఆయన చేతిలో సి ఎల్ అప్లికేషను పెట్టి ఇంటికి బయలుదేరాడు స్కూలు యూనిఫారం విప్పకుండానే ఇంటి ముందు బిల్లం గోడు ఆడుకుంటున్న కొడుకు జబ్బ పట్టుకుని ఇంట్లోకి లాక్కెళ్లి, స్నానం చేయించి, తాము వచ్చే వరకూ ఇంట్లోనే ఉండమని పని పిల్లకు పురమాయించి, కొడుకుతో బాటు ఆటో ఎక్కాడు

రిసెప్షనిస్టు వద్ద భార్య పేరు చెప్పి, ఆటెండరు చూపించిన దిక్కు వేపు నడిచి డోరు వద్ద నిల్చున్న ప్యూనుకి వచ్చిన విషయం తెలియజేసి, కొడుకు జబ్బ పట్టుకొని డోరు తెరచుకుంటూ లోపలకు వెళ్లాడు బయట వ్రేలాడుతున్న భార్య నేమ్ బోర్డుని గమనించకుండా అక్కడ కనిపించిన దృశ్యం చూసి, అతను ఆశ్చర్యమే తానై నిల్చున్నాడు

ఎదురు చూడని విధంగా ఏతెంచిన భర్తను చూసి, కలవరపడిపోతూ, మడచిన చిత్తరువును విప్పినట్లు నిశ్శబ్దంగా లేచి నిల్చుంది రుక్మిణి

"అమ్మా! నాన్న మనల్ని సినిమాకు తీసుకెళుతున్నాడే! ఫైటింగ్ పిక్చరట గోవును చూసి పరుగెత్తే లేగదూడలా తల్లివేపు దూసుకు వెళ్లాడు కొడుకు రుక్మిణి కొడుకుని గమనించడంలేదు. బిత్తర చూపులతో భర్తనే చూస్తూంది అతను మాత్రం మాటా పలుకూ లేకుండా ఆమె గదిని పరకాయించి చూస్తున్నాడు రుక్మిణి ముందున్నది ఎక్సిక్యూటివ్ టేబుల్ కుడి ప్రక్క ఇంటర్ కామ్ ఎడం ప్రక్క ఇండిపెండెంటు ఫోను ఆమెకు ఏటవాలుగా ఎయిర్‌కూలర్ కోస్టలీ పెన్‌స్టాండు రంగు రంగుల గాజు వెయిట్లు ఆమెకెదురుగా నాలుగు గాడ్రెజు కుర్చీలు రివాల్వింగ్ చెయిర్ గది పూర్తిగా ఎర్రటి తివాసీ

"కూర్చోండి' ఆమె పెదవుల ఒంపు నుండి మెల్లగా విడివడి వచ్చాయి. మ టలు ఆ ి విని వినిపించనట్లు అతను కాసేపు అలాగే పరీక్షగా చూస్తుండిపోయాడు ఇన్నాళ్లూ తను ఒక అకౌంటింగ్ క్లర్కంటూ రుక్మిణి తన వద్ద అబద్ధం ఆడిందన్న మాట! అదేదో అంటుకున్న దానిని దులుపుకోడానికి ప్రయత్నిస్తున్నట్లు, అతను బలంగా తలను విదిలించి డోరు వేపు తిరిగాడు

"ఏవండీ!" ఆ పిలుపు తనను కాదన్నట్లు డోరు తెరచి బయటకు వచ్చేసాడు ప్యాంటు జేబుల్లో రెండు చేతుల్ని పెట్టుకొని ఆలోచిస్తూ నడక సాగించాడు వేణు కదిలే గుండెల్లో నూరు ప్రశ్నలు పెళపెళమనే ఢమరుకాల్లా మ్రోగుతున్నాయి. కళ్ల ముందు పాము పడగల్లాంటి జ్వాలలు లేస్తున్నాయి ఆలోచనలు మెదడు గుహలో ఇనుప సంకెళ్లయి ఒరుసుకుంటున్నాయి తను సాధారణంగా ఎదుటివారి నుండి ఏదీ ఆశించడు ఆశించడం తన అభిమతంకాదు రుక్మిణిలోని మంచితనం, మార్దవం చూసి, తనకు పదివేలను కున్నాడు హృదయపూర్వకంగా అభిమానించాడు మరెందుకీ దాపరికం?

అతని హృదయం పొంగిన సముద్రమయి ఘోషించింది

★ ★ ★ ★ ★ ★

ఆ రోజు రాత్రి చుట్టుప్రక్కలిండ్లలో ఉన్నట్లే ఆ ఇంట్లో దీపాలు వెలుగుతున్నా, గుండెల్లో మాత్రం చీకటే తాండవమాడింది వీథిన సజీవతా, సందడీ, రాగం లేస్తున్నా, ఆ గృహం మాత్రం మాఘ మాసంలో కూడా తెరవని కళ్యాణమండపంలా, నిశ్శబ్దానికి నిలయమైంది

నిస్తేజం చోటు చేసుకున్న గుహలా కనిపించింది.

వేణు పెందలకడే చేతులు తడిచేసుకొని తన గదిలోకి వెళ్లిపోయాడు రుక్మిణికి తినడానికి ఏదీ సహించలేదు కాని ఏదో తినాలి పెళ్లి కొత్తలో మొగుడూ పెళ్లాలూ చేసుకున్న ఒప్పందం అటువంటిది అలుక అన్నంపైన చూపించకూడదు. బలవంతాన రెండు మెతుకులు నమిలి, నిద్రలోకి జారుకుంటూన్న కొడుకు చేత పాలు తాగించి, వాణ్ణి తన ప్రక్కనే వేసుకొని మేను వాల్చింది. భర్త డిపార్టుమెంటు పరీక్షల్లో ఉత్తీర్ణుడయ్యాడన్న విషయం వీణానాదంలా గుండెలో ప్రతిధ్వనిస్తున్నా, మరో మూల చమురు లేని చక్రం గిర్రు గిర్రుమని గీసుకొనేలా ఏదో అపస్వరం కంపనం కలిగిస్తూంది. శీతల పవనం సోకి ముకుళించుకున్న కలువలా ముడుచుకుంది రుక్మిణి

రాత్రి పదకొండు దాటింది

వేణుకి ఛళ్లున మెలకువ వచ్చి, కళ్లు విప్పార్చి చూశాడు. కన్నీరు కారుస్తూ కాళ్ల వద్ద



గొంతుక్కూర్చుంది రుక్మిణి దుప్పటి ప్రక్కకు నెట్టి లేచి కూర్చున్నాడు

ఎందుకేడుస్తున్నావు? ఇప్పుడు నేనేమన్నానని? వేణు ముఖం చిట్లించి అడిగాడు

నాకు తెలుసు మీరు చాలా కోపంగా ఉన్నారు ఇలా మౌనంతో సాదించేదానికన్నా ఎప్పుడూ అరిచేలా అరచి, అప్పటికీ కోపం చల్లారకపోతే నాలుగు లెంపకాయలు వేస్తే ఎంతో బాగున్ను"

లెంపకాయలు వేయడమా! నో, నో! ఆఫీసరు పోస్టులో ఉన్నదానివి నిన్ను చేయి చేసుకోవడమా! ఆ మాటలుషార్పు నైఫ్‌లా తాకాయేమో ఆమె ఆ బాధను భరించలేనట్లు తలను మంచం కోడుకి కొట్టుకుని వెక్కి వెక్కి యేడ్వనారంబించింది

ఎటువంటి అపచారమూ చేయని నన్ను ఎందుకిలా క్రూరంగా అవమానపర్చావో తెలియడంలేదు అసలు నాపైన నమ్మకం ఎప్పుడు కోల్పోయావో, ఎందుకు కోల్పోయావో అర్థం కావడంలేదు నీది స్వచ్ఛమయిన మనసనుకుంటూ నీ పైట చెంగు పట్టుకొని వెంటబడేవాణ్ని, ఎంత ఘోరంగా ట్రీట్ చేశావు నా పెద్ద ఉదోగ్యానికీ మన సంసార జీవితానికీ ఉన్న సంబంధం ఏమిటో బోధపడటంలేదు గ్రాడ్యుయేటువి బార్యాభర్తల మద్య దాపరికం ఉండకూడదన్నది నీకు తెలియదా?

ఆమె బదులివ్వలేదు తలెత్తి చూడలేదు కాసేపు మౌనంగా రోదించి మెల్లగా వణికే గొంతుతో అంది–

మిమ్మల్ని అవమానపరిచే ఆలోచన ఈ జన్మలో నే కాదు మరే జన్మలోనూ కలగదు

యేడ్వకు బాబు లేచి చూస్తే అప్‌సెట్ అవుతాడు అటువంటి ఆలోచన లేనప్పుడు ఎందుకీ నాటకం?

ఇది నాటకం కాదండీ బయం

బయమా?

అవును మొదటి నుండి మీరంటే నాకు బయం

వాట్ డు యు మీన్? వేణు అనుకోకుండా గట్టిగా అడిగాడు ఆమె ఏమీ అనలేదు భర్తను విస్ఫారిత నేత్రాలతో చూస్తుండిపోయింది

కార్ణం చెప్పు రుక్మిణీ! అతని గొంతు గాద్గకంగా మారింది ఆవేశంతో రొప్పుతున్నాడు ఆమె మెల్లగా కదలివచ్చి, అతడి పాదాల చెంత కూర్చుంది

మీకు తెలుసో, తెలియదో కాని మీది చాలా సెన్సిటివ్ మైండు ఎంత సెన్సిటివ్ మైండంటే– అది సాదారణంగా చిన్న పిల్లలకే ఉంటుంది ఇటువంటి గుణం ఉన్నవాళ్ళు ఏ విషయాన్ని ఏ కోణంలోంచి తీసుకుంటారో చెప్పడం కష్టం మీ చెల్లి పెళ్ళికి నా వంతు సహాయం తీసుకోడానికి తిరస్కరించారు నేను ఉద్యోగంలో చేరి తొమ్మిదేళ్ళయింది నా జీతం మాట అటుంచి, మీ జీతంతో ఏం చేస్తున్నానన్నది ఒక్కనాడు కూడా అడగలేదు మీరు తెలిసి చేస్తున్నారో, తెలియక చేస్తున్నారో నాకు తెలియదు కాని మీరు నన్ను దూరంగా ఉంచుతున్నారన్నది మనసుకి తోచి గిలగిలా తన్నుకునేదాన్ని చాలా చిన్న విషయాలకు పౌరుషపడతారు సుబ్బారావంటే మీకిష్టంలేదు అతను మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి మిమ్మల్ని పలకరించేందుకు ప్రయత్నించినా మీరు తప్పుకొని తిరుగుతారు ఎందుకని? అతను ఆపీసులో సకల విదాలయిన లోనులు తీసి, టీ వి పర్నిచర్, స్కూటరు కొనుక్కొని తన జీతంతో కేవలం అప్పులు తీరుస్తూ, ఇంటి ఖర్చులకు పెళ్ళాం సంపాదనపై పూర్తిగా ఆదారపడుతున్నాడనేగా! మూడు ముళ్ళు వేసిన తన బార్య సంపాదనపైన సుబ్బారావు ఆదారపడటంలో తప్పేమిటో నాకర్థం అయ్యేదికాదు సుబ్బారావు నలుమూలలా లోనులు తీసి వస్తువులు గుమ్మరించడం అంత మంచి పని కాకపోవచ్చు కాని వాటినతడు తనకోసం మాత్రమే ఉపయోగిస్తున్నాడా? అవి అతని బార్యకు ఉపయోగపడటం లేదా? నిజం చెప్పాలంటే సుబ్బారావు కొన్న వాటిలో చాలా వస్తువులు అతని భార్యకే ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి దీనిని గుర్తించే ఔదార్యం మీకెందుకు కలగడంలేదో నాకు తెలియడంలేదు నా మాట నమ్మండి మా కంపెనీలో ఎటువంటి ఎగ్జామూలేదు అంతా ఫిట్‌నెస్ పైనే ఆదారపడి ఉంటుంది ఎంతగా వెనక్కి లాగేందుకు ప్రయత్నించినా ఆగకుండా విచిత్రంగా టైముకి చేరుకున్న రైలుబండిలా ప్రమోషన్లు, కొండపై నుండి దూకుతూ వచ్చే బండరాళ్ళలా ఎదురొచ్చాయి మొదట్లో సీనియర్ క్లర్కునయ్యాను క్లర్కు కేడరు పర్వాలేదనుకున్నాను మిమ్మల్ని మించనంతవరకూ సర్దుకు పోవచ్చునుకున్నాను ఆ తరువాత హెడ్ అకౌంటెంట్ పోస్టు ఆపర్ చేశారు నేను వెనకా ముందూ

# ఈ·వేమన·పద్యాలు




అన్యులకును వచ్చు నాపద తనదిగా
నున్నవాడు భువిని యున్నవాడు
ఇన్నిదారిలోన నిహపరంబును తెస్స
గన్నవాడు మిగుల ఘనుడు వేమ.

ఆలోచించకుండా రిఫ్యూజ్ చేశాను వద్దన్నాను కాబట్టి మరొక ఎలిజబుల్ పర్సన్‌కి ఇచ్చేస్తారను కున్నాను నేనే కాదు – అందరూ అదే అనుకున్నారు కాని అలా జరగలేదు డైరెక్టర్ ఈ విషయాన్ని సీరియస్‌గా తీసుకొని నన్ను తన చాంబర్‌లోకి పిలిచి మందలించారు ఈ పోస్టు మీరడిగితే మేం ఇవ్వడంలేదు మీకున్న ఎక్సలెంటు సర్వీస్ రికార్డు చూసి తదితర అర్హతలన్నీ పరీక్షించిన పిదపనే సెలెక్టు చేశాం ప్రమోషను ఎందుకు వద్దంటున్నారో మాకు కారణం కనిపించడంలేదు సాధారణంగా లేడీ ఎంప్లాయీస్ ట్రాన్స్‌పర్ ఇన్‌వాల్వ్ అయితేనే ప్రమోషన్ రిఫ్యూజ్ చేస్తారు ఇప్పుడు మీకొచ్చిన హార్డుషిప్పు ఏమిటో తెలియడంలేదు మీరు ఈ పోస్టు తీసుకోవడానికి వెనుకాడితే మేం ఒక విధమయిన నిర్ణయానికి రావలసి ఉంటుంది యు వాంట్ టు షర్క్ యువర్ రెస్పాన్సిబిలిటీస్ ఇది విన్న వెంటనే వణికిపోయి ప్రమోషన్ ఆర్డరు

## తుంపర

అందుకున్నాను అనాటి నుండి నా మనఃవేదన అరంబమయింది మిమ్మల్ని పైకి తీయడానికి డిపార్టుమెంటు పరీక్షలు వ్రాయమని ఎన్నోసార్లు అడిగాను మీరు లక్ష్యపెట్టేవారు కారు నేను ఒంటరిగా ఎన్నిమార్లు రోదించానో మీకు తెలియదు

రోదించడం ఎందుకు?

మీరు నాకు దూరం అయిపోతారేమే నని–ఒకే ఒక చెట్టుకోసం వనాన్నే దగ్ధం చేసుకుంటానని? నా సంపాదన గురించి ఖాతరు చేయని వారు, మీకంటే ఎత్తుగా ఎదిగిన భార్యను భరించగలరా? ఒకటి మాత్రం హృదయపూర్వకంగా ఒప్పుకుంటాను మీకున్న వ్యక్తిత్వం నిజాయితీ చాలామందికి వుండవు అందుకేగావాలి నీతికీ నిజాయితీకి శిఖరమై బ్రతికిన మానాన్న మిమ్మల్ని అల్లుడు–కొడుకు అంతటి వాడు అని చెప్పారు మేం ముగ్గురం అక్క చెల్లెండ్రం మా యిద్దరి అక్కయ్యల పెండ్లిళ్ళు చేసి, మానాన్న నలిగి, నుసి అయిపోయారు ఇంతకూ మీవల్ల మా నాన్నకు ఒక్క ప్రాబ్లమూ లేదు పెళ్ళి చేసుకున్నాం కదా, కాపురం చేయాలి మరి అని బ్రతుకు సాగదీసే ఆడవాళ్ళను చూశాను నా విషయం అలా కాదండి ఐ లైక్ ఐలైక్ యు వెరీమచ్ వేణు! నాకు గుర్తుంది, నా జీవితంలో అసలైన పురుషలక్షణం మీలోనే చూశాను అందుకే మీ బవిష్యత్తుతో నా తనువునీ జీవితశోబనీ ముడిపెట్టాను మిమ్మల్ని నమ్ముకునే బ్రతుకుతున్నాను మీ విషయం అలా కాదేమో! ఇసుమంత ఆవేశం పొంగినా పుక్కిడు పౌరుషం ముంచుకు వచ్చినా, అకారణంగా మీ ఆత్మాబిమానాన్ని కించపరుచుకొని, ఏవేవో వూహించుకొని నానుండి దూరంగా వెళ్ళడం మీకు ఈజీ అఫెయిర్ కావచ్చు నాకు మాత్రం అది అగ్ని పరీక్ష అవుతుంది బ్రతుకుతోటి గొడ్డలిపెట్టే అవుతుంది నన్ను నేను మీకు హారతిలా సమర్పించుకున్నాను నాకు ఏదేది చెందుతుందో, అదంతా మీకు చెందే తీరాలని ఉవ్విళ్ళూరాను అది అత్యాశానేమో! ఇప్పుడు మించిపోయిందేమీ లేదు నా సేవింగ్స్ అంతా బాబు పేర ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేసేస్తాను మిమ్మల్ని కించపరుస్తూ హోదాగల ఉద్యోగంలో ఉండేంత అవసరం నాకులేదు రేపే నా అసిస్టెంటు మేనేజరు పోస్టుకి రాజీనామా ఇస్తున్నాను ఇక నేను ఉద్యోగం **చేయకండి నన్నుమాత్రం దూరంచేయకండి'** వేణు బదులివ్వలేదు ముఖాన్ని మరో వైపు తిప్పుకొని మౌనంగా ఉండిపోయాడు కొన్ని నిముషాలు అలా నిశ్శబ్ద తరంగాలలో తేలియాడి దీప శిఖల వంటి ఆలోచనా శిఖరాలపైన కొట్టుమిట్టాడి మెల్లగా తలతిప్పి భార్య వేపు చూశాడు చెమ్మగిల్లిన భర్త కళ్ళను చూసి రుక్మిణి తల్లడిల్లిపోయింది బెదరిన లేడిలా చెంగున లేచి, భర్త రెండు చేతుల్ని అందుకొని తన భుజాల పైన వేసుకొని తప్పు నాది మీరెందుకు బాదపడుతున్నారు?' అని అడిగింది అతను భార్య ముఖంలోకి తేరిపార చూసి, ఆమె కళ్ళల్లో ఏదో వెతికి మెల్లగా అన్నాడు

లేదు రుక్కూ! పొరపాటంతా నాదే! స్వంత భార్య వద్ద అంత సెన్సిటివ్‌గా ఉండకూడదు నన్ను ప్రాణపదంగా సేవించే భార్య వద్ద చులకనయి పోతానని అపోహపడడం ఒక విదంగా నేరమే!

ఎదురుచూడని విధంగా నిన్నా సీట్లో చూసి, అదో విదమయిన షాక్‌కి గురయి ఏదేదో అనేసాను నన్ను చూసి చెప్పు, నేను మాత్రం నీకు దూరంగా ఉండగలనా? ఎలాగూ నువ్వు కోరిన విదంగా సెక్షన్ హెడ్డుని అవబోతున్నాగా! అంతేకాదు నీ సహాయంతో అకౌంట్సు సర్వీసు ఎగ్జామ్ కూడా రాస్తాను సరేనా?

మరి నా ఉద్యోగం?

విడిచిపెట్టకు నా సంపాదన నీది నీ సంపాదన నాది ఓకే?

ఓ కె అంటూ భర్తను దగ్గరకు లాక్కుంది □

కొత్త

# విప్రో శికాకాయ్ సబ్బు

ప్రకృతి సిద్ధమైన శీకాయ సద్గుణాలతో
నిండిన కొత్త విప్రో శికాకాయ్ సబ్బు.
పట్టులాంటి మెత్తని, సువాసనా
భరితమైన దీని నురగ శ్రద్ధగా,
ప్రేమగా శుభ్రం చేస్తుంది.
మీ సహజ సౌందర్యాన్ని నిలిపి
ఉంచుతుంది.




విప్రో
శికాకాయ్
సబ్బు

పట్టులాంటి మెత్తని శిరోజాల కోసం

### ఎమ్. ఎస్. ఆర్. అన్నవరం

★ మీరు రాసే నవలల్లో సంఘటనలు ప్రస్తుత సమాజంలో ఏగా, పాత్రలు వాస్తవికంగా వుంటాయి కారణం?

● ఈ సమకాలపు సమాజంలో మనిషినే కదా! ఎటొచ్చీ నేను వాస్తవాన్ని యథాతథంగా నవలగా దింపేయడానికి యిష్టపడను వాస్తవికత ఫోటో గ్రఫిక్ వాస్తవికత కాకూడదని నేను నమ్ముతా ఎదుటి వాడి కష్టం మనని కదిలించ వచ్చుగాని అదో కథగా తయారవడం నేను చేయలేను బహుశా అందుకే కొన్ని నా నవలల ముగింపులు అవాస్తవికం అనిపించవచ్చు- కొందరికి - కాని ఏ రచయితా అందరినీ మెప్పించే ప్రయత్నం చేయకూడదని కూడా నేను నమ్ముతాను!

### జి. ఆర్ బి పత్తిపాడు

★ సున్నితమైన దేది?

● మనస్సు

★ నేటి మత గురువులు ఎందుకు?

● ఎవరి మతాన్ని వారు పెంచి పోషించ డానికి కాదా?!

### ఎమ్. ఆర్. ఆర్. సికింద్రాబాదు

★ మనిషి గొప్పా? మనసు గొప్పా?

● వెనకటికి మా పెదమామయ్య అంటూండే వాడు 'వీడి మనిషి కంటే మనసు మరీ హీనం' అని! అలాగే అనుకోండి!

### జి. ఎస్. బి బెంగుళూరు

★ ఈ పట్టణాలలో బాగా చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లలు కూడా కట్నాలిచ్చి పెళ్ళిళ్ళు చేసుకోవడమే కాక మేము మగవాళ్ళకు బానిసలం కాము స్వతంత్రులం అని చెప్పు కుంటూనే తమ పేర్ల పక్కన భర్తల పేర్లు చేర్చు కుంటారు- సర్వీసు కండిషన్లు అలాగ లేక పోయినా ఎవరైనా ధైర్యంగా తమ ఆదర్శాలను ఆచరణలో పెడితే సాటి ఆడ పిల్ల అని కూడా చూడక దారుణంగా విమర్శిస్తారు ఎందుకిలా ప్రవర్తిస్తారు? అసలు ఆడదాన్ని వ్యక్తిగా గౌరవించే కాలం వస్తుందా?




● పెళ్లే ప్రదానం అన్న ధ్యేయం మారనంత వరకూ ఆడది అడదిగా గౌరవింప బడదు అటువంటి గౌర వించే రోజులు మన కాలంలో చూడ లేక పోవచ్చు ఇక పెళ్ళికి చిహ్నాలతో పాటు పేరు మార్చుకోక పోతే - తమ పరువు' మంట కలిసి పోతుందని బాద పడే భర్తలూ, అత్తవారూ కోకొల్లలు అంచేత- మనం ఏం చెయ్యలేం ఏం మొగుడు పేరు పెట్టుకుందుకు నామోషీనా! అని దెప్పే వాళ్ళకి ఎలా చెప్పడం- లేదు నా భర్త అంటే నా కిష్టమే అలాగే నేనంటే నాకు యిష్టమే నని ఒకరి మాటలకి భయపడి పోకూడదు మన మనస్సు ధైర్యం సతల నంత' వరకూ ఆర్థిక స్వాతంత్ర్యం కల్గిన ఆడదాన్ని ఎవరూ- బానిస చేయలేరు కాని బేల మనసు ఆడదాని సొత్తు ఎవరేమనుకుంటారో నంటూ- అందరికీ తల వొగ్గడం- ఆడదానికి ఆడదే ఉగ్గుతో నేర్పిన విద్య కనీసం కొన్ని తరాల మహిళలు పూనికతో కొత్త తరపు స్త్రీలని వ్యక్తులుగా తీర్చి దిద్దితే తప్ప - తనని తాను గౌరవించుకునే ఆడతరం రాదు

### కె. ఆర్. నాగలాపురం

★ మనం నిద్రలో కలవరిస్తాం అది పడుకోబోయే ముందు మనం ఏమనుకుంటే అది వస్తుందా?

● తెలియదయ్యా - మరీ 'స్వంత సైకాలజీ' చెప్పే ధైర్యం లేదు నాకు'' నేనైతే తక్షణం ఏ డాక్టరు శారదా మీనన్ గారినో, విజయకుమార్ గారినో వెళ్ళి అడిగేస్తాను మనిషి మనసంత సున్నితమైనది యింకొకటి లేదు దాన్ని పట్టుకుని మనం వక్ర భాష్యాలు అల్లడం డేంజరు

### ఎన్. ఎస్. బి. కోట బొమ్మాళి

★ మీరు ప్రతిప్రశ్న ద్వందార్థం తోనే అర్థం చేసుకుంటున్నారు

● వీటికి ద్వంద్వార్థాలు కూడానా! మన తెలుగు సినిమా మాటల్లా, పాటల్లా- మీ ప్రశ్నలకి ఒకటే అర్థం! నేను పొరపడను మీరు మీ ప్రశ్నలకి యింకా రంగు నీళ్ల మందు కోరుకుంటున్నారు నేను నాన్నే పద్ధతికి వ్యతిరేకిని శస్త్ర చికిత్స మంచి దనుకుంటా అంతే లేడా!

★ ఉద్యోగం పురుష లక్షణం అనుకుని ఉన్న ఆస్తి అమ్ముకుని ఒకరి మోచేతినీరు తాగుతూ గొప్పలు చెప్పుకునే మనస్తత్వంలో ఉంటా రెందుకు?

● చెప్పారుగా ఉద్యోగం - లక్షణం అని అయినా అప్పో సప్పో చేసి, ఆస్తిపాస్తులు తెగనమ్మి చదివి ఉద్యోగం సంపాదించేస్తే అబ్బాయిలు అంత కంత కట్నంగా వచ్చేస్తుందన్న నమ్మకంతో వుంటారు వారి కిందకో కాల్మొక్కే బానిస కూడా వస్తుందని సంతోషిస్తుంటారు అదీ అసలు ధైర్యం

### పి. ఎల్. ములకల్లంక

★ మీ పొద్దుతిరుగుడు పువ్వు నాకు చాలా నచ్చింది అది బెర్నార్డ్‌షా రచించిన పిగ్మాలియన్ నాటకం ఆధారమా?

● ఆధారం కాదు - స్ఫూర్తి బెర్నార్డ్‌షా లాగా భాషా శాస్త్రంపై నాలాంటి దానికి పట్టే ముంది, నాముఖం 'యాస' తే తెలియవునాకు షా నా కిష్టం

### ఎమ్. ఎస్. ఆకునూరు

★ నిజంగా మీరు బ్రతకడంకోసం రచనలు చేస్తున్నారా? రచనలకోసం బ్రతుకుతున్నారా? ఇంత కర్కశంగాఎందుకడుగుతున్నానో తెలుసా? 30-1-87 లో సమాధానం యిస్తూ విజయవాడ వారొక నాటకం ప్రసారంచేసి ప్రసాదం పంపలేదని విచారం వ్యక్తం చేశారు ఒకపేజీ రచనను ఒక కార్టూనులో యిరికించకల్గిన నేను నా సోదరులు ప్రసాదంకోసం ఏరోజూ ఆశించలేదు వారిదయ మా ప్రాప్తం నేను రేడియో వారికీ రాస్తున్నాను

● బాబ్బాబు! ఆపని చెయ్యిముందు దయా - ప్రాప్తాలమీద బ్రతకవలసిన స్థితి నాకులేదు నా వృత్తి రచన జీతం లేకుండా ఉద్యోగం చెయ్యక్కర లేదు సంఘసేవ చెయ్యాలి ఈసారి మీ కార్టూనులు జ్ఞాపకం పెట్టుకు చూస్తా - ఏ కొండని అద్దంలో పట్టేస్తారో చూడాలి! బాపూ అబూ జయదేవ్‌లు కార్టూనిస్టులు, మిగిలిన యీకొత్తవాళ్ళు స్టాంపు సైజు కార్టూను గియ్యడానికి - మా కంటే కాగితం ఎక్కువ కర్చు చేస్తారనిపిస్తుంది నాకు! రిబ్రాడ్ కాస్టుకి పే యివ్వడం రేడియో వారి - రూలు నా స్వంత ఏడుపుకాదు దాన్ని జ్ఞాపకం చేయడం దోషంకాదు □



# పశ్చాత్తాపం

విశ్వనాథ గణపతిరావు

"మీరేమీ అనుకోనంటే నే నొక విషయం చెప్పాలనుకుంటున్నాను నాన్నగారు అన్నాడు ప్రసాద్ కాస్త బిడియంగా!

చెప్పు బాబూ! నాతో చెప్పడాని కింత సంశయ మెందుకూ? అన్నారు ఆశీర్వాదంగారు

ఆశీర్వాదం పెద్దకొడుకే ప్రసాద్! ఆయనకు ఉద్యోగ విరమణ అయిన దగ్గరనుండి భార్య నాగరత్నమ్మతో పాటూ ప్రసాద్ దగ్గరే వుంటున్నారు చిన్నకొడుకు మాత్రం విజయవాడలో వుంటూ బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు

ఆశీర్వాదంగారికి నాగరత్నమ్మకి చిన్న కొడుకు దగ్గరకెళ్ళి వుండాలని వున్నా చిన్న కోడలు అరుణ గుమ్మంలో అడుగు పెట్టగానే పరుషమైన మాటలు మాట్లాడుతుంది

కొత్తగా పెళ్ళయిన వాళ్ళను కొన్నాళ్ళయినా వేరుగా వుండి సుఖపడనివ్వరు ఈ ముసలివాళ్ళు! ఇది ఆమె ఆడే పరుష వ్యాఖ్యల్లో ఆ వృద్ధ దంపతు లిద్దరి హృదయాలకూ సూటిగా తగిలేది అందుకే ఎంతో కొంత డబ్బు తననే మనియార్డర్ ద్వారా పంపమని చిన్న కొడుకుతో చెప్పి పెద్దకొడుకు దగ్గరే వుండసాగారు కాని యిప్పుడు ప్రసాద్ ఏమీ అనుకోకపోతే ఓ విషయం చెప్పాలనుకుంటున్నాను నాన్నగారూ! అనేసరికి ఏదో అనుమానం కలగక పోలేదు ఆశీర్వాదంగారికి అందుకే అతని గొంతు గద్గదమయ్యి పెదవులు సన్నగా కంపించసాగాయి

చెప్పుబాబూ మరలా అన్నారు ఆశీర్వాదంగారు కొడుకు ఇంకా సంశయించడం చూసి!

ఏమీలేదు నాన్నగారూ! పండగ వస్తుందికదా? చెల్లెల్లిద్దర్ని ఎప్పటిలాగే నేను ఈ సంవత్సరం కూడా పిలవాలంటే కష్టమవుతుందేమో! ఎలా లేదన్నా వాళ్ళ బట్టలకే వెయ్యి రూపాయలకు పైనే అవుతుంది అందుకే అంటూ ఆగి తండ్రి ముఖంలోకి చూసాడు ఆయన ముఖంలో ఏదో రిలీఫ్ కనిపించింది

ఆశీర్వాదంగారు అనుమానించిన మాటలు కొడుకు నోటివెంట రాకపోవడమే ఆ రిలీఫ్‌కి కారణమయింది

అయితే ఇప్పుడు ఏం చేస్తానంటావుబాబూ! అన్నారు కొడుకు ఆర్థిక పరిస్థితి తెలిసిన ఆయన సాలోచనగా!

చెల్లెలిద్దర్లో ఎవరో ఒకర్ని తమ్ముడ్ని ఎలవ మనండి! ఒకర్ని నేను పిలుస్తాను అలాగైనా నాకు ఐదొందలకు తక్కువకాదు బావకి చెల్లెలికీ బట్టలు తియ్యాలంటే అన్నాడు ప్రసాద్! అన్నాడే గాని అతని మనసులో ఏదో వెలితిగా అనిపించ సాగింది అతని ఆర్థికపరిస్థితి నిస్సహాయస్థితి అతడ్ని ఆ మాటలను బలవంతంగా అనిపించి తరువాత మ నంగా వుండిపోయేలా చేసాయి

సరేబాబూ! నేను రేపు తమ్ముడి దగ్గరికెళ్ళి చెప్పి వస్తాను అనారు ఆశీర్వాదంగారు

* * *

అలాగే నాన్నగారూ! ఇదేమంత అర్జంటు విషయమని రాగానే చెపుతున్నారు! మొదట వెళ్ళి స్నానం చేయండి భోజన మయినాక మాట్లాడుకుందాం! అన్నాడు శేఖర్

అదికాదురా! అన్నయ్య పరిస్థితి నీవు ఆలోచించాలి! వాడి పిల్లలికి కావలసినవన్నీ చూసుకుంటూ మిమ్మల్ని కూడా ఏ లోటులేకుండా చూస్తున్నాడు ఎందుకో చిన్నకొడుకుతో అవునని పించే వరకూ ఆశీర్వాదంగారికి స్నానం చేయాలని గాని ఎంగిలిపడాలనిగాని లేదు అందుకే ఆయన చెప్పాల్సిందానికి ఉత్సుకత మేళవించి ముక్కలు ముక్కలుగా చెప్పసాగారు

ఇక తన సమాధానం సూటిగా చెప్పకపోతే తండ్రి స్థిమితపడరని గ్రహించిన శేఖర్ అన్నాడు

అలాగే నాన్నగారూ! పెద్దచెల్లి శేషలతను నేను ఎలుస్తాను పూర్ణిమను అన్నయ్యను పిలవమనండి అని

ఆ మాటలు విని ఆశీర్వాదంగారు గుండెనిండా తృప్తిగా గాలిపీల్చుకున్నారు

ఆ మాటలనే వంటగదిలోంచి విన్న అరుణ గుండె మాత్రం కోపంతో మండిపోసాగింది

* * *

రాత్రి భోజనాలైన తరువాత మావగారికి డాబా మిద పక్క ఎర్పాటు చేసి గదిలో మొగుడి మిద విరుచుకు పడింది అరుణ

మీ కసలు ఆలోచన కొద్దిగకూడా లేదు ఎందుకలా ఒప్పుకున్నారు మీ నాన్నగారిదగ్గర! మీ పెద్దచెల్లెలసలే గొంతెమ్మ కోరికలు కోరుతుంది ఆవిడడిగేవన్నీ కొనడం మొదలిడితే నెలజీతం హరీమంటుంది నా మాట విని ఓ రెండొందలో మూడొందలో మి అన్నయ్యకే పంపేయండి ఆ తంటాలేవో ఆయనే పడతారు

అదికాదు అరుణా

ఇంకేమీ నాకు చెప్పకండి నేను చెప్పినట్టు చేయకపోతే మా పుట్టింటికి అన్నట్టు మా పుట్టింటినుండి పండక్కి రమ్మని పిలుపొస్తే ఎలాఅంది? టక్కున గుర్తొచ్చి అడిగింది అరుణ

ఈసారికి రావడం లేదని రాసేద్దాం

ఆఁ! ఆఁ! రాసేస్తారు? సంవత్సరాని కొక్కసారైనా మా ఇంటికి వెళ్ళకపోతే నాకు ఎచ్చెక్కిపోతుంది

అయితే తప్పదంటావా? నీర్సంగా అడిగాడు శేఖర్

మళ్ళా మొదటకే వచ్చారా! ఉదయం మి నాన్నగారు వెళ్ళిపోయేటప్పుడు చెప్పండి మిరు చెప్పలేకపోతే చెప్పండి నేనే చెపుతాను

ఆ మాటతో శేఖర్ కంగారుపడ్డాడు

ఆఁ వద్దులే! నేనే చెపుతాను అన్నాడు అన్నాడే గాని అతని బుర్రలో ఆలోచనలు సుళ్ళు తిరగసాగాయి

అరుణ మాత్రం అ మ్మయ్య! అని గుండె మీద చెయ్యేసుకుని నిద్రకుపక్రమించింది రెండు నిముషాల్లో నిద్రలోకి జారుకుంది

గుర్రుపెట్టి నిద్రపోతున్న అరుణను చూస్తూ తెల్లవార్లు నిద్రకుదూరమయ్యాడు శేఖర్!

* * *

నాన్నగారూ!" తండ్రివైపు ఆశ్చర్యంగా చూసాడు శేఖర్ అతనన్న మాటవిని

దాహంవేసి నీళ్ళకని క్రిందకు వచ్చి నేను రాత్రి కోడలన్న మాటలన్నీ విన్నాను బాబూ! నువ్వేమి బాధపడకు అయినా అరుణన్నది కూడా సబబుగానే వుంది తనకుమాత్రం పండక్కి పుట్టింటికి వెళ్ళాలని వుండదా? ఎంతో కొంత అన్నయ్యకే డబ్బు పంపేయ్! అక్కడ మీ వదిన పండక్కి ఎలాగా వెళ్ళదు పిల్లలతో అవ్వదని! ఎప్పటిలాగే తనే చూసుకుంటుందిలే! అని ఆశీర్వాదంగారన్నారు వెళ్ళడాని కుపక్రమిస్తూ

తండ్రి అన్న మాటలు వినగానే శేఖర్ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి అతని మనసు కకావికలమైపోయింది దానికి కారణం–సరదాగా పండక్కి చెల్లెల్ని పిలవలేకపోతున్నానే అనే!

* * *

పండగ రానేవచ్చింది

పండగ రేపనగా ఈరోజు వరకూ అరుణ ఎదురుచూసింది తన తల్లిదండ్రుల దగ్గర నుండి పిలుపొస్తుందని కాని రాకపోయేసరికి బోరున ఏడ్చేసింది ఏడ్చి ఏడ్చి దిండు తడిపేసింది

ముందు రోజు రాత్రే అన్నాడు శేఖర్! మీవాళ్ళ కింకా తీరుబడి కాలేదనుకుంటాను పండక్కి పిలవడానికి అని ఆ మాటలు గుర్తొచ్చినకొద్దీ అరుణలో దుఃఖం పొంగుకొస్తుంది ఇప్పుడు శేఖర్ బ్యాంక్ నుండి రాగానే విషయం తెలుసుకుని మీవాళ్ళు పిలిచారుకాదు ఆ వంకతో మా చెల్లాయిని నువ్వు పిలవనిచ్చావు కాదు" అంటారేమోనన్న బెంగపట్టుకుంది అరుణకు! ఆ వెంటనే అనుకుంది అసలు ఎందుకు పిలుపు చేయలేదు? పోనీ వెళ్ళి కనుక్కుందామంటే తక్కువదూరమా ఏమన్నానా? ఈ విశాఖపట్నం ఎక్కడ టాటా ఎక్కడ? అక్కడికెళ్ళి కనుక్కునిరావాలంటే మూడు రోజులు పడుతుంది ఇంతలో మూడు రోజుల పండగ ముచ్చటగా వెళ్ళిపోతుంది ఆలోచిస్తున్న అరుణకు తల వేడెక్కిపోసాగింది

ఇంతలో శేఖర్ ఆఫీసు నుండి వచ్చాడు అతని బూట్ల చప్పుడు వరండాలో వినపడగానే అరుణ గుండెలో రాయి పడింది

ఏం పిలుపొచ్చిందా? ఏమొస్తుందిలే! నిన్ను మీవాళ్ళు పూర్తిగా మర్చిపోయే వుంటారు. అయినా **నా వాళ్ళను నా గుమ్మం తొక్కనివ్వని నీకు భగవంతుడు మంచిశాస్తే చేసాడు. నా యింటికి రానివ్వని నా చెల్లెలెంత బాధపడివుంటుందో ఇప్పుడు నీ వాళ్ళు నిన్ను పిలవకపోయేసరికి అర్ధమయి వుంటుంది నీకు!... కదూ?" అని అంటారని భయపడిపోయింది.**

కాని వరండాలోంచి, గదిలో కొచ్చిన శేఖర్ అలా అనలేదు.

ఏం అరుణా, అలా ఉన్నావ్?... అర్రెర్రె!... ఏడుస్తున్నావా? ... పండక్కి పిలుపు రాలేదనే?... పోనీలే అరుణా, పాపం! వాళ్ళకెన్ని పనులుండి పిలువలేకపోయారో! అదీ మనం ఆలోచించాలి కదా?..." అన్నాడు.

ఆ మాటలు విని గబుక్కున లేచి నిలుచుంది అరుణ. భర్తను కౌగలించుకుని గొల్లున ఏడ్చేసింది.

"నన్ను క్షమించండి!... మీలాంటి మంచివాళ్ళ మనసులను బాధ పెట్టాను గనుకే, దేవుడు నాకీ శిక్ష విధించాడు. ఇదే మీ స్థానంలో మరొకళ్ళయితే దెప్పి పొడిచి మానసిక క్షోభకు గురి చేసేవాళ్ళు!..."

"ఛ! ఊరుకో, అరుణా. ఇప్పుడేమయిందని అంతలా కలత చెందుతున్నావ్?" ఓదార్పుగా అని, ఆమె కన్నీళ్ళను మునివేళ్ళతో తుడిచాడు శేఖర్! అయినా అరుణ మనస్సు పశ్చాత్తాపంతో కుంచించుకుపోసాగింది.

*　　　*　　　*

పండగెళ్ళిన వారం రోజుల తరువాత........

ఓ రోజు బ్యాంక్ నుండి ఇంకా రాని భర్త కోసం ఎదురు చూస్తూ గుమ్మం దగ్గరే నిలుచున్న అరుణ చేతికి రెండు ఉత్తరాలిచ్చి వెళ్ళాడు పోస్ట్‌మన్.

ఒకటి తన తండ్రి దగ్గరనుండి వచ్చింది. మరొకటి ఆడపడుచు శేషలత దగ్గర నుండి వచ్చింది.

ముందుగా ఆడబిడ్డ రాసిన ఉత్తరం చదవసాగింది

అన్నయ్యా, వదినకు నమస్కారాలతో మీ లత వ్రాయు ఉత్తరం మేము పండక్కి పెద్దన్నయ్య యింటికి వెళ్ళి ఆనందంగా గడిపాము. మీరు మాకై పంపిన బట్టలు చాలా బాగున్నాయి. అన్నీ కలిపి ఓ వెయ్యి రూపాయలైనా అయ్యేవుంటాయనుకుంటాను. అంత ఖరీదు పెందుకన్నయ్యా తీసావు ఏదో తక్కువ ఖరీదు చేసే బట్టలు తీస్తే సరిపోయేది.......ఇంతకూ చెప్పొచ్చే దేమిటంటే మావారికి తీసిన డ్రెస్ చాలా బాగుందని మురిసి పోతున్నారు. అడిగినవారికీ, అడగనివారికీ ఎలిబి మరీ చెప్పేస్తున్నారు.... మేము ఇంటికి వెళ్ళిపోయి అక్కడనుండే ఈ ఉత్తరం రాస్తున్నాను. ఇప్పటికి ఇంతే సంగతులు. మీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూ.....

మీ శేషలత

ఉత్తరం చదివిన అరుణ మనసు ఆనందంతో నిండిపోయింది. ఆమె మనసులో దిగులంతా ఒక్కసారిగా ఎగిరిపోయింది తను చెప్పినట్లు భర్త రెండొందలో, మూడొందలో పంపకుండా మంచి బట్టలు తీసి పంపి ఆడబిడ్డ దగ్గర తన గౌరవ మర్యాదలు నిలిపారు. ఏంతైనా తను ఎవరినీ నొప్పించని మంచిమనసున్న తన భర్త అని గర్వంగా అనుకుంది అరుణ, అనుకుంటూ రెండో ఉత్తరం చూసింది.

అమ్మాయి అరుణకూ, అల్లుడు శేఖర్‌కి,

కామరాజు వ్రాయునది. నేను బిజినెస్ విషయమై బెంగుళూరు వెళ్ళి తిరిగిరావడం ఆలశ్యమవడంవల్ల మిమ్మల్ని పండక్కి పిలవలేకపోయాను. పోనీ మీ అమ్మ పిలవాలన్నా తనకు మహిళామండలి నిర్వహించే మీటింగులకే టైము చాలడంలేదు. కనుక తనూ పిలవలేకపోయింది. ఇంతలో పండగెళ్ళిపోయింది. పోతేపోయిందిగాని, మనియార్డరుద్వారా డబ్బు పంపిస్తున్నాను. ఇద్దరూ బట్టలు తీసుకోండి. ఇంకేమైనా కావలిస్తే వ్రాయండి!........ ఉంటానుమరి.

వై. కామరాజ

ఉత్తరం చదివి ఎప్పుడూలేనిది వేదాంతిలా నవ్వుకుంది అరుణ. మీ రేమి ఇవ్వగలరునాన్నా! ఇక్కడ మీ డబ్బుతో కొనలేని, నా అహంతో నా వైపుకు మార్చలేని మంచివాళ్ళ మనసులున్నాయి అందుకే నా అహం విడిచి అటు మారిపోయాను ఇప్పుడు నాకు తృప్తిగా, మనసు దూదిపింజెలా తేలిపోతూవుంది. దయచేసి మనసులను డబ్బుతో కొలవకండి! మీ డబ్బు మీదగ్గరే ఉంచుకోండి!" అని మనసులో అనుకోబోయి బయటకే అంది అరుణ.

అప్పుడే వచ్చి ఆ మాటలు విన్న శేఖర్ పకపకా నవ్వాడు.

"ఏమిటో శ్రీమతిగారు ఆవేశంగా డైలాగులు చెపుతున్నారు" అని అనేసరికి గిరుక్కున వెనుతిరిగి సిగ్గుతో భర్త గుండెపై వాలిపోయింది అరుణ ఆమెచేతిలో రెండు ఉత్తరాలూ, ఆ యిద్దరి గుండెల మధ్య మెత్తగా నలిగిపోసాగాయి ☐



# అందరు వనితలు మంచి చాయతో వుండగలరా?




భారతదేశంలో ప్రప్రథమంగా, ఇమామి మీకోసం సమర్థవంతంగా, పనిచేసే మంచి చాయనిచ్చే క్రీమ్ తీసుకువస్తోంది. ఇది సూర్యరశ్మి వలన చర్మం నల్లబడకుండా కాపాడుటే కాకుండా చర్మము నల్లబడుటకై కారణమైన యితర చర్మ పరిస్థితులను చక్క పరుస్తుంది.

ఇమామి నేచురల్లీ ఫెయిర్.

సహజమైన సూర్యరశ్మిని నిరోధించే తెర వున్న ఒకేఒక మంచిచాయనిచ్చే క్రీమ్. యిది వెలుపలనుంచి పనిచేస్తుంది. లోపల బాగా పని చేసే సహజమైన మూలపదార్థాలు కూడా వున్నాయి. ఇది మీకు నిజంగా, నిరపాయంగా, తప్పకుండా మంచి చాయ తెస్తుంది.

**సూర్యరశ్మి ఏ విధంగా మీ చర్మాన్ని నల్లబరుస్తుంది ?**

సూర్యరశ్మిలో అపాయకరమైన అల్ట్రా-వైలెట్ కిరణాలు వున్నాయి. వీటికి గురయితే మీ చర్మపు పైభాగం నల్లబడడానికి అవకాశం వుంది.

**నేచురల్లీ ఫెయిర్ వెలుపలనుంచి నల్లబడకుండా ఏ విధంగా నిరోధిస్తుంది ?**

సాటిలేని సహజమైన సన్‌ఫిల్టర్ గొడుగులాగ పనిచేస్తుంది. సూర్యుని అల్ట్రా-వైలెట్ కిరణాల చెడు ప్రభావం నుంచి చర్మాన్ని కాపాడుతుంది. చర్మపు పైభాగం మరింత నల్లబడకుండా నిరోధించి మిమ్మల్ని మంచి చాయతో వుంచుతుంది.

**ఏ ఇతర కారణాల వలన లోపలనుంచి నల్లబడటం జరుగుతుంది ?**

సూర్యుడు ఒక్కడే చర్మానికి శత్రువు కాదు. ఎప్పుడూ ఇంటిలోపలే వున్నా మీరు నల్లగా వుండవచ్చు లేక యింకా నల్లబడవచ్చు. అది ఎందుకనగా నల్లబడటానికి మరెన్నో చర్మసంబంధమైన కారణాలు వున్నాయి.

నీరు పోవుట మరియు ఆహారలోపము, చారలు మరియు ముడతలు.

ప్రతిదినం పనులు మరియు అలసట మూలంగా మృదుత్వము మరియు శరీరకాంతి తగ్గుతాయి.

మొటిమలు, దద్దుర్లు, పగుళ్లు, చర్మము ముడతలు పడటం వంటి పలురకాల చర్మ వ్యాధులు.

**నేచురల్లీ ఫెయిర్ లోపల ఏవిధంగా పని చేస్తుంది ?**

మరియే ఇతర మంచిచాయనిచ్చే క్రీమ్ మీచర్మం లోపల నుంచే నల్లబడటానికి కారణమైన చర్మ పరిస్థితులను చక్కబరచలేదు. ఒక్క నేచురల్లీ ఫెయిర్ మటుకే స్వచ్ఛమైన, సహజమైన మూలపదార్థముల సాటిలేని కలయికతో వుంది. చర్మపు లోపలి

# ప్రకృతి సిద్ధమైన సాటిలేని శ్రద్ధతోనే సాధ్యము.






emami

# నేచురల్లీ ఫెయిర్

## మంచి చాయనిచ్చే క్రీమ్

పౌరలను అభివృద్ధి వరుస్తుంది లోపలినుంచే సహజమైన, ఆరోగ్యవంతమైన ప్రకాశాన్ని తిరిగి తీసుకు వస్తుంది

**చర్మసంపద పెంచడానికి పాలు .** ఆహార లోపము నిరోధిస్తుంది మన్నని, మీగడవంటి శరీరపు చాయను తెస్తుంది

**సహజంగా అదుపులో వుంచే దోసకాయ .** చర్మాన్ని బిగుతుగా వుంచుతుంది ఎండిపోయిన గీతలు, ముడతలు పడకుండా నివారిస్తుంది చర్మాన్ని యవ్వనపు చాయలు పోకుండానూ, నిత్య నూతనంగానూ వుంచుతుంది

**సహజంగా శుభ్రపరచే కొబ్బరినీరు ·** ఎండ వలన ఏర్పడిన మట్టి రంగును, మచ్చలను కడిగి వేస్తుంది తేమపోకుండా కాపాడుతుంది చర్మం మృదుత్వాన్ని, మెరుపుని తిరిగి తెస్తుంది

**తీవ్రసంరక్షణకై ఆయుర్వేద మూలికలు :** ప్రముఖ ఆయుర్వేద నిపుణులు సిఫార్సుచేసినవి ఈ మూలికలు శరీరపు చాయిని సహజంగా మెరుగు పరుస్తాయి అవి నల్లని, అనారోగ్యకరమైన చాయని యిచ్చే మొటిమలు, దద్దుర్లు మొదలైన వాటిని పోగొట్టే వైద్య లక్షణాలు కలిగివున్నాయి

**నేచురల్లీ ఫెయిర్ మిక్కిలి శక్తివంతమైన నేటి మంచిచాయనిచ్చే క్రీమ్**

నేచురల్లీఫెయిర్ మిక్కిలి శక్తివంతమైన నేటి మంచిచాయనిచ్చేక్రీమ్ ఇది శరీరపు చాయ బయట నుంచి, లోపల నుంచి నల్లబడకుండా ఆపడమేకాకుండా చర్మానికి సహజమైన మూల పదార్థములతో పోషణ కలిగిస్తుంది

**నేచురల్లీ ఫెయిర్ అన్నివిధాలా సురక్షితమైనది**

సహజమైన మూలపదార్థములు చేరివుండడంతో నేచురల్లీ ఫెయిర్ సున్నితంగా పనిచేసి, మీ చర్మానికి హాని కలిగించదు అయితే, మీ చర్మానికి పడక పోతే లేక మీ చర్మం మరీ సున్నితమైనదయితే మీకు మొదట కొద్దిగా దురదపెట్టినట్లు అనిపించ వచ్చు అయితే అది వెంటనే తగ్గిపోతుంది అలా తగ్గకపోతే దయచేసి దానిని వాడటం మానివేయండి

**ఇందులో చేరినవి .**

| | | |
|---|---|---|
| సన్ ఫిల్టర్లు | | |
| పాలు | : | 3 0% |
| దోససారం | | 3 0% |
| చిరంజీ సారం | | 0 2% |
| సౌస్సురియాలప్పా సారం | | 0.5% |
| కొబ్బరి నీరు | | 1.0% |
| ఆల్కహాలు | | 0 5% |

**నేచురల్లీ ఫెయిర్ ఎలా, ఎప్పుడు వాడాలి**

ప్రారంభంలో 'తీవ్రసంరక్షణ క్రీమ్'గా వాడాలి అ తర్వాత మీ మంచి చాయని కాపాడే చికిత్సాక్రీమ్‌గా ఉపయోగించాలి

నేచురల్లీ ఫెయిర్ రోజుకి రెండుసార్లు ఉపయోగించండి రాత్రి మరియు బయటకు వెళ్ళడానికి ముందు లేక ఉదయిమూ మీ ముఖము, మెడ, చేతులు నీటితో కడుక్కోండి అంతటా నేచురల్లీ ఫెయిర్ మెల్లగా, గుండ్రంగా రాయండి అతితక్కువ వ్యవధిలో, కొద్దివారాలలోనే మీ చర్మం మంచి చాయని పొందుతుంది ఆరోగ్యంగానూ, ఎంతో మృదువుగానూ వుంటుంది యవ్వనాన్ని పొందినట్లు కనిపిస్తుంది





అజేయుడులో శోభన వెంకటేష్

## బీశెట్టి మూలకద తో జలాకర్ రాఖ్ కర్‌దూంగా హిందీ చిత్రం

శ్రీ హరిప్రియా సినీ క్రియేషన్స్ వారు భారి ఎత్తు_న నిర్మిస్తు_న్న హిందీ చిత్రం – 'జలాకర్ రాఖ్ కర్‌దూంగా' (కాల్చి బూడిద చేసా_ను!). శ్రీ భీశెట్టి లక్ష్మణరావు రాసిన 'మూల కథ' తో బొంబాయిలో షూటింగ్ జరుగుతున్న యీ భారి చిత్రంలో దర్మేంద్ర, గోవింద, అనితారాజ్, ఫరా, తనూజా, శక్తి_కపూర్ అనుపమఖేర్ తారాగణం పాటలు మ్యూజిక్ రవీంద్రజైన్ స్క్రీన్‌ప్లే – మాటలు కె కె సింగ్ దర్శకత్వం కె ఆర్ రెడ్డి సగానికి పైగా పూర్తయిన యీ భారి వర్ణ చిత్రానికి నిర్మాత రాంబాబు. తెలుగు, కన్నడ, తమిళ శతదినోత్సవ చిత్రాలకు ఒకేసారి కథలు అందించిన భీశెట్టి హిందీ చిత్రానికి కూడా కథ ను యివ్వడం – విశేషం' వెంకటేశ్ హీరోగా అజేయుడు – అర్జున్ హీరోగా మాపల్లెలో మగాడు త్వరలో విడుదల కానున్న భీశెట్టి తాజా చిత్రాలు.

## ఎస్. జయరామారావు చిత్రాలు

"భార్గవ రాముడు" నిర్మాత ఎస్.జయరామారావు సమర్పించే ఆర్. జె. ఆర్. ప్రొడక్షన్స్ హాస్యరసప్రదాన చిత్రం షూటింగ్ జూన్‌లో మొదలవుతుంది కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. అంబరీష్ నిర్మాత రావు గోపాలరావు, రాజేంద్రప్రసాద్ ఆదిగాగలవారు పాల్గొంటారు.

ఆ తర్వాత బాలకృష్ణతో ఎస జయరామారావు నిర్మించే జె బి ఆర్స్ వారి చిత్రానికి ఎ కోదండరామిరెడ్డి దర్శకుడు

# పుణ్యదంపతులు లో ప్రాణదాత

ఒక రోగిని ఒకతను వైకుంఠం (వీరభద్రరావు) నాటు వైద్యశాలకు మోసుకొచ్చి పడుకోబెట్టాడు. మధ్యాహ్నం నుంచీ ఇదండీ వరస. ఒంగోలేదు- కూకోలేడు. నోటిమాట పడిపోయింది" అన్నాడు.

వైకుంఠం తీవిగా "ఆపు! అంతా అర్ధమైపోయింది. ఇంకేం చెప్పకు. తులసీ. వెళ్ళి కాలకూట కషాయం తసుకురా చెప్తా. ఈదెబ్బతో వీడి జబ్బు పటాఫట్. ఆఁ ....పట్టుకోండి! గుర్రంలా తన్నుతున్నాడూ అంటే, బహుశా యిది గుర్రపువాతం అయ్యుంటుంది. ఏం సందేహంలేదు. సంతానం! గూట్లో గుర్రపు నాడావుంది పొయ్యిలో పెట్టి ఎర్రగా కాలేవరకు వుంచు! అని భార్యకు పురమాయించాడు.

ఇంతలో డాక్టర్ కల్యాణ్ (శోభన్‌బాబు) అటు వచ్చినవాడల్లా "ఆపండి!ఏమిటి మీరు చేస్తున్న పని" అన్నాడు.

"వాతరోగి-వాత మార్గాయ్యే రోగ తీరాయణం- "అన్నారు సంసృతంలో" అంటూ వైకుంఠం ఏదో చెప్పబోయాడు.

"వాట్ నాన్సెన్స్ యుఆర్ టాకింగ్! పశువులకు చేసినట్లు ఏంటా వైద్యం? తీసేయ్!"

"ఓహో! గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లుంది. తరతరాల నుంచి వంశపారంపర్యంగా వస్తున్న ఆయుర్వేద విద్యను అవమానిస్తే నేను సహించను."

ఆయుర్వేదంలో ఆ ఆలు కూడా తెలీని నీలాంటి వాళ్ళు ఆ వైద్యం చేయబట్టే ఆ వైద్యానికి విలువ లేకుండా పోయింది. తప్పుకోండి," అంటూ కల్యాణ్ ఆ రోగికి ఇంజెక్షన్ ఇచ్చాడు. వెంటనే రోగి తేరుకున్నాడు. వైకుంఠం వంక తిరిగి. "చూడు. మిష్టర్! మళ్ళీ ఇలాంటి తప్పుడు వైద్యం చేయడానికి ప్రయత్నం చేశావో- నిన్ను పోలీస్‌స్టేషన్‌కు పంపిస్తాను ఖబడ్దార్!" అంటూ కల్యాణ్ వెళ్లిపోయాడు.

వైకుంఠం దిగాలుగా చూస్తుండి పోయాడు.

ఎన్. రామలింగేశ్వరరావు సమర్పించే శ్రీ లక్ష్మి అన్నపూర్ణ క్రియేషన్స్ "పుణ్యదంపతులు" చిత్రాన్ని అనిల్‌కుమార్ దర్శకత్వంలో బి. బుల్లి సుబ్బారావు. కె. వెంకటేశ్వరరావు నిర్మించారు.





"మా ఊరి మగాడు"లో కృష్ణ, శ్రీదేవి



"సర్దార్ కృష్ణమనాయుడు"లో విజయశాంతి

## కృష్ణ దర్శకత్వంలో ఆయనతో పాటు మహేష్ నటించే చిత్రం

"కృష్ణగారితో పాటు ఆయన ద్వితీయ పుత్రుడు మహేష్ ప్రధాన పాత్రలో పరిచయం కాబోతున్నాడు. ఊటీలో మే 21న షూటింగ్ ప్రారంభిస్తాం" అన్నారు పద్మావతి ఫిలిమ్స్ అధినేత యు. సూర్యనారాయణబాబు. ఈయన కృష్ణ దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, గిరిబాబు, కెప్టెన్ రాజు ప్రభృత నటవర్గం. పరుచూరి సోదరుల రచన, రాజ్-కోటి సంగీతం. వి. ఎస్.ఆర్. స్వామి ఛాయ. రాజు సాహసాలు తెరవెనుక హంగులు.

## "మదన గోపాలుడు"గా రాజేంద్రప్రసాద్

"మద్యం మగువే జీవితం అనుకునే ఓ యువకుడు అలా ఎందుకు భావిస్తున్నాడు? చివరికి సార్థకమైన జీవితమంటే ఏమిటో ఎలా గుర్తించ గలిగాడు? అనేదే ఈ చిత్రం ఇతివృత్తం. సరసమైన శృంగారం, సున్నితమైన హాస్యంతో తోటకూర ఆశాలత రాసిన నవల ఆధారం. రెండో షెడ్యూల్ ఏప్రిల్ 20 నుంచి 30 వరకు మద్రాసులో జరిగింది. ఆఖరి షెడ్యూల్ అమరావతిలో మే 1 నుంచి 15 వరకు జరుగుతుంది." అన్నారు ఎ. ఎస్. మోహనరెడ్డి. ఈయన క్రియేషన్స్ దర్శకత్వంలో ఎ. సురేంద్రనాథ్



రెడ్డి. ఎం. కాం. నిర్మిస్తున్న పై చిత్రంలో రాజేంద్రప్రసాద్, రమ్య, రాజ్యలక్ష్మి, జె. వి. సోమయాజులు, గొల్లపూడి మారుతీరావు, నారాయణరావు, వరప్రసాదరావు, బాలాజీ, నటరాజ్, పుష్పా పూర్ణానందం, మమత, రాధాకుమారి, జానకి, నవతారలు రాజహంస, ప్రియాంక, వసంతి పాల్గొన్నారు. మధు మాటలు. ఆత్రేయ పాటలు. శివాజీరాజా సంగీతం, దివాకర్ ఛాయ. రంగారావు శిల్పం. శీను నృత్యాలు. చింత రామకృష్ణ - భాను ప్రొడక్షన్. ఉయ్యూరు రామకృష్ణ నిర్మాత. రాంగోపాల్ రెడ్డి కూర్పుతో ఆర్. దశరథరామిరెడ్డి. వి. ఇ. సమర్పణ.

"జ్వాలాముఖి"లో రమ



## చిరంజీవి, మోహన్‌బాబులతో జయకృష్ణ సమర్పించే "చక్రవర్తి"

"30 మంది నర్తకీమణులతో బెంగళూరులో చిరంజీవితో ఒక డిస్కో సాంగ్‌ను చిత్రీకరించాం. బెంగుళూరు దగ్గరున్న రామనగర్ కొండల్లో పతాక సన్నివేశాలను అత్యధిక వ్యయ ప్రయాసల కోర్చి రూపొందించాం" అన్నారు డాక్టర్ కె. వెంకటేశ్వరరావు. ఈయన నిర్మించే వసంతా ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి పై చిత్రంలో చిరంజీవి, మోహన్ బాబు, భానుప్రియ, రమ్యకృష్ణ, సత్యనారాయణ, జె. వి. సోమయాజులు, అల్లు రామలింగయ్య, మమత వగైరా నటవర్గం. గణేష్‌పాత్రో మాటలు. చక్రవర్తి సంగీతం. లోక్‌సింగ్ ఛాయ. తార నృత్యాలు. వెల్లస్వామి కూర్పు. బాబూరావు నిర్వహణతో జయకృష్ణ సమర్పించే ఈ చిత్రానికి రవిరాజా పినిశెట్టి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించారు.

# padmini FANS



Dec'-lite



Deluxe



President



Premier



# జీవితంలో పిల్లగాలిలా చల్లగా వీస్తాయి

అద్భుతమైన డిజైన్లతో చూపులకు చక్కగా పవనానికి రాజుగా అందంలో అందరారే సుందరమైన ఫ్యాన్లు పద్మిని ఫ్యాన్లు – ప్రతి పద్మిని ఫ్యాన్ అత్యున్నతమైన క్వాలిటీ కంట్రోలు పరీక్షలకు నిల్చి గెల్చిన తరువాతే మీ ముందుకు వస్తుంది నాణ్యతను ఎవ్వరూ అధిగమించలేనంత గొప్పగా ఫ్యాన్ తన అన్ని విడిభాగాలు స్వంత ఫ్యాక్టరీలోనే తయారు చేయబడి సురక్షితులైన నిపుణుల పర్యవేక్షణలో పరీక్షింపబడిన తర్వాతే ఒకటిగా కూర్చబడి ఆర్థికంగా అందుబాటులో ఉండి చెక్కు చెదరని పనితనంతో ఎవ్వరూ ఇవ్వలేని గ్యారెంటితో మీ ముందుకు వస్తుంది



మా ఉత్పత్తులు : 4 మోడల్స్ ; • ప్రీమియర్ – 24", 36", 42", 48", 52", 56" • డీలక్స్ – 48" • డెక్-లైట్ – 48" • ప్రెసిడెంట్ – 48 ప్రీమియర్ మోడల్ 5 రకాల రంగుల్లో లభిస్తోంది – వైట్, గ్రే, బ్రౌన్, బ్లాక్, ఐవరీ

ఇంకా పద్మిని వారు – కూల్‌మార్గ్ ఎయిర్ కూలర్లు, రెవోక్లీన్ వాషింగ్ మెషిన్లకు సైతం ఉత్పత్తిదారులు

## సుజన ఎంటర్‌ప్రైజెస్

8/ఎ. వెంగల్‌రావు నగర్, హైదరాబాద్-500 890

ఫోన్ : 263609

డబుల్ బాల్ బేరింగ్
**7** సంవత్సరాల గ్యారంటీ



సుజన డొమెస్టిక్ అప్లైయన్సెస్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

బ్రాంచి సుజన ఎంటర్‌ప్రైజెస్, 493, రెడ్డి & రెడ్డి కాలనీ తిరుపతి కోస్తల్ ఆంధ్ర & ఒరిస్సా మార్కెటింగ్ ఏజెంట్- ది సెంచరీ ట్రేడింగ్ కంపెనీ, 25-22-25, ముదునూరివారి వీధి, గాంధీనగర్, విజయవాడ-3 ఫోన్ 74261

Adworld/1094/87

# ఆంధ్రసచిత్రవారపత్రిక



## పాఠకులకు
## శత చిత్ర నటి
# సుమలత
## సమాధానాలు!

## త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న శత చిత్ర నటి సుమలత ఆంధ్ర సచిత్ర వారపత్రిక పారకుల ప్రశ్నలకు సమాదానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంబం కాబోయే ఈ శీర్షికకి పారకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం సుమలత ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లబిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా సుమలత సమాధానాలు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాందీనగరం, విజయవాడ -520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు

**పాఠకులు** ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

-------------------- కూపన్ --------------------

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక
# సుమలత సమాధానాలు

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

## సినిమా
### విశ్వనాధ్, చిరంజీవి కాంబినేషన్‌లో ఏడిద నాగేశ్వరరావు చిత్రం "స్వయంకృషి"

"తానెంత ఉచ్ఛస్థితికి ఎదిగినా – గతాన్ని మరవకూడదనే మహత్తరమైన సందేశాన్నిచ్చే చిత్రం. స్వయంకృషితో అత్యున్నతమైన స్థాయికి ఎదుగుతాడు మా కథానాయకుడు. ఏప్రిల్ షెడ్యూల్ పూర్తయింది. పాచ్ వర్క్ మే నెలలో," అన్నారు కె. విశ్వనాథ్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్న పూర్ణోదయ మూవీస్ వారి "స్వయంకృషి" చిత్రంలో చిరంజీవి, విజయశాంతి, సుమలత, చరణ్‌రాజ్, జె. వి. సోమయాజులు.



హీరో హీరోయిన్లు వర్షంలో తడిసి ముద్దయి పోరాడే సీను ఒక్కటి ఇంకా తీయాల్సి వుంది నీటి కరువు వల్ల షూటింగ్ వాయిదా వేశాం

బెనర్జీ ఎం వి ఎస్ హరనాదరావు మల్లికార్జున రావు హేమసుందర్ మిశ్రా మాస్టర్ అర్జున్ కె కె శర్మ పొట్టి ప్రసాద్ సంయుక్త అనిత జయలలిత పద్మ గెస్టుగా రాజ్యలక్ష్మి పాల్గొంటున్నారు సాయినాద్ సంబాషణల కర్త రమేష్‌నాయుడు స్వరకల్పనలో సి నారాయణరెడ్డి సీతారామశాస్త్రి గీతాలు రాశారు లోకసింగ్ చాయ అరుణ్‌కుమార్ శిల్పం శేషు – తార – రఘు నృత్యాలు ఎ జగన్మోహనరావు – పి రాజగోపాల్ ప్రొడక్షన్ ఏడిద రాజా నిర్వహణ నండూరి విజయ్ సహకార దర్శకత్వంతో తాడి హరిబాబు తాడి బాబ్జి సహనిర్మాతలు జూన్‌లో రిలీజ్, అన్నారు నిర్మాత ఏడిద నాగేశ్వరరావు



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**పి ఎం మురుగానందం, నగరి**

ప్ర ప్రధాని రాజీవ్‌గాంధీ పైమీ అభిప్రాయం?

జ కడు సమర్ధుడు

**బి ఎస్ జయకుమార్, శ్రీకాళహస్తి**

ప్ర భానుప్రియగారూ! అభినేత్రి అంటే ఏమిటో తెలుపుతారా ప్లీజ్

జ భావాలను నేత్రాల ద్వారా ప్రకటించగల నటి

**ఆర్ రామారావు, భువనేశ్వర్**

ప్ర తన కంటే చిన్న వారి పాదాలు కడిగి పెద్దవారు కన్యాదానం చేయడం సబబా?

జ మూర్ఖమైన ఆచారాల్లో ఒక భాగం ఇది కన్న కూతుర్ని మరో మగాడికి కట్న కానుకలతో సమర్పిస్తూ ఓ తండ్రి మరొకడి కాళ్ళు కడగవలసిన దురదృష్ట కరమైన సాంప్రదాయం

**సి డేవిడ్, హైదరాబాద్**

ప్ర మీరు ఎక్కువగా దేనిని ప్రేమిస్తారు?

జ కాలాన్ని దైవాన్ని

**ఎన్ నబీరసూల్, గుంతకల్లు**

ప్ర భానుప్రియగారూ! మనిషి చనిపోతే తరువాత మరో జన్మ ఉందంటారు కొందరు లేదంటారు మీరేమంటారు?

జ నాకు మరుజన్మ అంటూ ఉంటే అప్పుడే ఈ ప్రశ్నకు సమాధాన మివ్వగలనేమో!

**ఎ రెడ్డి శ్రీనివాసులు, కోట**

ప్ర పాదాల పారాణి ఆరకుండానే ఎందరో కన్నెలను బలితీసుకుంటున్న ఈ వరకట్న దురాచారం ఎప్పుడు అంతమవుతుందమ్మా?

జ పుచ్చుకునే వాళ్ళున్నంత వరకు ఇచ్చే వాళ్ళుంటారు ఇచ్చే వాళ్ళున్నంత వరకూ పుచ్చుకునే వాళ్ళుంటారు ఒకప్పుడు తానూ ఓ పెళ్ళి కూతుర్నే నని మరచి పోని అత్తగారూ ఓ రోజు తనూ ఓ కూతురికి తండ్రినౌతానని ఆలోచించే పెళ్ళి కొడుకులు ఉంటే ఈ దురాచారం మారిపోతుంది

**కె వి సూరపరాజు, తుని**

ప్ర మీరు కృష్ణతో కలిసి నటించే చిత్రమును మేము మళ్ళీ చూసే అవకాశమున్నదా?

జ ఉన్నది

**అందవరపు నాగేశ్వరరావు, కాశీబుగ్గ**

ప్ర మీకు కూడా ఒక అభిమాని ఉంటారు ఎవరు వారు చెప్పండి?

జ అభిమానమన్నది మనసులో దాచుకోవలసినది పైకి చెప్పకూడనిది

**ఎన్ ప్రమీల, గొల్లలగూడూరు**

ప్ర కవిత్వానికీ సాహిత్యానికీ తేడా ఏమిటి?

జ కవిత్వం మనసును రంజింప జేస్తే సాహిత్యం మెదడును ఆలోచింప జేస్తుంది

**కె విజయకుమార్, హైదరాబాద్**

ప్ర వేదికలపై స్త్రీలకు సమానత్వం కావాలని ఉపన్యాసాలు ఇచ్చే స్త్రీలే తమ పేర్ల చివరన భర్తల పేర్లు ఎందుకు రాస్తారు?

జ అది సాంప్రదాయం కదా?

**దాసరి వెంకటగిరి, బాలసూర్**

ప్ర ఒక్కోసారి మీ సమాధానాలు కాస్త చప్పగా ఉంటాయి కదండీ?

జ పిండి కొద్దీ రొట్టె ప్రశ్న కొద్దీ సమాధానం

**వావిళ్ళ కృష్ణయ్య పంతులు, శ్రీకాకుళం**

ప్ర : ఆలస్యం అమృతం విషం- అంటారు కొందరు నిదానమే ప్రధానం - అంటారు మరి కొందరు మరి దేనిని ఆచరించాలంటారు?

జ సమయానుకూలంగా

**జె డేవిడ్, ఆముదాలవలస**

ప్ర భానూ గారూ! మీరు నూరు చిత్రాలు పూర్తి చేశాక ఏం చేస్తారు?

జ 101వ చిత్రంలో నటిస్తాను

**సి అరుంధతి, వరంగల్లు**

ప్ర చెల్లెమ్మా? నువ్వు చిరంజీవితో ఏ కొత్త చిత్రములో నటించనున్నావు?

జ విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్, రోజా మూవీస్ చిత్రాలలో

**జొలాది రమణయ్య, తుని**

ప్ర యూన్సిరాణి చిత్రములో మీ పాత్ర ఎలాంటిది?

జ చాలా డైనమిక్ కేరెక్టర్ త్వరలో నే మీరు చూస్తారుగా?

**శాంతిశ్రీ, పాకాల**

ప్ర ప్రియగారూ! మీరేదైనా అవార్డు చిత్రములో నటించవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాను

జ అలా కాదు, నేను నటించిన ఏదైనా చిత్రానికి అవార్డు రావాలని కోరుకోండి

**ఎల్ గురవయ్య, ప్రొద్దుటూరు**

ప్ర మా ప్రశ్నలకు సమాధానాలివ్వడానికి మీకు తీరిక ఎక్కడిదీ?

జ ఎలాగైనా తీరుబడి చేసుకుని సమాధానాలిస్తున్నాను మరి ☐

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు —సం

జమదగ్ని లో కృష్ణ, సుమలత



# అభిమాన తారలపై అభిప్రాయం

డేరింగ్, డాషింగ్, డైనమిక్, సుప్రీం హీరో "చిరంజీవి" నా అభిమాన నటుడు. ఆయన నటించిన చిత్రాలలో 90x నేను చూస్తూ ఉంటా ను. 8 సంవత్సరాలలో ఎందరో మనస్సులను "ఖైదీ" లా దోచుకున్నాడు మన సుప్రీం హీరో "చిరంజీవి". తెలుగు చలన చిత్ర రంగంలో చిరంజీవిగారు ఎంతో ఎదిగి పేరు



ప్రఖ్యాతులు గడించారు. తెలుగు చలన చిత్ర పరిశ్రమలో తారాజువ్వలా దూసుకు పోతున్నారు మన నట భాస్కర చిరంజీవి. చిరంజీవిగారు ఇలానే ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొని గొప్ప నటుడిగా పేరు పొందాలని నా కోరిక. చిరంజీవిగారు నటించిన "రాక్షసుడు"చిత్రం ఈ సంవత్సరంలో '26' కేంద్రాలలో ఘనవిజయం సాధించి "ఆంధ్ర రికార్డు" సృష్టించింది. "దొంగ మొగుడు" చిత్రంలో చిరంజీవి గారు ఎంతో బాగా నటించారు. ఆ చిత్రంలో చిరంజీవిగారి నటన చాలా బాగుంది. తొందరలో విడుదలయ్యే "ఆరాధన" "చక్రవర్తి" చిత్రాలు కూడా బాగుంటాయని నేను ఊహించు చున్నాను.

—షేక్ జకీర్ హుస్సేన్,
తంబళ్ళపల్లి, (చిత్తూరు)

★ ★ ★

తన అసమాన నటనా ప్రతిభతో అనతి కాలంలోనే విశేషంగా ప్రేక్షకుల ఆదరణ పొందిన నటి రాధిక నా అభిమాన నటి. తమిళ చిత్రంతో సినీ రంగంలోకి ప్రవేశించి, నెమ్మదిగా తెలుగు పరిశ్రమకు పరిచయం చేయబడి, ఆనాటి మహానటి సావిత్రిని తలపుకు తెస్తూ, అన్యాయానికి బలైన యువతిగా, పల్లె



పడుచుగా, చలాకీ పిల్లగా రౌడి లేడిగా, బాధ్యత నెరిగిన ఇల్లాలిగా ఇలా ఎన్నో పలు విధ పాత్ర పోషణ చేసి స్వాతి ముత్యం లోని విధవరాలి పాత్రలో నటనాకౌశలపుటంచుల్ని చేరుకుంది ఏ పాత్రనైనా అవలీలగా పోషించి అటు పరిశ్రమ ఇటు ప్రేక్షకుల మెప్పు పొందింది తెలుగు సినీ జగత్తులోనే కనీ, వినీ ఎరుగని రీతిలో ఆస్కార్ అవార్డుకు ఎన్నికైన చిత్రంలో నటించడం ఈ నటి పూర్వజన్మ సుకృతం, మన తెలుగు కళామతల్లి అదృష్టం కాని ఈ నటికి ఇంత వరకూ ఒక్కసారి కూడా రాష్ట్రస్థాయి అవార్డు రాకపోవడం చాలా బాధాకర విషయం ఏది ఏమైనా ఈ నటి మరిన్ని వైవిధ్య మున్న పాత్రలలో నటించి ఆస్కార్ అవార్డు పొంది, అంతర్జాతీయ స్థాయిలో భారతదేశ సినీ పరిశ్రమకు గొప్ప ఖ్యాతి నార్జించి పెట్ట గలరని ఆశిద్దాం.

—బి. లీలావతి, తిరుపతి

★ ★ ★

అద్భుత నటనాకౌశలంతో అనతి కాలంలోనే ఆంధ్రులకు అతి చేరువైన అందాల బాలుడు బాలకృష్ణ నా అభిమాన నటుడు.

మొదటి చిత్రమైన 'అక్బరు సలీం అనార్కలి' తో తన సినీ జీవితానికి పునాది వేసుకున్నాడు. అయిదారేళ్ళు ఆ పునాది అలాగే ఉండి పోయినా మళ్ళీ 'భార్యా భర్తల బంధం' చిత్రంతో ఆ పునాధుల నుంచి ప్రారంభించి కథానాయకుడు, మంగమ్మగారి మనవడు, అనసూయమ్మ గారి అల్లుడు, దేశోద్ధారకుడు మొదలగు చిత్రాల్ని ఇటికలుగా పేర్చుకుని నేడు తెలుగు సినీరంగంలో తనకంటూ ఒక మహాసౌధాన్ని నిర్మించుకున్నాడు.



ఒక చిత్రాన్ని చూస్తున్నప్పుడు నేటి సగటు ప్రేక్షకుడు అది ఏ చిత్రమైనా, అందులో ఏ నటుడు నటించినా ఇది 'బాలకృష్ణ టైపు' నటన అని గుర్తించగలగుతున్నాడంటే బాలకృష్ణకి నేటి మన సినీ రంగంలో ఎంత సుస్థిర స్థానం ఉందో మనం ఊహించుకోవచ్చు.

ప్రత్యేక తరహా నటన, సుతిమెత్తని గొంతుతో చెవులకు ఇంపుగా ఉండే డైలాగులు, అవలీలగా చేసే ఫైట్స్, చక్కని డ్యాన్సులు మా బాలకృష్ణని సొత్తులు.

తనకున్న కోట్లాది మంది అభిమానుల్లో ఒకడిగా నేను మా బాలకృష్ణకి ఇచ్చే సలహా ఏమిటంటే ఎప్పుడూ పగ, ప్రతీకారం మార్కు చిత్రాల్లోనే నటించకుండా విభిన్న తరహా పాత్రలు పోషించి మిగిలిన ఆంధ్రులందరి అభిమానాలని కూడ చూరగొనాలని నా కోరిక

—ఎ భానుప్రకాశ్, అశోక్‌నగర్,
సికింద్రాబాద్

★ ★ ★

మంచి పాత్రలు ధరించి తెలుగు చలనచిత్ర రంగంలో తనకంటూ ఓ ప్రత్యేక ఇమేజ్‌ని ఏర్పరుచుకొని ఈ నాడు డేరింగ్ అండ్ డాషింగ్ హీరోగాఅభిమానుల ముందు సినీ జగత్తులో రాకెట్‌లా దూసుకెళ్తున్న కృష్ణ గారిని అభిమానించే లక్షలాది అభిమానులలో నేనొక చిన్న అభిమానిని ఈనాడు చిత్రం చూచి నేను కృష్ణగారి అభిమాని నయ్యాను ఆయన డైలాగ్స్ అంటే నేను



ఎక్కువగా ఇష్టపడతాను. ఉదాహరణకు "పల్నాటి సింహం", "వజ్రాయుధం", "అగ్నిపర్వతం", "శక్తి "నాపిలుపే ప్రభంజనం" ఇంకా ఇలాంటి మంచి చిత్రాలలోని డైలాగ్స్ ఎన్నెన్నో ఉన్నాయి. నా నటుడు తెలుగు చలన చిత్ర సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్టించి, ఆయన సినీ జీవితములో నిర్మాతల పాలిటి కల్పతరువుగా, అలాగే నిజ జీవితములో వరద బాధితులకు పెద్ద ఎత్తున అనేక విరాళాలు ఇచ్చి బీదల పెన్నిధిగా నిల్చి తన ఉదార స్వభావాన్ని నిరూపించుకున్న మహోపకారి.

—సి. హెచ్. కృష్ణమోహన్,
కపిలేశ్వరపురం(కృష్ణా)

★ ★ ★

నా అభిమాన నటి సుహాసిని. స్వాతి చిత్రం చూసి ఆమె అభిమాని నయ్యాను.

ఒకపాత్రలో లీనమై పోయే విధంగా నటిస్తూ అది నటన అనిపించ కుండా నటించే వారే నిజమైన నటులు. ఆ కోవకు చెందిన తారే సుహాసిని. కుటుంబ కథా చిత్రాలలో ఆమె నటన అద్భుతం. యీ మధ్య విడుదలైన సంసారం ఒక చదరంగం చిత్రంలో ఆమెనటన ప్రశంసనీయం.



ఆమె నటించిన ప్రతి చిత్రం మిస్సవకుండా చూస్తుంటాను

మోడరన్ డ్రస్సులు వేయకుండా కుటుంబ కథా బలం గల చిత్రాలలో నటించి మెప్పించి ఎక్కువగా మహిళల అభిమానాన్ని అందుకోవల్సిందిగా నా అభిమాన నటి సుహాసినిని కోరుతున్నాను

—జిట్టా మణిమాలామోహన్,
గాంధీనగర్, కడప □

వర్చస్సులు పలురకాలు !

# లాక్మే క్యాలమైన్ మాత్రమే మూడు రంగులలో దొరుకుతుంది. మీ వర్చస్సుకు సరిపోయేలా అందులో ఒకటి.

## నేచురల్
గోధుమ ఛాయ
వారికి




## లైట్
పసిమి ఛాయ
వారికి




## గోల్డు
నలుపు ఛాయ
వారికి




కేవలం లాక్మే క్యాలమైన్ మాత్రమే మూడు అందమైన ఛాయలతో లభిస్తుంది— నేచురల్, లైట్, గోల్డ్.
వీటిలో ఒకటి మీ ముఖ సౌందర్యాన్ని ఇనుమడింప చేయడానికే ప్రత్యేకంగా తయారు చేశారేమో అని అన్పిస్తుంది.
లాక్మే క్యాలమైన్ మీ మోముపై సులభంగా వేసుకోవచ్చు. దీని మోహక పరిమళం మీ మదిని దోచివేస్తుంది.
దీనిలోని గుణకారక తత్వాలతో మీ మోము ఒక క్రొత్త శోభతో వెలిగి పోతుంది.

**లాక్మే**
**క్యాలమైన్**

ప్రతి వర్చస్సుకు అనువైన రంగులు.

TI




(గత సంచిక తరువాయి)

నాగభూషణాన్ని ఒక స్థితికి తేవడానికి వారం రోజులు పట్టింది

ఆదివారం మధ్యాహ్నం రమారమి పన్నెండున్నరకు అతను కుప్ప కూలిపోయాడు నేను చాల భయపడ్డాను ఎందుకిటువంటి ప్రస్తావన చేశానని చాల విచారించాను అతని గుణ గణాలు ఉన్న వాటిని దృష్టిలో ఉంచుకొని అతనిని వివాహమాడతాననో లేకపోతే ప్రస్తుతానికి విషయం వాయిదా వేయమనో చెప్పి ఉండవలసింది

అంత పెద్ద షాక్ తింటాడని నేను కలలో కూడా ఊహించలేదు

అతనికి నేను పదే పదే చెప్పుకొని వచ్చాను

నాగభూషణం! నీవంటి నటుడికి ఆ బిరుదు పొందడం ఎడం చేతిపని నీకున్న శాస్త్రజ్ఞానం అనుభవం కర్త మరో నటుడిలో కనిపించవు నిన్ను కించ పరచాలని నేననలేదు నువ్వు రంగ స్థల నటకులలో చిరస్థాయి అయిన స్థానం పొందాలని నేను కోరాను రేపు పొద్దున్న నీ భార్యనయినప్పుడు ఆ బిరుదుంటే ఎంతో గర్విస్తాను

ఈ మాటలకు అతడు తలెత్తలేదు- ఉదాసీనుడుగానే కనిపించాడు ఆ మనిషిని లేవనెత్తడం నా బాధ్యత లేనిపోని సమస్యనొకటి కల్పించి చాల హాయిగా నడుస్తున్న అతని జీవితంలో చిచ్చు రేపాను

నాగభూషణం!! నువ్వు ధైర్యం తెచ్చుకో! నీకు మరో హామీ కూడా యిస్తున్నాను ఆ పోటీలో నువ్వు గెలవొచ్చు ఓడిపోవచ్చు దానికి కూడా నేను విచారించను పోటీ అయిన వెంటనే మన వివాహం జరుగుతుంది ఇంత వరకు నేను వివాహం గురించి తీవ్రంగా ఆలోచించలేదు అందుబాటులోనున్న వరులలో నువ్వొక్కడివే నేను కోరిన వాడివి

ఈ మాటలు విని అతను నా ముఖం వంక చాలసేపు చూశాడు

నీ మాటలు నిజమా? ఈ వాగ్దానం చివరి వరకు నిలుస్తుందా? అతను ప్రశ్నించాడు

నేనెప్పుడూ వాగ్దానం చెయను చేసిన తరువాత దానిని అతిక్రమించను అటువంటి సందేహం నీకక్కరలేదు

క్రమంగా క్రమంగా తేరుకున్నాడు

ఒక వారం తరువాత అతనొక నిశ్చయానికి చేరుకున్నాడు

రాగలతా!! నువ్వు చెప్పినట్లే చేస్తాను రాబోయే పోటీలకు నిలబడతాను మన వివాహం అంత వరకు ఆగుతుంది ఆ తరువాత విషయాలు ఆలోచించవచ్చు కాని నీ సహాయం చాల అవసరం పోటీలు నిర్వహించే ఆ సంస్థతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఫారాలు తెప్పించి నింపి ప్రవేశ రుసుం కట్టి- ఈ బాదలన్నీ పడాలి అంత కన్న ముఖ్యమైనది నువ్వు సదా నాతోనే ఉండాలి నువ్వు ఇంట్లో తిరుగుతుంటే నేను ఎటువంటి పోటీలనైనా అవలీలగ గెలవగలను

అతను నా పట్ల చాల మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు పగటిపూట కొంత భాగం స్కూలులో గడిచిపోతుంది సాయంకాలం చాలసేపటి వరకు అతనితో మాట్లాడుతూ ఏదో ఒక రైలులో ఇల్లు చేరుకునే దానిని అతనేవో చాల విషయాలు అన్నీ నాటకాలకి సంబంధించినవే మాట్లాడేవాడు

నేను పోటీలు నిర్వహించే సంస్థకు రాసి అప్లికేషనుఫారాలు నింపి ప్రవేశ రుసుము కట్టాను- రెండు వందల రూపాయలు డ్రాఫ్ట్ చేసి పంపించాను

అన్ని విధాల అతను ముందుకు సాగుతున్నా ఏదో పెద్ద లోటు ఉన్నట్లే బాధ పడుతున్నాడు నేను నాలుగైదుసార్లు తరచి తరచి అడుగుతే నవ్వి ఊరుకున్నాడు నేరం చేసినవాడు తనకుతానే శిక్ష విధించుకొని ఆ శిక్షను చాల ఓర్పుతో అనుభవిస్తున్నట్లు నాకు తోచింది

ఇంతకీ అతను చేసిన నేరమేమిటి?

పోటీలు మూడు నెలలే ఉన్నాయి

నేను ఇంటికి కూడా వెళ్లడం లేదు- రెండవ పడక గదిలో పడుక్కుంటున్నాను- నాగభూషణంతో పడుక్కున్నా మా అమ్మ ఏమీ అభ్యంతరం తెలుపదు- మరొక్క మూడు నెలల తరువాత అతనితో కాపురం చేయడానికి, ఇప్పటి నుంచీ మొదలు పెట్టడానికి ఏ విధమైన భేదం లేదంది

**జరిగిన కథ –7** నాగభూషణానికి వాక్శుద్ధి నేర్పి మంచి నటుడిగా రాణింప జేసిన రాజశేఖరం కూడ నాగరత్నం ప్రోత్సాహం మీద నటుడవుతాడు అనారోగ్యానికి గురయి ఆస్పత్రిలో చేరిన నాగభూషణానికి రాజశేఖరం రాగలత వంతుల వారిగా సేవ చేస్తుంటారు రాగలత అనుభవాల కథనంలో నాగభూషణంతో పరిచయం శాకుంతలం నాటక ప్రదర్శన నాగభూషణం నుంచి పెళ్ళి ప్రస్తావన కొవ్వూరులో నాగభూషణం కొని బాగు చేయించిన ఇల్లు రాగలతకు కొవ్వూరులో ఉద్యోగం రావడం మొదలయిన ఘట్టాలు చదువుతుంటాడు రాజశేఖరం

సంస్థ నుండి నాగభూషణం పోటీలకు నిలబడడానికి అర్హుడని జవాబు వచ్చింది తారీకులు కూడా నిర్ణయమయాయి పోటీలలో రెండు దశలున్నాయి మొదటి దశలో పద్దెనిమిది మంది నటులలోను తొమ్మిది మందిని మాత్రమే ఎంచుతారు రెండవ వడపోతలో ముగ్గురే మిగులుతారు ఆ ముగ్గురికి ఒక రాత్రి పోటీ జరుగుతుంది

మొదటి పద్దెనిమిది మందిలోను నాగభూషణం రావడంలో వింతలేదు అన్నిటిలోను కూడా ముందుకెరాగలడు తప్పకుండా నెగ్గుతాడు

పోటీలు విజయవాడలో జరుగుతాయి

మొదటి వడపోతలు హనుమంతరాయ గ్రంథాలయంలో జరుగుతవి చివరి రోజు పోటీ మాత్రం ఏదో ఒక పెద్ద థియేటరులో జరుగుతుంది

ఒక నెల్లాళ్ళు విజయవాడలో నాగభూషణంతో వుండాలి అతనికి ఆర్థికపరమైన సహాయం కాని శాస్త్ర విషయాలలో సహాయం కాని అనవసరం అతనికి కావలసింది నైతికమైన సహాయం నేను తనతో వుంటే లోకమంతా వెలుతురు మయంగా వుంటుందంటాడు ఇన్స్పిరేషన్ కలుగుతుందంటాడు

అతనిని ఈ రొంపిలోకి దింపినదానిని నేనే అతను బయటపడే వరకు నేను అండగా నిలవక తప్పదు అందుచేత స్కూలుకు రెండు నెలలు సెలవుపెట్టి నాగభూషణంతో విజయవాడ బయలుదేరాను

★ ★ ★ ★ ★

విజయవాడలో మంచి హోటలులో బస చేశాము రెండు సింగిల్ రూమ్సు ఎ సి వి తీసుకున్నాడు నాగభూషణం సంస్థవారు నటులు ఉండడంకోసం కాలేజీ హాస్టలులో ఏర్పాటులు చేశారు బస, భోజనం—అన్నీ ఏర్పాటుచేశారు నాగభూషణం మాత్రం తన హోదా కది తగదని ఇద్దరం ఉండడానికి వీలుండదని హోటలులో నలభైరోజుల వరకు గదులు బుక్ చేశాడు

మేము విజయవాడ చేరిన మరునాటి నుండే రంగస్థల నటులు ఒకరూ ఒకరూ చూడడానికి హోటలుకు రావడం మొదలుపెట్టారు హోటలు ఖరీదయినదవడంచేత కనీసం వారికి కాఫీలు తెప్పించినా చాల డబ్బవుతుండేది

అక్కడికే సంతోషించేవాళ్ళం కొంతమంది మహానుభావులు మందు తెప్పించమనేవారు నాగభూషణం అటువంటి విషయాలలో కొంచెం దృఢంగానే వుండేవాడు తాగుడు మానేసి చాలకాలమైందని 'అటువంటి ప్రస్తావనే చేయవద్దని మొహమాటం లేకుండా చెప్పేవాడు

చాలమంది నన్ను చూసి ప్రశ్నలువేస్తే అతను నవ్వుతూ జవాబు చెప్పేవాడు

ఈమె పేరు రాగలత కొవ్వూరు హైస్కూలులో టీచర్‌గా పనిచేస్తున్నారు నాకు ప్రస్తుతం సెక్రటరీ ఈ పోటీలు అయిన తరువాత మేమిద్దరం వివాహం చేసుకుంటాము

అతని నిజాయితీకి నాకు చాల సంతోషం కలిగింది

వచ్చిన అతని స్నేహితులందరూ తప్పకుండ నాగభూషణమే పోటీలలో



## రాగలత

గెలుస్తాడని అనేవాళ్ళు

ఒక రిద్దరు మాత్రం కొంచెం నిరుత్సాహంగా మాట్లాడారు వీరభద్రరావని ఒకాయన గూడూరు నించి ధర్మయ్య అన్న అతను అనంతపురం నుండి పోటీలలో పాల్గొంటున్నారని ఒకొక్కరికి పద్మిహేను బిరుదు లున్నాయని బంగారు పతకాలకు లోటులేదని వారు వేసిన చాల నాటకాలకు రాబోయే ముగ్గురు జడ్జీలలో ఇద్దరు జడ్జీలు ఇంతకుముందు చాల బహుమతులిచ్చారని చెప్పారు

అందులో ధర్మయ్య అన్నతను చాల నిష్ఠగా వుండి నటిస్తాడని అతనిని గెలవడం ఎవరికీ సాధ్యంకాదని మా ఎదుటే చెప్పారు

నాగభూషణం నిరుత్సాహపడడం సహజమే

ఇలా వుంటుండగా పత్రికా విలేఖరులు ఒకరోజు వచ్చి హోటలుమీద దాడిచేశారు నాగభూషణం ఈ పరిస్థితిని కలలో కూడా ఊహించలేదు వాళ్ళందరిని స్పెషల్ కాన్ఫరెన్స్ రూములో ముందు కూర్చోబెట్టమన్నాను ఎండలో వచ్చినవాళ్ళకి కూల్‌డ్రింకులు ఆకలిగొన్నవారికి అల్పాహారాలు యిప్పించడం జరిగింది తరువాత నాగభూషణం నన్ను చూపించి అన్నాడు:

ఈమె రాగలత! నా సెక్రటరి–నా జీవితం గురించి వివరాలన్నీ ఈమె చెప్తారు మీరడిగిన ప్రశ్నల కన్నిటికీ ఈమె జవాబులు చెప్తారు

నాగభూషణం గురించి వివరాలు వారడిగారు

నాగభూషణం విజయనగరం జిల్లాలో భోగాపురం గ్రామంలో జన్మించారు వారి చిన్నతనంలోనే తల్లిదండ్రులు గతించారు వారి మేనత్త నాగభూషణం బాధ్యత తనపై వేసుకున్నారు రవీంద్రనాథ ఠాకూరుకుమల్లే నాగభూషణం ఇంటిదగ్గిరే చదువుకున్నారు చిన్నప్పటినుంచీ నాటకాలంటే చాల ఉత్సాహం చూపించారు వారు పదోయేటే పాతిక రాగాలు వందపద్యాలు చదివి శ్రోతలను తన్మయులను చేశారు వారికి నాటకాలపై కల అభిలాషను గుర్తించి వారి మేనత్త ప్రముఖ రంగస్థల నటులు సుబ్బిశెట్టి పాత్రధారులు, నాటకాలమామ ఉరఫ్ శ్రీనివాసరావుగారివద్ద రంగస్థల విద్య నేర్పించారు వీరు తన జీవితాన్ని నాటకాలకే ధారపోశారు సినిమాలకు పిలుపు వచ్చినా వెళ్ళలేదు ఎప్పుడూ కథానాయకుల పాత్రలే ధరించారు వేనకువేలు ఆంధ్రప్రజల హృదయాలను తన ఉత్తమ నటనచేత చూరగొన్న మేటి నటులు నాగభూషణం

తరువాత వాళ్ళు చాల ప్రశ్నలు వేశారు నాగభూషణానికి ప్రేయసు లెంతమంది? ప్రేమ లేఖలెన్ని వచ్చాయి? ఎన్ని చెప్పులు విసిరారు? తనకి బహుమతులుగా వచ్చిన మెడల్సులో ఎన్ని అతను చేయించుకున్నాడు? ఈవిధంగా అవకతవక ప్రశ్న లెన్నో అడిగారు అన్నిటికీ చిరునవ్వు సమాధానంగా సమర్పించాను

మొదటి రెండు వడపోతలు అయిపోయాయి పద్మినమందుగురిలో చివరకు అనంతపురం ధర్మయ్య గూడూరు వీరభద్రరావు, నాగభూషణం నిలిచారు తొలిసారి వడపోతకు చింతామణి నాటకం, రెండవసారికి సారంగధర ఆడారు పోటీ నాటకం హరిశ్చంద్ర మిగిలిన పాత్రధారులను సంస్థవారే ఏర్పాటు చేస్తారు రంగస్థలం అలంకరణ కూడా వారిదే మిగిలిన హంగులన్నీ వాళ్ళే సమకూరుస్తారు పోటీ నటులు తమవేషాలు తాము వేసుకొని రెండు గంటలసేపు స్టేజీమీద నటించాలి ఏ పోటీలో నేనా మొదటివాళ్ళు, రెండో వాళ్ళు ఈవిధంగా ఉంటారు కాని ఈ పోటీలో ఒక్కడిదే విజయం రెండో స్థలంలో వచ్చినవారికి కనీసం ఉప–మహానట బిరుదం కూడా యివ్వరు

నాలుగు సంవత్సరాల నుండి ఎవరికీ మహానట బిరుదం లభించలేదు ఈసారి పోటికి మిగిలిన ముగ్గురు నటులు ఇంతకుపూర్వం ఈ పోటీలో పాల్గొననివారే

ఎవరి కరపత్రాలు వారు పంచిపెట్టుకుంటున్నారు

నాగభూషణం చక్కని బ్రోచరొకటి తయారుచేయించాడు అర్థ్ పేపరు



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి

★ సొంత చిరునామాగల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

మీద ముద్రణ జరిగింది అందులో వేషంలో లేకుండా సహజంగా మధ్యపాపిడితో పైమీద వోణీతో తీయించుకున్న ఫొటో వేయించాడు నాగభూషణం చేశాడంటే సెక్రటరీయే చేసిందన్నమాట– బ్రోచరులో ఎక్కడా అతని బిరుదులుకాని అధిక ప్రశంసలుకాని లేవు ఎవరు గొప్ప నటులో నిర్ణయించవలసినది ప్రేక్షకలోకం

ఎవరిబాధలు వాళ్ళు పడుతున్నారు మూడు రోజులలో జరుగనున్న పోటీ నటులగురించి స్థానిక పత్రికలో ప్రత్యేకమయిన వ్యాసం ఒకటి పడింది అందులో ధర్మయ్య ఫొటో అతని మెడల్సు బిరుదాల పట్టీ ఎక్కడెక్కడ ఏ యే నాటకాలు వేసింది చాల చాల విపులంగా వుంది ఇన్ని వివరాలు ఎందు కివ్వవలసి వచ్చిందంటే ఈ సంవత్సరానికి మహానట బిరుదం అతనికి లభించినట్లే భావించవచ్చుననివుంది రెండవవారు వీరభద్రరావు ఇతని ఫొటో కూడా వేశారు ఇతను చాల చక్కగా పాడగలడని నటనలో కల కించిత్తు లోపం ఆవిధంగా కప్పబడుతుందని అందుచేత ఒకవేళ ఏదైనా కారణంచేత అదృష్టం వరిస్తే ఇతనికి బిరుదు రావచ్చు ఇతని గురించి కూడా రెండు కాలములు రాశారు మూడవ నటుడు నాగభూషణం గురించి నాలుగు వాక్యాలుకూడా రాయలేదు ఓడిపోవలసినవాడి గురించి రాయడంలో ఔచిత్యం లేదన్నారు

అవన్నీ నాగభూషణానికి చదివి వినిపించాను

అతను నవ్వి ఊరుకున్నాడు

అతను మాట్లాడుతున్నాడు భోజనం చేస్తున్నాడు నాతో సాయంకాలం షికార్లకి పోతున్నాడు అన్ని పనులు యాంత్రికంగా చేస్తున్నాడు ఈ పోటీలో నెగ్గకపోతే ఏం చేయ్యడమని అతని బయమా? అటువంటి భయానికి తావులేదు నేను పోస్టుడేటిడ్ చెక్ ఒకటి యిచ్చాను అతను పోటీలో గెలిచినా లేకపోయినా మా వివాహానికి ఆటంకం లేదన్నాను

మరెందుకా దిగులు?

బహుశా నా దృష్టిలో తాను తక్కువవుతానని అతని అభిప్రాయమా?

ఏవో చాలా రకాలుగా అనుకోవచ్చు

ఒకటి మాత్రం నిజం ఎంత ప్రోత్సాహం నేనిస్తున్నా అతను హెచ్చరికగా లేడు తన మనసులోని బాధ నాతో చెప్తే నేను మార్గాంతరాలను వెదకనా?

అతను పడుతున్న ఈ కష్టానికి నేను కారకురాలను

నన్ను నేను నిందించుకున్నా ప్రయోజనంలేదు

నాకు మాత్రం అచంచలమైన విశ్వాసం అతని మీదుంది

అతను తప్ప మరొకరు మహానట బిరుదానికి అర్హులు కారు వడపోతల్లో మిగిలిన యిరువురు నటించే విధానం చూసిన తరువాత నాగభూషణం ఇంకా ఉత్తమ నటుడని నాకు వ్యక్తమయింది ఈ విషయమే అతనితో అన్నాను – అతను నవ్వి ఊరుకుంటాడు – మనసు విప్పి చెప్పడు

పోటీ ఇంకా రెండు రోజులే ఉంది

నాగభూషణం గదిలో పచార్లు చేస్తాడు – పరధ్యానంగా ఉంటున్నాడు అతనిని చూసుకునే బాధ్యత నాది

ఆఖరున ఆడవలసిన పోటీ నాటకం హరిశ్చంద్ర

మరేదేనా నాటకం అయితే అనుకోవచ్చు హరిశ్చంద్ర నాటకం గురించి అవంతయినా సందేహం అక్కరలేదు ఆంధ్రదేశంలో హరిశ్చంద్ర వేషానికి నాగభూషణాన్ని మించినవాడు లేడు

మూడు రోజుల ముందు నుండీ ప్రచారం చాల ముమ్మరమయింది అద్దెకో మనిషిని పెట్టి బ్రోచర్లు పంచిపెట్టించాము అంతకుమించి మరేం చేయలేకపోయాము

రోజులు క్రమంగా గంటలు – తరువాత పోటీ –

పోటీ అయిపోయే వరకు ఒక ఆపలేని ఆందోళన

తరువాత ?

* * * * * * * *

ఆ విషయం తలచుకుంటే ఇప్పటికీ గుండె జలదరిస్తుంది

లోకం అంతటికీ తెలిసిన విషయమిది

పోటీనాడు రాత్రి ఎనిమిది నుండి పదిన్నర వరకు గూడూరు వీరభద్రరావు గారి నాటకం ఆ నాటకం మొదలవడం ఓ అరగంట ఆలస్యమయింది ముగ్గురు జడ్జీలు సరిగ్గా ఎనిమిదిన్నరకు రావడమేమిటి నాటకం మొదలుపెట్టారు ముగ్గురు పోటీ నటులకు మూడు పెద్ద గదులిచ్చారు వాటికి అటాచ్‌డ్ బాత్‌లు ఉన్నాయి పెద్ద నిలువుటద్దం నాలుగు కుర్చీలు ఒక టేబిలు ఒక పెద్ద సోఫా ప్రతి గదిలోను ఉన్నాయి

నాగభూషణం వేయవలసిన నాటకం పదకొండుకు మొదలవుతుంది వేషం వేసుకోడానికి మేము మా గ్రీన్ రూములోకి ఎనిమిదిన్నరకు చేరుకున్నాము

నాగభూషణం తొమ్మిదిన్నరకు తయారయి సోఫామీద విశ్రాంతి కోసం కూర్చున్నాడు మొదటి హరిశ్చంద్రుడు తన ప్రావీణ్యమంతా ఆడియన్సుకి వొలకబోస్తున్నాడు మధ్య మధ్యను చప్పట్లు మాత్రం మాకు గ్రీన్ రూములోకి కూడా వినిపిస్తున్నవి

క్రమంగా అన్నీ ఆగిపోయాయి

నాగభూషణం నటించవలసిన రెండవ నాటకం (అదీ హరిశ్చంద్ర నాటకమే) సరిగ్గాపదకొండుకి మొదలయి రాత్రి ఒంటి గంటన్నరకు ముగిసింది

మూడవ నాటకం పూర్తి అయ్యేసరికి రాత్రి మూడున్నర అయింది

న్యాయ నిర్ణేతలు విడివిడిగా సామూహికంగా చర్చించి ఉదయం నాలుగు గంటలకు పోటీ ఫలితాలు వెల్లడి చేశారు

మంగళతూర్యాల మధ్య నాగభూషణానికి మహానట బిరుద ప్రదానానికి స్టేజి మీద ఏర్పాటులు పూర్తి చేశారు

కాని ఆ బిరుదం అందుకోడానికి నాగభూషణం స్వయంగా స్టేజి వరకు




రాలేకపోయాడు జడ్జీలు తమ నిర్ణయాన్ని ఒక కొలిక్కి తీసుకొస్తుండే సమయంలో అతను గ్రీన్ రూములో హరిశ్చంద్ర వేషంలోనే పడిపోయాడు సంస్థ యజమానులు వెంటనే దగ్గరలోనున్న డాక్టరును తెప్పించారు క్రింద పడిపోయిన మనిషిని సోఫా మీద పడుకోబెట్టడం కష్టమయింది స్ట్రోకు వచ్చిందని వెంటనే ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో చేర్పించమని ఆయన సలహా యిచ్చారు

ఈ విషయమే ప్రదాన న్యాయ నిర్ణేత బిరుద ప్రదాన సభలో మాట్లాడుతూ థియేటరులో క్రిక్కిరిసిన నాటకాల అబిమానులకు తెలియజేశారు అతని జాగాలో నేనా బిరుదం అందుకొని బహుమతి పూలదండలను ప్రశంసా పత్రాన్ని పట్టుకొని అంబ్యులెన్సులో నాగభూషణంతో పాటు గవర్నమెంటు హాస్పిటల్‌కి పోయాను

మరునాడు పత్రికలలో ముందు పేజీలో ఇదే వార్త నాగభూషణం ఎవ్వరూ అనుకోని విధంగా నటించి నాలుగు సంవత్సరాల నుండీ మహానట బిరుదుకు అర్హులైనవారు తెలుగు దేశంలో లేరనే అపఖ్యాతి నుండి నాటకరంగాన్ని రక్షించారని వేనోళ్ల పొగడారు అన్ని పత్రికలవారు ఏకగ్రీవంగా నాగభూషణం ఆరోగ్యవంతుడయి మళ్లా స్టేజి మీద దర్శనమియ్యాలని కోరారు ఆ వార్తలలో ఎక్కడా గూడూరు వీరబద్రరావుగారి గురించి కాని అనంతపురం దర్మయ్య గారి గురించి కాని కొంచెమయినా ప్రశంసలేదు హాస్పిటల్‌లో వారం రోజులున్నాము

నాగభూషణం బాధ్యత అంతా నామీదే వేసుకున్నాను ఎవరికీ

ధర్మపథం




# అభిప్రాయభేదాలు

మానవుని చిత్తవృత్తి ఎప్పుడూ ఒక్క మాదిరిగానే ఉండదు అతనిలో అతనికే విభిన్నాభిప్రాయాలు కలిగితే ఆశ్చర్యపడనక్కర లేదు అలాటప్పుడు వేర్వేరు వ్యక్తులకు విభిన్నాభిప్రాయాలు ఉండడంలో వింత లేదు ఒకే అభిప్రాయం కలవారు ఒక పక్షంగా ఏర్పడి తమకు వ్యతిరేకంగా వున్న వారిని ఎదిరించడం సహజం ఇలాంటి పార్టీలు గ్రామ స్థాయిలో ప్రారంభమయి క్రమక్రమంగా దేశమంతటా వ్యాపిస్తాయి

అభిప్రాయభేదాలు విస్తరించి పట్టుదలగా మారిపోతాయి ఎదుటి పక్షం వారిని ఎదిరించడమే తమ ప్రధాన లక్ష్యంగా ఉంటుంది ఇట్టి స్థితిలో యుక్తాయుక్త విచక్షణ నశిస్తుంది మంచి చెడ్డల ఆలోచన ఉండదు అతి స్వల్ప విషయం దగ్గర నుంచీ ఇది ప్రారంభమవుతుంది ఏ పక్షానికీ చెందని తటస్థులూ, అమాయకులూ కూడా ఇందులో ఇరికింపబడతారు

ఇట్టి పార్టీల పట్టుదలలకు అర్థం సామాన్యంగా కనబడదు

ఈ అభిప్రాయభేదాల వల్ల దేవాలయాల ఉత్సవాలూ, పూజలూ, దేవతల ఊరేగింపులూ కూడా నిలిచిపోవడం, ఇరుపక్షాల వారి మధ్య కొట్లాటలు జరుగుతూ వుంటాయి కుటుంబ కలహాలు కూడా పెరుగుతాయి

అభిప్రాయబేదాలు ఉన్న వారు, తమ అభిప్రాయాలే సరియైనవని, ఎదుటి పక్షం వారి అభిప్రాయాలు సరియైనవి కావనీ వాదిస్తారు యుక్తాయుక్తాలను విచక్షణులే నిర్ణయించాలి

అభిప్రాయభేదాలు ఉండవచ్చును కాని, ఏ అభిప్రాయపు లక్ష్యమైనా అభ్యుదయానికీ, మానవ కల్యాణానికీ మార్గదర్శకమయి ఉండాలి దారులు వేరు వేరుగా ఉన్నా గమ్యస్థానం ఒకటిగా ఉండవలసి యున్నది అది మంచికే సర్వవిధాలా ప్రయత్నించాలి ప్రతిపక్షాన్ని ఎదిరించడంతోనే తృప్తి పొందకూడదు ఏ పక్షం ప్రజలందరి సౌభాగ్యం కోసం ప్రయత్నిస్తుందో ప్రజా సమూహం ఆ పక్షం వైపే మొగ్గు చూపిస్తుంది ఇట్టి సత్ప్రయత్నం గ్రామ స్థాయిలో ప్రారంభమై, మండలాలలో చోటు చేసుకొని క్రమంగా రాష్ట్రాభివృద్ధికీ, దేశాభివృద్ధికీ దోహదం కావాలి ఇది ఆయా పక్షాల నాయకుల పయి ఆదారపడి వుంటుంది

విబిన్నాభిప్రాయాలు గలవారు వ్యక్తిగత రాగద్వేషాలను విడిచి, నిర్మాణాత్మక కార్యకలాపాల్లో ప్రతిపక్షం వారితో సహకరించడం వారి కీర్తి ప్రతిష్ఠలకు దోహదమవుతుంది దేశ పురోగతికి తగినదీ అవుతుంది

–బులుసు వేంకటరమణయ్య

## రాగలత

టెలిగ్రాములిచ్చి పిలిపించవలసిన బంధువులు అతనికి లేరు మా అమ్మను విజయవాడ రప్పించడంలో అర్థం లేదు మొదటి మూడు రోజులు ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో ఉంచిన తరువాత అతనిని స్పెషల్ కాబిన్‌లోకి మార్చాము ప్రమాద పరిస్థితి దాటిపోయింది

నాగభూషణానికి కుడి చేయి కుడి కాలు రాడం లేదు మూతి కొంచెం వంగినా మాటకు ఆటంకం కలిగించలేదు

నాగభూషణం తనతో పదివేల రూపాయలు తెచ్చాడు హోటలులో ఉండి ఖర్చుపెట్టినది ప్రచారానికి ఖర్చు పెట్టినది పోగా ఇంకా చేతిలో అయిదు వేలున్నాయి అతనికి తెలియకుండా నేనో రెండు వేలు తీసుకొచ్చాను అందుచేత డబ్బుకి ఏ విధమైన ఇబ్బందిలేదు

నాగభూషణాన్ని చూడడానికి వచ్చే స్నేహితులను అభిమానులను హాస్పిటలువారు అడ్డలేక చాల అవస్థపడ్డారు ఎవరి నోటంట విన్నా నాగభూషణం నటన గురించే వాళ్ల మాటలు వింటుంటే నాకేదో గర్వంగా ఉండేది ఈ నాగభూషణాన్ని పోటీలకు ముందుకు తోసి మహానటుడి నొకడిని ఆంధ్రదేశానికి సమర్పించానని చాల సంతోషించాను

నాగభూషణం చాలా ప్రమాదమైన పరిస్థితులలో చిక్కుకున్నాడు మూడు రోజులు అతనికి తెలివిలేదు నాలుగో రోజు తెలివి వచ్చిన తరువాత అతని ఘనవిజయం గురించి చెప్పి పత్రికలలో వార్తలు చదివి వినిపించినా అతను హర్షపులకిత గాత్రుడు కాలేదు కొంతమంది ప్రేక్షకులు తమ అనుభూతులు తెలియజేశారు ఆ ప్రశంసలు అతనికి వినిపిస్తే అతని ముఖం ఇంకా మ్లానమయి ఉదాసీనమయి నిస్తేజమయిపోయేది

నాగభూషణం బాగుపడాలంటే నాటకం గురించి మాట్లాడకూడదు

వారం రోజులు హాస్పిటలులో ఉన్న తరువాత పెద్ద డాక్టరుగారు పరీక్షచేసి నాతో కొన్ని నిజాలు చెప్పారు

అమ్మాయీ! ఇతను చాల అదృష్టవంతుడు చాల బలమయిన స్ట్రోక్ నుండి బయటపడ్డాడు రెండు నెలల వరకు ఇతనిని మంచం మీద నుండి దిగనీయకూడదు అప్పటికి ఇతనికి కాలు చేయి తిరిగి రావచ్చు ఎటువంటి పరిస్థితులలోను ఇతను ఉద్రేకం పొందకూడదు దయతో ఆదరంతో అతనిని చూడాలి అతనిని అన్నివిధాల చాల శ్రద్ధతో అభిమానంతో కాపాడుకొని రావాలి దానికి ఎంతో త్యాగం అవసరం నువ్వొక్కర్తెవె ఇతనికి కావలసినదానివి మీరిద్దరూ వివాహం చేసుకోవలసిన సమయంలో ఈ విపరీతమయిన పరిస్థితి ఏర్పడింది అతని చావుబతుకులు నీ చేతిలోనే ఉన్నాయి కాబట్టి నువ్వు చేయవలసిన త్యాగం ఏ ప్రమాణంలో ఉండాలో నేను వివరించనక్కరలేదు

నాగభూషణానికి డాక్టరుగారు నాతో మాట్లాడినట్లు తెలీదు మందులు రాసి యిచ్చారు

మరునాడు ఉదయం టాక్సీలో బయలుదేరి పన్నెండు గంటల వేళకి కొవ్వూరు చేరుకున్నాము

ఆ క్షణం నుంచి కొవ్వూరులో ఉన్న యింటికి అంకితమయిపోయాను

(ఇంకా ఉంది)

# అబద్ధంతో దాగని నిజం

లక్ష్మీ శ్రీనివాస్

అతను ఆ రోజు నుండి మళ్ళీ కనిపించలేదు అప్పుడే నెల గడిచిపోయింది ఈ వేళ కాకపోతే రేపైనా వస్తాడని రోజూ ఎదురు చూస్తూనే వున్నాను

అతడా రోజు వరకూ ప్రతి సాయంత్రం మా సెంటరుకు వచ్చేవాడు నా దుకాణం దగ్గరే అరడజను అరటి పళ్ళు రోజూ తీసుకునేవాడు వారానికోమారు అరడజను బత్తాయిలో అరకిలో ద్రాక్షపళ్ళో తప్పని సరిగా కొనేవాడు

అలాంటి మనిషి ఆ నాటి నుంచీ నాకు కనబడక పోవటం చాలా ఆశ్చర్యంగా వుంది అతనితో మరీ పెద్ద పరిచయం నా కు లేదు గాని – పేరు మాత్రం సత్యమూర్తి అని తెలుసు మాటల సందర్భంలో ఒకసారి ఎదో ఆఫీసులో పన్చేస్తున్నట్టు చెప్పాడు అదేం ఆఫీసో నేనప్పుడే మర్చిపోయాను

ఆఫీసు మర్చిపోయావు గాని అతన్నెందుకు మర్చిపోలేక పోతున్నావని మీరడుగుతారేమో – అదే నేనూ చెప్పబోతున్నాను అది చెప్పే ముందు నా గురించి కూడా మీకు కొంచెం చెప్పుకోవాలి కదా

మీరు ఎంత లేదన్నా మా పట్నంలో వున్న పెద్దాసుపత్రి వైపు ఒకే ఒక్క సారైనా వచ్చి వుండకపోరు మీరు గనక వచ్చి వుంటే – ఆసుపత్రి మెయిన్ గేటు కెదురుగా సినిమా వాల్ పోస్టర్లు అంటించి రంగు రంగుల కాగితాలతో అలంకరించి ఆయా సీజన్లో దొరికే అన్నిరకాల ఫలాలతోను మీ కంటి నిండుగా వుండి – నోటికి విందు చేసే పళ్ళ దుకాణం విదిగా చూసే వుంటారు అది నాదే నా పేరు పానకాలరావు పరిచయస్థులంతా పానకాలూ! అంటారు

ఎక్కువ చదువుకొని బాదపడ్డ మెందుకని పదో తరగతితో చదువు ఆపు చేయించి ఎంత ప్రయత్నించినా చిన్న ఉద్యోగం కూడ రాకపోవటంతో ఈ పళ్ళ దుకాణం పెట్టించాడు మా నాన్న ఆర్నెల్ల క్రితం నా పెళ్ళి కూడ చేసి గుండెపోటుతో ఇటీవలే కన్ను మూశాడాయన

నా దుకాణానికి కుడి ప్రక్క మందుల షాపుంటే – ఎడమ వైపు పున్నయ్య పూలకొట్టు పుల్లయ్య పద్మా బేకరి పాపయ్య పాన్‌షాపు. ఇలా ఒకదాని ప్రక్కనొకటి వున్నాయి

అతను చివరిసారిగా కనిపించిన ఆ సాయంత్రం ఆరు గంటలకు పాపయ్య పాన్‌షాపు దగ్గర సిగరెట్ కాల్చుకుంటూ నిలబడి వున్నాడు ఆ తర్వాత బేరాలు ముమ్మరంగా రావడంతో నేనా గొడవలో పడిపోయ్యాను

ఆ వేళ డిశెంబరు ముప్పై ఒకటేమో – నా పళ్ళ దుకాణం మీదా పున్నయ్య పూల కొట్టు మీదా జనం అప్పటికప్పుడు విరుచుక పడిపోయారు వస్తున్న జనాన్ని చూసి పున్నయ్య కొన్ని పూలగుత్తుల్నీ దండల్నీ తెచ్చి నా దుకాణం దగ్గర పడేశాడు

ఓ పూలగుత్తీ నాలుగు ఆపిల్ పళ్ళూ ఇచ్చేసి తమ పై అదికారుల అనుగ్రహం సంపాదించుకోవాలని వారందరి ఆశా కావచ్చును వారి ఆశలు – అబిప్రాయాలు ఎలైనా మాకా రోజు అమ్మకం మాత్రం బాగుంటుంది అందుకే వచ్చిన మనిషి పోకుండా బేరాలు చూసుకోవడంలో పూర్తిగా లీనమై పొయ్యాను నేను

సుమారు తొమ్మిది గంటల కనుకుంటాను– కొనడానికొచ్చే జనం తగ్గిపోయారు నా దుకాణం లోని ఆపిల్సూ పున్నయ్య తెచ్చి పడేసిన పూలగుత్తులు చాలామటుకు తరిగిపోయాయి మిగిలివున్నవాటని అందంగా కనిపించేలా పేర్చుతూ అప్రయత్నంగా పాన్ షాపు వైపు చూశాను సత్యమూర్తి అనబడే అతను అక్కడే నిలబడి వున్నాడు నేనటు చూడగానే చిన్నగా నవ్వాడు నేనూ పలకరింపుగా నవ్వి నా పని చూసుకుంటూంటే అతన్నా దగ్గరగా వచ్చి చూడు పానకాలూ! అన్నాడు ఎంతో వినయంగా

నా కొంచెం ఆశ్చర్యమనిపించింది ఎందుకంటే ఇదివరకెన్నడూ అతను నన్ను పేరుపెట్టి పిలవలేదు మన్నింపూ చెయ్యలేదు ఆఫీసులో హాయిగా వుద్యోగం చేసుకుంటున్నవాడు అంతటి వినయం నా దగ్గర ఒలకబోయాల్సిన అవసరం ఏమొచ్చిందా అనుకొని ఎమి టీ వేళ కొత్తగా మాట్లాడుతున్నారు? అన్నాను

రాని నవ్వొకసారి బలవంతంగా నవ్వి కొత్త సంవత్సరం అప్పుడే మీకొట్టు దగ్గరకు వచ్చేసినట్టుందే! అన్నాడు

కొత్త సంవత్సరం మాకేమిటండీ! ఆ ఇంక్రిమెంట్లనీ, ప్రమోషన్లనీ ఇలాంటి శుభఫలితాలు పొందేది మీరే చూశారుగా మీ ఉద్యోగస్థులంత ఇవ్వాళ మామీద ఎలా దాడిచేశారో! అన్నాను నవ్వుతూ

ఔను పానకాలూ! నేనూ అందుగురించే ఇంతవరకూ వుండిపోయాను రేపు నా సహోద్యోగులంతా మా ఆఫీసరుగార్ని పూల సువాసనల్లో ముంచి తేల్చి–ఆపిల్ పళ్ళతో అభిషేకం చేసేందుకు తీర్మానించేసుకున్నారు తెల్లారితే పూలూ పళ్ళూ దొరకవేమోనని పదిమందివరకూ ఇప్పుడు నీ దుకాణంలోనే కొనుక్కుపోయారు చెప్పటం ఆపి అతను నావైపు చూశాడు

ఎందుకో ఆక్షణాన అతడి వదనం దీనంగా వున్నట్టు నా కనిపించింది ఇదంతా నాతో ఎందుకు చెబుతున్నట్టు కావలిస్తే తనూ పట్టుకెళ్ళి ఇవ్వొచ్చుగదా ఇతన్నెవరు కాదంటారు? ఇంట్లో బార్యా బిడ్డలకు ఏనాడూ ఒక్క ఆపిల్ కొని పట్టుకెళ్ళని ప్రబుద్ధులు ఎంతమందీరోజు కొని తీసుకెళ్ళలేదు? అందరూ ఇస్తున్నారని బాదపడ్డం దేనికండీ! మీ రూ నాలుగు పళ్ళు కొనిస్తే పోలా! అన్నాను అర నిమిషం తర్వాత

నా కిలాంటి పన్లు చెయ్యడం ఇష్టం వుండదనుకో పానకాలూ! కానీ మా పై అదికారి ఈమధ్య కొత్తగా వచ్చాడు అతనో చండశాసనుడు అదేమిటో అతగాడు నన్ను చూసేసరికి తుఫానొచ్చినప్పుడు విరుచుకపడే సముద్ర కెరటాల్లా–నామీద విరుచుకపడుతున్నాడు కాస్తంత ప్రసన్నం చేసుకుంటే తప్ప రోజూ ఆఫీసుకెళ్ళి పన్చెయ్యడం కష్టమైపోతోంది అని ఆగాడతను

వస్తున్న నవ్వాపుకొని బలేవారు సత్యమూర్తిగారూ! ఈపాటిదాని కింతసేపు ఆలోచనా? రేపటి రోజు దాటిపోతే మళ్ళీ సంవత్సరం వరకూ మీకిలాంటి అవకాశం వస్తుందా? మీకు సంవత్సరం పొడుగునా తిప్పలు తప్పుతాయా? మీకెన్ని కావాలో అన్నీ పట్టుకెళ్ళి ఇవ్వండాయనకు! అన్నాను

అతను మాట్లాడలేదు ఏదో సందేహిస్తూ వుండిపోయాడు ఏమిటలా వుండిపోయారు?రెండు డజన్లు ఇమ్మంటారా? అన్నాను

అమ్మబాబోయ్! అన్నెందుకు పానకాలూ! ఓ అరడజను చాలు కానీ నెలాఖరుకదా నా దగ్గర డబ్బులేదు రేపు సాయంత్రం ఇచ్చేస్తాను! అన్నాడు కాస్త తడబడుతూ

అతను అరువు అడుగుతాడని నేనేమాత్రం ఊహించలేదు ఎట్టి పరిస్థితిలోనూ అరువు ఇవ్వొద్దని ఆ దుకాణం తెరిచిన రోజునే మా నాన్న చెప్పాడు నాకు ఆ రోజువరకూ నే నెవరికీ అరువు ఇచ్చిందిలేదు అందుకే అతడికేం చెప్పకుండా మౌనంగా వుండిపోయాను

రేపు తప్పనిసరిగా ఇచ్చేస్తాను రోజూ వచ్చే నన్నామాత్రం నమ్మలేవా? అన్నాడు మళ్ళీ

ఎంతో దీనంగా అడుగుతున్న అతన్ని చూస్తుంటే నాకు జాలేసింది పాపం సుమారు మూడు గంటలనుంచి నేనిస్తానన్న ఆశతోనే

కాబోలు అలా నిలబడివున్నాడు ఆఫీసులో ఆ చండశాసనుడు మరీ ఇబ్బందిపెట్టేస్తున్నాడేమో అరడజను ఆపిల్స్‌తో అతని కష్టం తీరిపోవచ్చునేమో మహాఅయితే మరో ఇరవై గంటల్లో అతను డబ్బు ఇచ్చేస్తాడు మనిషి-మనిషిని నమ్మకపోతే మానవత్వాని కర్థమేమిటి? అరువు ఇవ్వకూడదన్న నా నిర్ణయాన్ని సడలించుకొని మాట తప్పరు కదా? అన్నాను

ఆఁతమాటవొద్దు పానకాలూ! అలాంటి అలవాటు నాకు లేదు! అన్నాడతను

అతని మాటమీది నమ్మకంతో ఇంకేమనకుండా కావాల్సినవి తీసుకోమన్నాను అరడజను ఆపిల్స్ ఓ పూలగుత్తి తీసుకున్నాడు అరువైనా ఓ రూపాయి తగ్గించి పదిరూపాయలిమ్మన్నాను

సత్యమూర్తి మొహంలో మెర్క్యూరీ లైటు కాంతి కనిపించిందాక్షణాన అతనెంతో కృతజ్ఞతాబావంతో నన్ను చూసిన చూపులు ఇప్పటికీ మర్చిపోలేకపోతున్నాను అదే అతన్ని చివరిసారిగాచూడ్డం ఆ తరువాత మళ్ళీ

ఆగండి ఒక్కక్షణం ఆగండి రోడ్డు కటు ప్రక్క నడిచివస్తున్న అతసఎరు? అతనిలాగే వున్నాడే! నేను పొరపడ్డంలేదుకదా!? లేదు లేదు ఈ నెల్లాళ్ళలో నాకు దృష్టిలోపం వచ్చెయ్యలేదు నేను పొరపడ్డంలేదు అతనే అతను సత్యమూర్తే

హమ్మయ్య ఇన్నాళ్ళకు ఈ పళ్ళదుకాణం పానకాలు జ్ఞాపకం వచ్చినట్టున్నాడు ఒకవేళ ఏ కారణం చేతనయినా అతని కిటు వచ్చే అవకాశం లేకపోయిందేమో! నేనే అపార్థం చేసుకొని అనుమానించానేమో అదేనిజమైతే మీరు నా తొందరపాటును క్షమించగలరా?

కానీ సత్యమూర్తి రోడ్డు కటుప్రక్కనుంచి ఇటుప్రక్క మారలేదు నా దుకాణం వైపు తలైనా తిప్పిచూడ్డం లేదు నా ఊహ తప్పుదారి పట్టింది అతనొచ్చేది నా దగ్గరక్కాదు అతను నా బాకీ తీర్చే ఉద్దేశ్యంలో లేడు ఇంకొక్క నిమిషం ఉపేక్షిస్తే నా దుకాణం దాటి వెళ్ళిపోతాడు సత్యమూర్తి వుండబట్టలేక చప్పట్లుకొట్టి అతడు నావైపు చూడగానే "సత్యమూర్తిగారూ! ఒక్కసారిలా వస్తారా! అన్నాను గట్టిగా

నేనా? అన్నాడతను అక్కడినుంచే

ఔనండీ మీరే ఒక్కసారిలా -రండి! అన్నాను చిరునవ్వుతెచ్చిపెట్టుకొని

క్షణంపాటు తటపటాయించి దుకాణం దగ్గరకొచ్చాడు నాతో నీకేం పని అన్నట్టుగా నావైపు చూశాడు

అతడలా చూస్తుంటే నా బాకీ ఎలా అడగాలో అర్థమైచావలేదు చూడండి మీరు మొన్న డిశంబర్ మొదటివారంలో నాదగ్గర ఆపిల్స్ తీసుకెళ్ళారు! అన్నాను చివరకు

ఆపిల్స్ తీసుకెళ్ళానా తీసుకెళ్తే తీసుకెళ్ళానేమో అయితే ఇప్పుడేమిటి? అన్నాడు కోపంగా

అబాపతు పది రూపాయలు మీరు నాకివ్వాలి మర్నాడే ఇచ్చేస్తానని ఇంతవరకివ్వలేదు కాస్త కోపంగా అన్నాను నేనుకూడా



# గడుసులోకం — బాబు









నీకు జ్ఞాపకశక్తి తగ్గిపోయిందేమో! నేను అప్పుడే ఇచ్చేశాను' అన్నాడతను కుండబద్దలు కొట్టినట్టు

జ్ఞాపకశక్తి తగ్గిపోయిందన్నాడు గానీ నీకు బాకీ ఎమిటన్లేదు-అంతవరకు నయమే మీరు నా కివ్వలేదు' అన్నాను తీక్షణంగా అతడ్ని చూస్తూ మళ్ళీ

ఇచ్చానంటూంటే ఇవ్వలేదంటావేమిటి? నువ్వేదో పరాకుపడి దారినపోతున్నవాణ్ణి పిల్చి బాకీ-గీకీ అని మాట్లాడితే మర్యాద దక్కదు అన్నాడు నన్నే బెదరిస్తూ సత్యమూర్తి

నాకు మతిపోయినంతపనైంది మరి కొస్సేపాగితే ఇంతపెద్దమనిషిని పట్టుకొని బాకీ అని వీధిన పెడతావా అని మీరే నన్ను నిలేసేటట్టున్నారు ఎలా మిమ్మల్ని నమ్మించడం? అతను నాకు బాకీ వున్నాడని ఎలా రుజువుచెయ్యటం? నాలో కోపం లావాలా పొంగుకొస్తోంది

మా గొడవ వినికాబోలు కొట్టుదిగి వచ్చిన పున్నయ్య ఏమిట్రా పానకాలూ ఏదో గొడవ పడుతున్నట్టున్నారు?"అన్నాడు నన్ను చూస్తూ

డిశంబరు మూడైన ఒకటిన సత్యమూర్తి ఆపిల్స్ అరువు పట్టుకెళ్ళిన సంగతి పున్నయ్యకుచెప్పాను

నేను ఆపిల్స్ పట్టుకెళ్ళినమాట నిజమేగాని ఆబాపతు పదిరూపాయలు అప్పుడే ఇచ్చేశాను అన్నాడు తన దోరణిలో తను సత్యమూర్తి

సుమారు రెండువందల రూపాయల విలువచేసే బట్టలువేసుకొని-పది పన్నెండు వందల జీతం తెచ్చుకుంటున్న అతగాడు పదిరూపాయలకోసం ఇంతలా బొంకుతున్నాడంటే ఏమనుకోవాలో అర్ధంకాలేదు పోనీ అయిందేదో అయింది వూరుకుందామనుకున్నా నా మనస్సు ఒప్పుకోవడం

## అబద్ధంలో దాగిన నిజం

లేదు డబ్బు ఇవ్వకుండానే ఇచ్చానంటున్న సత్యమూర్తిని చూస్తుంటే-ఆ రోజున అతడు మాట్లాడిన మాటలు తల్చుకుంటే నా ఒళ్ళు కంపర మెత్తిపోతోంది కాని ఏం చెయ్యటం? అతడు ఇవ్వలేదని నిరూపించడానికి నా దగ్గరెలాంటి ఆదారం లేదుమరి

ఇంతలో పున్నయ్య మీరు అప్పుడే ఇచ్చేశా నంటున్నారుకదా అంటే అన్నమాటప్రకారం ఆ మర్నాడే ఇచ్చేశారా? అన్నాడు చటుక్కున

సత్యమూర్తి తడబడుతూ ఒకటి రెండు క్షణాల పాటు ఆలోచించి, ఆఁ ఇప్పుడు నాకు బాగా గుర్తొంది ఏదో పన్నుమూలంగా సంక్రాంతి నాటివరకూ నేనిటు రాలేకపోయాను సంక్రాంతి నాటి ఉదయం మా పాపకు గేనుకొనడాని కెళుతూ ఇక్కడ ఆగి పానకాలుకి ఇరవై నోటిచ్చి మరో అరడజను ఆపిల్స్ కూడా తీసుకున్నాను ఆ డబ్బుతో బాటు తనకు బాకీవున్న పదీ తీసుకొని మిగిలిన నాలుగు రూపాయలు నాకిచ్చాడు అన్నాడు తలెగరేస్తూ

అతడు చెప్పింది వింటూనే ఆశ్చర్యపోతూ పున్నయ్య నేనూ మొహమొహాలు చూసుకున్నాం

అందమైన అబద్ధంతో తన నిజాయితీని నిరూపించుకొని నా బాకీ ఎగ్గొట్టాలని ప్రయత్నించాడే గాని అక్కడే మాకు దొరికిపోయాడు సత్యమూర్తి తను చెప్పిన అబద్ధంలోనే నిజం దాగివున్న విషయం అతడేకోశాన వూహించలేదు పాపం!

మీరు సంక్రాంతిరోజున డబ్బివ్వడం నిజమేకదూ? రెట్టించాడు పున్నయ్య

"అక్షరాలా నిజం' ఏదో 'బుద్ధి తక్కువై అరువు తీసుకున్నందుకు కావాలని నన్ను అల్లరి పెడుతున్నాడు పానకాలు ఒంటరివాణ్ణని అనుకున్నాడేమో-రేపు మావాళ్ళతో చెప్పి ఇతడిసంగతి తేలుస్తాను' అన్నాడు క్రోధంగా నన్నుచూస్తూ సత్యమూర్తి

మీరు మర్యాదగా ఆ పది రూపాయలు ఇవ్వకపోతే ఇప్పుడు మీసంగతి నేనే తేలుస్తాను' కటువైన స్వరంతోఅన్నాడు మా పున్నయ్య

మాటలు జాగ్రత్తగారానియ్' పట్టలేనికోపంతో అన్నాడు సత్యమూర్తి

ఏమిటండీ రానిచ్చేది పొట్టకోసం పళ్ళమ్ముకొని బ్రతుకుతున్న వాడివద్ద పది రూపాయలు అరువుపెట్టి ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తూ ఇంకా పొరుష పడుతున్నారెందుకు? సంక్రాంతినాడు తమరిచ్చిన డబ్బు పుచ్చుకోడానికి పానకాలు అసలు ఈ ఊళ్ళోనేలేడు బోగిరోజున దుకాణం తెరుచుకున్నట్లుంటే- వాడి మామగారొచ్చి పెద్ద గొడవ చేసి తనకూడా వాళ్ల వూరు తీసుకుపోయాడే మీరా పది ఎవరికిచ్చినట్టు? తప్పుడు మాటలు మాట్లాడకుండా ముందా పది రూపాయలూ ఇచ్చెయ్యండి లేదా ఇక్కడి నలుగుర్ని పిల్చి మీ పరువు బజార్లో వేస్తాను' అన్నాడు కళ్ళెర్రజేసి పున్నయ్య

తెల్లబోయిన సత్యమూర్తి ఇక బుకాయించి ప్రయోజనంలేదని గ్రహించాడో నిజంగా పున్నయ్య అన్నంత పనీ చేస్తాడనీ బయపడ్డాడో తెలియదుగాని మళ్ళీ నోరెత్తకుండా జేబులోంచి పది కాగితం తీసిచ్చి తలవంచుకొని గబ గబా వెళ్ళిపోయాడు

వెళ్ళిపోతున్న ఆ (అ) సత్యమూర్తిని చూస్తూ అనుకున్నాను ఇక ఎప్పుడూ ఎవ్వరికీ అరువు ఇవ్వకూడదని □

"షీలా... వికసించిన ఛాయతో వెలిగిపోతూంది
నీ ముఖ సొగసు... చూసిచూసి
మతితప్పి పారేసుకున్నా నా మనసు!"

# ఇతర్లు గుర్తించేలాంటి మెరుగైన వంటి ఛాయను షీలాకి సహజంగా, మృదువుగా సమకూర్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ... అదెలాగో చదవండి.

పెళ్లి కూతురయ్యేది ఒక్క రోజే, కాని భార్యగా వుండేది జీవితాంతం! ఇది అర్థం చేసుకునే షీలా, పెళ్లయ్యాక కూడా ఫెయిర్ అండ్ లవ్‌లీ ప్రతి ఉదయం, రాత్రీ ఉపయోగిస్తూనే వుంది. ఎందుకంటే, వికసించిన వంటి ఛాయ అనే ఓ అమూల్య కానుకని షీలాకి ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ—దాన్ని జీవితాంతం నేస్తంగా ఉంచుకోవాలని ఆమె కోరిక. పెళ్లయి ఎన్నో పౌర్ణమి రోజులు గడిచినా, మీ ఆయన ఇప్పటికీ హనీమూన్ మోహంలోనే మునిగి వుంటే, మీరు మాత్రం ఆ సౌందర్య నిధిని వదులుకుంటారా?

షీలా లాగే మీరు కూడా 'తెల్లని వంటి ఛాయ' అనే కలని నిజం చేసుకోవచ్చు—ఫెయిర్ అండ్ లవ్‌లీతో

## ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం

ఫెయిర్ అండ్ లవ్‌లీ మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయ నివ్వడానికి దీనిలో వుంది ఓ సాటిలేని ఫార్ములా—ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది. ఒకటి ఇది చర్మం అడుగున పనిచేసి శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో.



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడక ముందు



ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడిన తర్వాత



రెండు, దీని డబల్ సన్‌స్క్రీన్ చర్మం, లోనికి చొచ్చుకుపోయి నల్లబరిచే సూర్య కిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది. అంచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్తచర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి. మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే మీ వంటి ఛాయ ఎంతో అందంగా మృదువుగా, తెల్లగా అలాగే నిలిచి వుండటం ఖాయం.

## ఉపయోగించే పద్ధతి

ముఖం, మెడ, చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి. ఇప్పుడు వేళ్లను ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు. భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది.

## సులభంగా లోనికి ఇంకుతుంది

ఫెయిర్ అండ్ లవ్‌లీ ఇంతకు ముందుకన్న ఇప్పుడు మృదువుగా, నేవళంగా ఉంటుంది. అది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోనికి ఇంకుతుంది. త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు. కంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి. శ్రీమతి కవితా కుమార్, ఫెయిర్ అండ్ లవ్‌లీ అడ్వయిజర్, పి. ఓ. బాక్స్ 758, బొంబాయి-400 021

కొత్తది! మరింత మృదువైన

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

వంటి ఛాయ మెరుగుపరిచే క్రీమ్




## వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS FAL 50 2726 TL

సీరియల్

# ప్రతిస్పందన

'అన్నపూర్ణ'




(గత సంచిక తరువాయి)

"హల్లో సౌందర్య గారూ! – కాలేజీ గేటు దగ్గిర పలకరించాడు అనంత్

హల్లో ఇపుడు ఎలావుంది? బాధ తగ్గిందా? – అడిగింది అతని గడ్డం వైపు చూస్తూ

తగ్గిందండీ నిన్ననే కుట్లు తీసేశాడు డాక్టర్ మూడు నాలుగు రోజుల్లో అంతా ఆల్‌రైట్ అవుతుందని చెప్పాడు

పోనీలెండి మీకు దెబ్బతగిలిన రోజు నుంచీ – అంతా నావల్లే జరిగిందని ఒకటే బాధ అనిపిస్తోంది

మీరెందుకండీ ఫీలవటం? అంతా నా అజాగ్రత్త వల్లే జరిగింది డ్రైవింగ్ కొత్త దానికి తోడు ఖంగారు ఏదో స్నేహితుడి స్కూటరు కదా అని వేసుకొచ్చాను నాకు దెబ్బలు తగిలినయ్ కాబట్టి సమస్యలేదు అదే మీకేమైనా జరిగివుంటే – ముందు నేను కటకటాలు లెక్క పెట్ట వలసి వచ్చేది – నవ్వాడు అనంత్

మరెప్పుడూ అలా డ్రైవింగ్ రాకుండా ఏ స్నేహితుడి స్కూటరో వేసుకు రాకండి మళ్ళీ ఎక్కడ యాక్సిడెంట్ చేస్తారో నని నేను ఝడిసి కాలేజీ వదిలిపెట్టి వెళ్ళ వలసి వస్తుంది – సౌందర్య కూడా నవ్వింది

సంఘటన జరిగి అయిదు రోజులైంది

తమ యింటి మీద అవినీతి నిరోధక శాఖ అధికార్లు దాడి చేసిన మర్నాడు–

సిటీ బస్ దిగి నడుచుకొంటూ – పరధ్యానంగానే – కాలేజీ గేటు దాటి లోపలికి వెళ్తోంది ఈలోగా ఓ స్కూటర్ అమిత వేగంగా రావటం సౌందర్యను తప్పించ బోయి – ఆ ప్రయత్నంలో అది అప్‌సెట్ కావటం అంతా తృటిలో జరిగిపోయింది ఆ స్కూటర్‌ను డ్రైవ్ చేస్తున్న అనంత్ గడ్డానికి కోసుగా వున్న ఓ రాయిగుచ్చుకొంది

జరిగిన కథ –9 సాకేత మీద వశీకరణ మంత్రాన్ని ప్రయోగించడానికి ప్రయత్నించి కాలులో మేకు దిగబడిన రవికిరణ్ ఆ గాయాన్ని నిర్లక్ష్యం చేస్తాడు చివరికి పాదం తీసెయ్యవలసి వస్తుంది రవికిరణ్‌కు బవంత ప్రసాద్ రాసిన ఉత్తరం సౌందర్యకు అంది వివరాలు తెలుస్తాయి సాకేతకు ఉద్యోగం వస్తుంది చంద్రిక అనిరుద్ధ్‌లకు పెళ్ళవుతుంది అవినీతి అదికారులు దాడి చేసిన తర్వాత పరోపకార బుద్ధితో శేషాద్రిగారు నిరంజనరావుకు సహాయం చేస్తారు రవికిరణ్‌లో మార్పు వస్తుంది

బొట బొటా రక్తం కారి పోతోంది

తనకు తగిలిన దెబ్బను మరిచి పోయి సౌందర్య గారూ మీకేం కాలేదుకదా? అన్నాడు అనంత్ లేచి

అతడి గడ్డానికి తగిలిన దెబ్బ దానినుంచీ కారుతున్న రక్తం – అది చూసి సౌందర్య ఖంగారు పడటం మొదలు పెట్టింది

అనంత్ గారూ నెత్తురు కారుతోంది ఆ దెబ్బకు ఈ కర్చీఫ్ అద్దం పెట్టుకోండి – తన కర్చీఫ్ యిచ్చింది

ఎంత పని జరిగింది! ముందు హాస్పిటల్‌కు వెళ్ళండి అన్నాడు వాచ్‌మెన్ వచ్చి

ఈలోగా మరికొంత మంది విద్యార్థినీ విద్యార్థులు పోగయ్యారు

ఒకస్నేహితుడు అనంత్‌ను హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళాడు ఆటోలో

అనంత్‌దీ సౌందర్యదీ ఒకటే క్లాసు ఒకటే గ్రూపు

అంతకుముందు ముఖ పరిచయమే తప్ప మాటామంతీ లేదు ఆ అవసరం కూడా రాలేదు

యాక్సిడెంట్ తర్వాత పరిచయం పరామర్శల దాకా వచ్చింది

గడ్డానికి దెబ్బ తగిలిన తర్వాత అనంత్ కాలేజీకి రావటం ఈవేళే

తనవల్లే అతడికి అనవసరంగా దెబ్బ తగిలినట్లు బావించుకున్న సౌందర్యకు మాత్రం అనంత్ పట్ల సానుభూతి లాంటిది ఏర్పడింది ఆ కారణంగానే దెబ్బ తగిలిన మర్నాడు పనికట్టుకొని అతడి రూమ్‌కు వెళ్ళి పరిస్థితి తెలుసుకు వచ్చింది

అనంత్ గాయానికి మూడు కుట్లు పడ్డయ్ జ్వరం కూడా మొదలైంది ఇంజక్షన్‌లు మందులు వాడుతున్నట్లు చెప్పాడు

సంతృప్తి పడింది సౌందర్య

ఇప్పుడు అనంత్ మరి కొంత కోలుకున్నట్లు కనిపించటంతో సౌందర్య మనసు మరింత తేలిక పడినట్లైంది

తర్వాత కూడా సౌందర్య అనంత్ రోజూ ఏదో మిష మీద మాట్లాడు కొంటూనే వున్నారు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సవనిశ్చల ట్రేడింగ్ కంపెనీ – కొన్ని కొన్ని ప్రసిద్ధ తయారీ సంస్థలు వుత్పత్తి చేసే ప్రాడక్ట్స్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్స్ బిజినెస్ టర్నోవర్ దగ్గిర దగ్గిర కోటి రూపాయలు వుంటుంది

అదొక పెద్ద సంస్థ క్రిందే లెఖ్ఖ పదిహేనుమంది వరకు పనిచేస్తున్నారు ●



కంపెనీ నిర్వాహకులు విఠల్‌రావు విజయకుమారి  పెద్దలను కాదని ఇద్దరూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు  చదువు వుంది కాని డబ్బులేదు ఇద్దరు దొరికిన ప్రైవేట్ వుద్యోగాల్లో చేరారు  పొదుపు చేసి కూడబెట్టిన కొద్ది మొత్తంతో చిన్నగా వ్యాపారం ప్రారంభించారు  కలిసివచ్చింది ఈనాడు ఒక స్థితికి రాగలిగారు ఈరోజు వాళ్ళ స్థిరాస్తి విలువ పాతిక లక్షలుంటుంది

అయినా భార్యా భర్తలిద్దరూ వ్యాపారాన్ని అశ్రద్ధ చేయరు తాము బ్రతుకుతూ మరో పది మందిని బ్రతికిస్తున్నామన్న తృప్తి పొందటం కోసం వాళ్ళు సమర్థంగా వ్యాపారాన్ని నిర్వహిస్తున్నారు

సాకేతకు మనసులో ఏదో అసంతృప్తి లాంటిది వున్నా విధి నిర్వహణలో ఎలాంటి లోపం రానీయటం లేదు  ఓ విధంగా చెప్పాలంటే వర్క్ విషయంలో విఠల్‌రావు విజయకుమారిలను ఎంతో మెప్పిస్తోంది

అప్పుడే సాకేత వుద్యోగంలో చేరి ఏడెనిమిది నెలలు అవుతోంది

ప్రస్తుతం సాకేత అంటే విఠల్‌రావు విజయకుమారిలకు ప్రత్యేకమైన అభిమానం  ఆ అభిమానంతోనే సాకేత జీతం ఏడువందల యాభై నుంచీ వెయ్యి రూపాయలకు పెంచారు

నెల జీతం వెయ్యి రూపాయల్లో తన ఖర్చులకు ఓ వంద వుంచుకొని మిగిలినవి ఇంట్లో యిచ్చేస్తుంది సాకేత

అర్థాంతరంగా తండ్రి రిటైర్ అవటంతో మొదట బెంబేలు పడిపోయింది సాకేత

ఇల్లుగడవడం కోసం తమ్ముళ్ళ చదువులు పూర్తై వాళ్ళు బ్రతుకు తెరువు చూసుకొనే వరకూ – తనకు ఈ గానుగెద్దు చాకిరీ తప్పదేమో– అన్నది ఆమె మదిలోని బయం

ఏదో కొంత కాలం చేద్దామని వుద్యోగంలో చేరింది  నచ్చిన వాడు ఎప్పుడు తారసపడితే అప్పుడు పెళ్ళి చేసుకొని జీవితంలో స్థిరపడ వచ్చునని ఆశపడింది అలాంటిది – ఇప్పుడు జరిగిందేమిటి?

ఇలా ఎంతకాలం?  తండ్రి ఏదైనా వుద్యోగం చూసుకొని చేరాలి ఆయనకు అలాంటి వుద్దేశ్యం వుందో లేదో?

ఆలోచనల మధ్య సతమతమై పోతోంది సాకేత ఈ మధ్య

అలాంటిది తండ్రి స్వంతంగా ఒక టైప్ ఇనిస్టిట్యూట్ ప్రారంభించటానికి ప్రయత్నాలు చేస్తుండటం ఆర్థికంగా శేషాద్రి గారు సహాయపడతానని మాట ఇచ్చినట్లు తెలియటంతో ఆమె మనసు కొంత వూరట చెందింది

తనకు ఒకానొక శిక్షపడకుండా తప్పి పోయింది థాంక్ గాడ్ అనుకొంది సాకేత

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ప్రొప్రైటర్స్ రూమ్ ముందే – ప్రక్కగా వున్న స్థలంలోనే సాకేత సీటు

విజయకుమారి గారు డిక్టేట్ చేసిన లెటర్‌ను టైపు చేస్తోంది సాకేత ఆరోజు ఉదయం పదకొండు గంటలవేళ

అదే సమయంలో సాగర్ వచ్చి హలో అని సాకేతను పలకరించి చొరవగా ప్రొప్రైటర్స్ రూమ్‌లోకి వెళ్ళాడు

సాగర్ ప్రమోటర్స్ కంపెనీకి అతడు యజమాని

## ప్రతిస్పందన

సాగర్ తండ్రి అఖిలేశ్వరరావు చాలా మంచి మనిషిగా పేరు పొందాడు 'ఈనాడు నేనింత వాణ్ణి కాగలిగాన్నంటే అంతా అఖిలేశ్వరరావు గారి చలవే ఆయన అందించిన సహాయ సహకారాలను ఏనాటికీ మరిచి పోలేను అని అంటుంటాడు విరల్‌రావు సందర్భం వచ్చినప్పుడల్లా

సాగర్ ప్రమోటర్స్ కంపెనీకి సంబందించిన అన్ని వ్యవహారాలు నిన్న మొన్నటి వరకు అఖిలేశ్వరరావుగారే స్వయంగా చూసుకునేవాడు అలాంటిది ఈ మధ్య ఆయన ఆరోగ్యం ఏమంత బావుండడం లేదు. పూర్తిగా విశ్రాంతి తీసుకోమని డాక్టర్లు సలహా యిచ్చారు ఆ ప్రకారంగా నడుచుకోవటం కోసం 'కంపెనీకి సంబంధించిన అన్ని వ్యవహారాలు శ్రద్ధగా చూసుకోమని - బాద్యతలన్నీ ఒక్కగా నొక్క కొడుకైన సాగర్ భుజస్కందాలపై పెట్టేశాడు అఖిలేశ్వరరావు

సాగర్ ప్రమోటర్స్ కు సంబంధించిన అన్ని లావాదేవీలూ ప్రస్తుతం సాగర్ చేతుల మీదుగానే నడుస్తున్నాయి

నవనిశ్చల ట్రేడింగ్ కంపెనీ కంటే సాగర్ ప్రమోటర్స్ కంపెనీ చాలా పెద్దది

విరల్‌రావు కంటే ఎన్నో రెట్లు ఆస్తి పాస్తులున్నాయి సాగర్‌కు

హైద్రాబాద్‌లో సాగర్ మాన్షన్ అనే అంతస్తుల బవనంవుంది దాన్ని కొన్ని ప్రభుత్వ ప్రైవేట్ కార్యాలయాలకు అద్దెకు యిచ్చేశారు ఇక ఈ సిటీలో నాలుగు పెద్ద బవంతులు అతిథులకోసం ఓ అదునాతన గెస్ట్ హౌస్ స్వగ్రామంలో వరి పొలాలు కొబ్బరి మామిడి తోటలు - పెద్ద వ్యాపారం! సాగర్ వాళ్ళ ఆస్తిపాస్తుల విషయంలో జమీందార్లు కూడా పనికిరారు

సాగర్‌కు తండ్రి అంటే గౌరవంతో పాటు ఓ విధమైన బయం వుంది వ్యాపార వ్యవహారాల విషయంలో తనకు ఏదైనా సమస్య ఎదురైనప్పుడు తండ్రిని సలహా అడగాలంటే అదో రకమైన బెరుకు అందుకే చిన్నప్పట్నుంచీ బాగా తెలిసి వున్న విరల్‌రావు దగ్గిరికి వస్తూంటాడు

విరల్‌రావును అంకుల్ అనీ విజయకుమారిని ఆంటీ అనీ పిలవటం అతడికి అలవాటు వాళ్ళిద్దరి దగ్గిర మంచి చొరవ కూడా వుంది సాగర్‌కు

కంపెనీ వ్యవహారాలన్నీ స్వయంగా తను చూసుకోవటం మొదలు పెట్టాకే సాగర్ నవనిశ్చల ట్రేడింగ్ కంపెనీకి అప్పుడప్పుడు రావటం మొదలు పెట్టింది అంతకుముందు అసలు వచ్చేవాడే కాదు

మొదటి సారి వచ్చినప్పుడు ప్రొప్రైటర్స్ రూమ్ ప్రక్కన టైప్ మిషన్ ముందు కూర్చొని సాకేత కనిపించగానే - నడుస్తున్న వాడల్లా టక్కున ఆగిపోయి ఆమెవైపే కొద్ది సేపు చూస్తూండి పోయాడు సాగర్ తర్వాత స్టాఫ్ అంతా చూస్తున్నారని గమనించి ప్రొప్రైటర్స్ రూమ్ లోకి వెళ్ళి పోయాడు

అందరి ముందూ సాకేతకు లజ్జ అనిపించింది అతడు తన వైపు చూస్తుంటే తనూ అతడి వైపు చూసింది

రంజితాదేవి నవలల్లోని హీరోలాగే - చాలా అందంగా వున్నాడతడు ఎత్తు - ఎత్తుకు తగ్గలావు విలక్షణమైన ముఖం చక్కటి మీసాలు - ఖరీదైన సూట్‌లో చాలా ఆకర్షణీయంగా వున్నాడు

తనూ అతన్ని బాగానే ఆకర్షించినట్లుంది అందుకే కాసేపు అలా చూస్తూండి పోయాడు

తన అందం మీద ఇప్పుడు పూర్తి కాన్ఫిడెన్స్ ఏర్పడింది సాకేతకు

ఇంతకూ అతడు ఎవరు? ఎందుకొచ్చాడు? - అని ప్రశ్నించుకొంది మొదటి రోజు

తర్వాత అతడి పేరు వ్యాపారం ఆస్తిపాస్తుల వివరాలు - అన్నీ తెలిసి అమితంగా ఆశ్చర్యపడింది

అంత గొప్పవాణ్ణి ఆకర్షించ గలిగిందన్న మాట తను! - కొంచెం గర్వం అనిపించింది మరో రోజు -

సాగర్ ప్రొప్రైటర్స్ రూమ్‌లోనే వున్నాడు అయినా అటెండర్ వచ్చి పెన్ను పేడ్ తీసుకొని లోపలికి రమ్మన్నారు అయ్యగారు అని చెప్పాడు సంకోచించకుండానే వెళ్ళింది సాకేత

విరల్‌రావు, విజయకుమారిలు సాకేతకు పరిచయం చేశారు సాగర్‌ను

అంతటి ఆస్తి పాస్తులున్నా ఎలాంటి అహంకారం లేనివ్యక్తి సాగర్ - అనుకొంది సాకేత అందరితోనూ సరదాగా మాట్లాడే మనిషిగా కూడా తోచాడు అతడు

అప్పట్నుంచీ నవనిశ్చల ట్రేడింగ్ కంపెనీకి వచ్చినప్పుడల్లా మొదట హల్లో అంటూ సాకేతను పలకరిస్తాడు సాగర్

సాకేతకు కూడా అతడంటే - ఏదో ప్రత్యేకమైన గౌరవం అంతకుమించిన ఇది

ఎలాంటి వ్యక్తి తారస పడాలని తను ఏళ్ళతరబడి కలలు కన్నదో అలాంటి వ్యక్తే ఇప్పుడు తారసపడ్డాడు ఇది యాదృచ్ఛికమా దైవ సంకల్పితమా?

సాగర్ అంటే తనకు ఏదో బావం వున్నట్లే అతడికీ తనంటే అదో అబిప్రాయ మున్నట్లు కనిపిస్తోంది

ఇది ? అంతవరకు దారి తీస్తుందా?

ఏమో!

సాగర్ తన వాడైతే - అంతకు మించిన అదృష్టం మరొకటి వుంటుందా?

అంతస్తులు అడ్డు తొలగించుకొని తన దరికి చేరతాడా సాగర్?

కొన్ని విధాలుగా ఆలోచిస్తుంటే అన్నీ ప్రశ్నార్థకాలు మరి కొన్ని రీతులుగా ఆలోచిస్తుంటే తీయని అనుభూతులు ఈ మధ్య మాత్రం కొంత హుషారుగానే కనిపిస్తోంది సాకేత చూపరులకు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

బాబీ! నిన్ను చూడటానికి ఎల్లుండి రాజమండ్రి నుంచీ వస్తారు అన్నాడు శేషాద్రిగారు ఆ సాయంత్రం బజారుకు వెళ్ళి వచ్చాక

ఎవరు డాడీ? ఎందుకు రావటం? ఎదురు ప్రశ్న వేశాడు రవికిరణ్

నీకు పిల్లనిస్తామంటున్నారు అమ్మాయి ఇంటర్ ప్యాసైందట

నా అవిటి తనం గురించి వాళ్ళకు తెలుసా?

చెప్పాను విధి వశంగా ఏదో జరిగి పోయింది అయినా ఆ కొద్ది పాటి లోటూ జీవితానికి పెద్ద అనర్హత ఏమీ కాదన్నారు వాళ్ళ అమ్మాయికి కూడా చెప్పారట ఈవిషయం

పెద్దలు బలవంతం చేసి వుంటారు అందుకే అవిటి వాణ్ణైన నన్ను చేసుకోవటానికి తల వూపి వుంటుందా అమ్మాయి ఏదైనా డాడీ నేను ఏ ఆడపిల్లకూ అన్యాయం చేయదలుచుకోలేదు పెళ్ళి చేసుకోవటానికి నాకు అర్హత లేదు మరెప్పుడూ నాగురించి అనవసర ప్రయత్నాలు చేయకండి

-అదే దృఢ నిశ్చయమైనట్లు మాట్లాడాడు రవికిరణ్ మూగవేదనను అనుభవించాడు శేషాద్రిగారు

అవిటి తనం వచ్చింది మొదలు రవికిరణ్‌లో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న మార్పును ఎప్పుడో గమనించాడు శేషాద్రిగారు

అదివరకటిలా హుషారుగా కనిపించడం లేదు కొడుకు ఎప్పుడూ ఏమిటో



ఆలోచిస్తున్నట్లు దిగులు పడుతున్నట్లు వుంటాడు రవికిరణ్ మానసిక వేదనను కన్న తండ్రిగా అర్ధం చేసుకున్నాడు శేషాద్రి తనకు యాదృచ్ఛికంగా ఏర్పడిన అవిటి తనం గురించి వికలాంగుడిగా తన భవిష్యత్తును గురించి బెంబేలు పడి పోతున్నాడు అతడు

కొడుకు దిగులు విచారాలతో కృంగి కృశించి పోకూడదు జీవితం మీద ఏవో ఆశలు కలిగించాలి అతడికి వివాహం జరిగి భార్య వస్తే బ్రతుకుపట్ల ఆసక్తి ఏర్పడవచ్చు

–అలా ఆలోచించి ప్రయత్నంలో పడ్డాడు ఇద్దరు ముగ్గురు మ్యారేజి బ్రోకర్లను సంప్రదించాడు పిల్ల బుద్ధి మంతురాలు సాంప్రదాయికురాలు అయితే చాలు కట్న కానుకలతో సంబంధం లేదు అవసరమైతే కన్యా శుల్కం చెల్లించటానికైనా సంసిద్ధమే అని చెప్పాడు

ఆప్రకారమే ఇప్పుడు సంబంధం వచ్చింది పెద్దగా ఆస్తి పాస్తులు లేవు కట్న కానుకలు యిచ్చుకోలేరు పిల్ల అందంగా వుంటుంది ఇంటర్ చదివింది ఆనవాయితీ ప్రకారం పిల్ల తరపు వాళ్ళు పిల్లణ్ణి చూసుకోవటానికి ఎల్లుండి వస్తున్నట్లు మేరేజీ బ్రోకర్ ఇందాక చెప్పాడు

–మరిప్పుడు చూస్తే కొడుకు ధోరణి మరోలా వుంది

కర్తవ్యం బోధపడటం లేదు శేషాద్రి గార్కి

* * * * * * * * * *

రాత్రి పడుకున్న తర్వాత ఆత్మ విమర్శలో పడ్డాడు రవికిరణ్

ఆ అమ్మాయి ఇంటర్ చదివిందట అందంగా వుంటుంది తన అవిటి తనం తెలిసీ పెళ్ళాడటానికి అంగీకరించిందిట

అయినా తన మనసు అటువైపు మొగ్గటం లేదు ఎందుకని?

తను అవిటి వాడైనంత మాత్రాన వివాహానికి అనర్హుడా? తనకూ పెళ్ళి చేసుకోవాలని వుంది– డాడీ నుంచీ తప్పించు కోవటానికి మాత్రమే వివాహేచ్ఛ లేదని బొంకాడు

మహాత్యం ఏమిటో తెలియదుగాని తన మనసు ఇంకా సాకేత మీదే వుంది

పైకి ఎవరితో ఎన్ని చెప్పినా తన అంతరాత్మ ఆమె పొందునే కోరుతోంది

సాకేత కోసం ఈ జీవితం మొత్తం వేచి వుండటానికైనా – అభ్యంతరం లేదనిపిస్తోంది

జరగదని తెలిసీ – ఏమిటో పిచ్చి

ఓ కాలు పోగొట్టుకున్నా తనకు బుద్ధిరాలేదు

ఏనాటికైనా సాకేత తన ప్రేమను గుర్తిస్తుందేమోనన్నది – రవికిరణ్ మదిలోని చచ్చిపోని ఆశ

* * * * * * * * * *

రోజులు గడిచి పోతున్నయ్

శేషాద్రిగారు తాను అన్న మాటను నిలబెట్టు కున్నాడు ఆయన అందించిన ఆర్థిక సహాయంతో నిరంజనరావు ట్యుటోరియల్ ఇనిస్టిట్యూట్ ప్రారంభించాడు

వాళ్ళ వీధి చివరన మెయిన్ రోడ్డు ప్రక్కనే ఒక చక్కటి పోర్షన్ దొరికింది గుడ్‌విల్ క్రింద మూడు వేలు యిచ్చారు నెలకు మూడు వందల యాభై అద్దె

ఆచుట్టు ప్రక్కల ఎక్కడా వేరే ట్యుటోరియల్ సెంటర్ లేక పోవటంతో నిరంజనరావు పని బిజీ అయింది నెల్లరోజుల వ్యవధిలో నే యాభైమంది రెగ్యులర్ విద్యార్థులు దొరికారు జాబ్ వర్క్ కూడా బాగానే వుంది అంతా శేషాద్రి గారి చేతిచలవే అనుకొంటున్నాడు నిరంజనరావు

ఉద్యోగం మానేసి సాకేతను ట్యుటోరియల్ ఇనిస్టిట్యూట్ వ్యవహారం చూసుకోమని అనలేక పోతున్నాడు నిరంజనరావు ఎందుకంటే కూతురు వుద్యోగం మానేస్తే వచ్చే వెయ్యి రూపాయలు పోతయ్ ఎలాగో అంతా తాను చూసుకో గలుగుతున్నాడు శక్తికి మించి –"చేతకావటం లేదు అని అనిపించిన రోజున ఇనిస్టిట్యూట్ బాధ్యతనంతా సాకేతకు అప్పగించ వచ్చుని చివరికి నిశ్చయానికి వచ్చాడు

* * * * * * * * * *

శేషాద్రిగారు ఐచ్ఛికంగా రిటైర్ కావటానికి ప్రభుత్వం అంగీకరించినట్లు ఆర్డర్సు వచ్చాయి ఆయన ఆఫీసుకు వెళ్ళటం లేదు ఇంటి దగ్గిరే వుండి విశ్రాంతి తీసుకుంటున్నాడు మధ్య మధ్య పల్లెకు వెళ్ళి భూములు చూసుకు వస్తున్నాడు కూతురికి పెళ్ళి చేసి కొడుకును ఒక దారిలో పెట్టాక– తమ మకాం పూర్తిగా పల్లెకు మార్చాలన్నది ఆయన దృడసంకల్పం

* * * * * * * * * *

అనిరుద్ధ్ చంద్రికల దాంపత్యం చూడ ముచ్చటగా వుంది

వాళ్ళ అవ్యాజానురాగం పరస్పరం వాళ్ళు అంద జేసుకుంటున్న విలువ గౌరవం– అవీ చూస్తుంటే సాకేతకు అదోలా వుంటోంది అనిరుద్ధ్‌ను తిరస్కరించి తన పొరపాటు చేసిందా? అని అనిపిస్తోంది ఒక్కోసారి

కానీ అంతలోనే అహంకారం అందమైన తనకు అనిరుద్ధ్‌కంటే అన్ని విధాల గొప్పవాడైన భర్తే దొరుకుతాడు అనుకొని తృప్తి పడుతుంది

అనిరుద్ధ్ వ్రాసిన మరో రెండు నవలలు వార పత్రికలలో సీరియల్స్‌గా వస్తున్నయ్ యిప్పుడు

ప్రస్తుతం సమాజ సత్యం కలం పేరుతో వచ్చే రచనలకు పాఠకులు బ్రహ్మరథం పడుతున్నారు

అదివరకు ఓ నవల వ్రాయటానికి నెలలు పట్టేవి ఇప్పుడు రోజుల వ్యవధిలో నే నవల పూర్తి చేస్తున్నాడు అనిరుద్ధ్ వ్రాసిన వాట్ని తన అందమైన దస్తూరితో వెంట వెంటనే ఫెయిర్ చేసేస్తోంది చంద్రిక

ఇక – రవికిరణ్‌కు అనిరుద్ధ్‌కు సయోధ్య పెరిగింది తరచూ అతడు అనిరుద్ధ్ వాళ్ళ యింటికి రావటం గంటలతరబడీ కూర్చోవటం సాహిత్యానికి




సంబంధించి వాద ప్రతివాదనలు చేయటం జరుగుతోంది

అనిరుద్ధ్ రచనలను తెగ మెచ్చుకుంటున్నాడు రవికిరణ్ యిప్పుడు

మధ్య మధ్య అనిరుద్ధ్ రవికిరణ్‌కు సంబందించి వ్యక్తిగత విషయాలు కూడా ఎత్తుతున్నాడు

రవికిరణ్ లోగడ తండ్రి తెచ్చిన రాజమండ్రి సంబందాన్ని తృణీకరించిన విషయం సౌందర్య ద్వారా తెలిసింది అనిరుద్ధ్‌కు ఈ జన్మకు పెళ్ళి చేసుకోనని అతడు ప్రతిన చేసినట్లు కూడా చెప్పింది ఆమె

మీ భవిష్యత్ కార్యక్రమం ఏమిటి? ఒకరోజున అడిగాడు అనిరుద్ధ్

ఆలోచించలేదు చెప్పాడు రవికిరణ్

పెళ్ళి వద్దన్నారట?

అవును

జీవితంలో స్థిరపడకుండా ఇలా ఎంతకాలం గడుపుతారు? అయినా ఏ వ్యాపకం లేకుండా ఎలా కాలక్షేపం అవుతోంది మీకు?

ఏమి చెయ్యటమా అనే నేనూ ఆలోచిస్తున్నాను

మీ స్వగ్రామం వెళ్ళి వ్యవసాయం చూసుకోండి

ఏదో సరదాకి వెళ్ళి రెండు రోజులు వుండగలం గానీ – పూర్తిగా పల్లెలో వుండలేనండీ ఎందుకంటే చిన్న తనంనుంచీ పట్టణ వాతావరణం లోనే పెరిగాను







## ప్రతిస్పందన

మరి ఏదైనా బిజినెస్

నాకూ అదే ఆలోచన వుంది ఏ బిజినెస్ అయితే నాకు అనుకూలంగా వుంటుందా అని ఆలోచిస్తున్నాను

మాట్లాడలేదు అనిరుధ్

అనిరుధ్‌గారూ! మీవి కొన్ని పుస్తకాలు వున్నయి కదా? అవి ఏ పబ్లిషర్‌కైనా యిచ్చారా?

లేదు ఏం, వాట్ని మీరు అచ్చు వేయిస్తారా?

అవును వాట్ని అచ్చు వేయిస్తే గిట్టుబాటు వుండదంటారా?

గిట్టుబాటు వుండదని కాదు ఓ పబ్లిషింగ్ హౌస్ పెట్టామంటే దాన్ని నిర్వహించుకోవటమే కొంచెం కష్టమేమో?

కానీయండి ఆర్థికంగా నేను తట్టుకోగలను పుస్తకాలు మీరు యివ్వండి పెట్టుబడి నేను పెడతాను లాభం ఇద్దరికీ చెరిసగం ఈ వ్యాపారంలోకి నేను లాభాల కోసం దిగటం లేదు ఏదో ఒక వ్యాపకంలో పడటానికి మాత్రమే

సరే మీ నాన్నగార్ని సంప్రదించండి ఆయన సరే అంటే రంగంలోకి దిగండి" – తన తప్పు లేకుండా చెప్పాడు అనిరుధ్ అందుకు అంగీకరించాడు రవికిరణ్

రవికిరణ్ సాకేతను ప్రేమించి, ఆమె మీద బ్రబక్ విద్య ప్రయోగించటం, ఆ ప్రయోగానికి అతడు పడిన తిప్పలు– భవంత ప్రసాద్ రాసిన వుత్తరం – అన్నీ సౌందర్య ద్వారా తెలిసినా 'ఇది మీ అవివేకం అనవసరపు ఆశలు ఎంతటి మూల్యాన్ని కోరుతాయో అనుభవం మీకు నేర్పింది కదా?' అంటూ అతడికి సర్ది చెప్ప లేక పోతున్నాడు అనిరుధ్ కారణం అందుకు తగిన సందర్భం రాలేదు ఇంత వరకూ

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సౌందర్య, అనంత్‌ల మధ్య స్నేహం అలాగే కొనసాగుతోంది 'మీరు' మీరు' అనుకొనే వాళ్ళిద్దరూ ఇప్పుడు పేర్లు పెట్టి పిలుచుకొని నువ్వు' 'నువ్వు' అనుకుంటున్నారు

వాళ్ళ స్నేహానికి వేరే బాష్యం చెప్పుకోవటం మొదలు పెట్టారు తోటి విద్యార్థినీ విద్యార్థులు

వాళ్ళ వ్యాఖ్యానాలు అనంత్ సౌందర్యల చెవుల దాకా వచ్చాయి

దాంతో అనంత్ కొంచెం ఖంగుతిన్నాడు కానీ సౌందర్య ఏమాత్రం చలించలేదు అనవసరమైన అభియోగాలకు బయపడవలసిన పనిలేదు అన్నది ఆమె సిద్ధాంతం

నలుగురూ అనుకుంటున్నది నిజం చేయాలని అనుకున్నాడేమో అనంత్ ఒకరోజు తన మనసులోని అభిప్రాయం సౌందర్యకు చెప్పేశాడు.

నేను నిన్ను ప్రేమిస్తున్నాను నీ అభిప్రాయ మేమిటి?

నవ్వింది సౌందర్య

ఇంకానయం నా అభిప్రాయం కూడా ఏమిటి?' అని అడిగారు అలా కాకుండా ఏకపక్షంగా 'నిన్ను ప్రేమించేస్తున్నాను పెళ్ళి చేసేసుకో నన్ను' అని అనలేదు అంది

నిజం సౌందర్యా! నీవు నాకు అన్ని విధాలా నచ్చావు చాలా విషయాల్లో మనిద్దరి అభిప్రాయాలూ కలిసినయి

నిజమే వ్యక్తిగతంగా మీరూ నాకు నచ్చారు అయితే ప్రేమ మీద నాకు నమ్మకంలేదు

అంటే? నన్ను అనుమానిస్తున్నావా?

నో నో నమ్మకం లేకపోతే మీతో స్నేహం చేసేదాన్నే కాదు

మరి?'

తల్లిదండ్రులు – వాళ్ళు చేసే నిర్ణయాలకు నేను కట్టుబడి వుంటాను ప్రపంచంలోని అందరు ప్రేమికుల గురించి నేను వ్యాఖ్యానాలు చేయను నా విషయం వరకే నేను ఆలోచిస్తున్నాను మాట్లాడుతున్నాను నా శ్రేయస్సు నా కంటే నా తల్లిదండ్రులకే ఎక్కువ తెలుసు మీరు నాకు ఎలాగో నచ్చారు కనుక మీ విషయం వాళ్ళకు చెబుతాను వాళ్ళు వెళ్ళి అన్ని పరిస్థితులూ తెలుసుకొని, మీ పెద్దలతో మాట్లాడాకే మిమ్మల్ని ప్రేమించే విషయంలో నా నిర్ణయం చెబుతాను"

సౌందర్య నిర్ణయానికి అంగీకారం తెలిపాడు అనంత్ తమ వూరు తల్లిదండ్రుల వివరాలు అన్నీ చెప్పాడు మీ మమ్మీ డాడీ ఓ కె అంటే వెంటనే పెళ్ళి చేసుకుంటావా?' అని అడిగాడు

తర్వాత ఆలోచిస్తాను మా మమ్మీ, డాడీలకుమీ గురించి సదభిప్రాయం ఏర్పడక పోతే మాత్రం నిర్మొహమాటంగా మిమ్మల్ని తిరస్కరించేస్తాను మీతో గల స్నేహాన్ని కూడా వదులు కుంటాను అంటూ హెచ్చరిక కూడా చేసింది సౌందర్య

అలాగే నీ మాటలకు నేను కట్టుబడి వుంటాను అలాగే నా మాటలకూ నీవు కట్టుబడి వుండాలి – అనంత్ కూడా కొంచెం గట్టిగానే అన్నాడు

'చూద్దాం అని వూరుకొంది సౌందర్య

(ఇంకా ఉంది)

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## నీకు నేనున్నాను తల్లీ!

అది ప్రసూతి గృహం అక్కడ జరిగేది జీవన పోరాటం పురుడు పునర్జన్మ అని తెలిసినా భార్గవి ధైర్యం కోల్పోలేదు మరో జీవికి ప్రాణం పోస్తున్నందుకు గర్వపడుతోంది ఒక విధంగా సృష్టికర్తకు, సాయం చేస్తోంది జీవన పోరాటంలో అలసి పోతోంది కన్నులు మూసుకుని పోతున్నాయి చెవులలో హోరు వినిపిస్తోంది చుట్టూ నర్సుల హడావిడి లీలగా వినపడుతోంది ఎవరిదో చల్లని స్పర్శ నర్సుల మాటలు బట్టి డాక్టరని అర్థమవుతోంది

సిజేరియన్ తప్పదు భర్త నుండి పర్మిషను లెటరు సంతకం చేయించి తీసుకురండి అది డాక్టర్ గొంతు

వద్దు వద్దు! అని అరవాల నుంది కాని గొంతులో నుండి మాట బయటకు రావడమే కష్టంగా ఉంది సిజేరియన్ చేస్తే శిశువుకు గీసుకుని పోతుందేమో? తల్లి మనసు ఆరాట పడుతోంది

సంతకం చేసారా! కమాన్! హరియప్ అనస్థీషియా స్టార్ట్ చెయ్యాలి భార్గవి మైకంలో పడిపోయింది

అమ్మా! ఎవరో పిలుస్తున్నట్టుంది ఇది వరకు విన్న గొంతుకాదు అమ్మా! పిలుపు మదురంగా ఉంది అమ్మా నేనమ్మా, నీ పాపను! నాగురించి భయపడకమ్మా! కత్తుల బోను లాంటి ప్రపంచంలోకి రాబోతున్నాను నాకు ఊపిరి పోయాలనే కత్తులు నన్నేమి చేయలేవు అయినా నాకు బాహ్య ప్రపంచంలోకి రావాలని లేదు నేను భూమి పైన పడ్డ మరుక్షణమే తల్లి



నయానన్న నీ సంతోషం పటాపంచలవుతుంది కారణం నేను ఆడపిల్లను నీకు నాలో కనబడేది లక్ష్మి కళకాదు– వరకట్న పిశాచి! నీ ఆశలు కోరికలు చంపుకుని నా కొరకై డబ్బు వెనకేయాలి చీర కొనుక్కుందామన్నా నగ కొనుక్కుందా మన్నా పదుగురిలో దర్జాగా ఉండాలన్నా నా పెండ్లి నీకు అనుక్షణం గుర్తుకు వచ్చి నీ కోరికలను మనసులోనే అణచుకుంటావు మరి నా ఉనికి నీకు కష్టం కాదూ? సమాజంలో అడుగడుగునా ఆడపిల్లకు అవరోధాలు ఎదురవుతాయి నీ అండదండలు ప్రతి అడుగులో అందించడానికి నీ నేర్పు ఓర్పు కుప్ప పోసినా చాలదు మరి నన్ను రమ్మంటావా'

ఆలస్యమెందుకవుతోంది అనుకుంటూ హడావిడి పడుతున్నాడు భార్గవి భర్త తల్లి ఆహ్వానం కోరుతోంది శిశువు భార్గవికి వింతగా ఉంది తను నిర్వర్తించ బోయే బాధ్యతలను వెన్ను తట్టి జ్ఞాపకం చేస్తున్న తన శిశువు ఆడపిల్ల అయితేనేం! అనుక్షణం తాను కంటికి రెప్పలా కాపాడి, వరకట్న పిశాచానికి ఎదురొడ్డి నిలవగల ధైర్య వంతురాలిని తయారు చేయగలదు

రా తల్లీ! నీకు ఆత్మస్థయిర్యం ఊపిరి పోస్తున్నాను చేతులు చాచింది భార్గవి క్యార్ మన్న పసిబిడ్డ ఏడుపు ప్రసూతి గృహమంతా ప్రతిధ్వనించింది



ఆడబిడ్డ నర్సు భార్గవి భర్తకు చెప్తోంది ఎవరయితేనేం తల్లి బిడ్డ క్షేమంగా వున్నారు అదే పదివేలు' మనసులోనే ఏడు కొండల వానికి మ్రొక్కుకున్నాడు భార్గవి భర్త

మగతగా ఉంది కదిలితే నడుములో నరాలు తెగినంత బాధగా ఉంది ఇంత వరకు బవిష్యత్తును కాచి వడబోసినట్టుగా ప్రశ్నించిన గొంతు ఇప్పుడు వినబడ్డం లేదు కాని అదే సన్నని గొంతు ఇప్పుడు క్యార్ – క్యార్ మంటోంది

చిన్నగా కండ్లు విప్పింది భార్గవి కండ్లయినా సరిగా తెరవలేక బాహ్య ప్రపంచమంటే బయమన్నట్టుగా ఏడుస్తోంది చిన్నారిపాప! నీకు నేనున్నాను తల్లీ! అనుకుంటూ బుల్లి బుల్లి చేతిలో చెయ్యివేసి ఆప్యాయంగా ఆడిమింది భార్గవి

సి ఉమాదేవి, శ్రీనగర్‌కాలనీ,
హైదరాబాద్ □

కూపన్

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు ____________________

__________________________________________

పూర్తి చిరునామా ____________________

ఎన్ కోడ్ ____________________

# ఎన్‌కౌంటర్

## తిరుమలశ్రీ

సూర్యుణ్ణి ఎవరో కత్తితో పొడిచిన కారణంగా పశ్చిమాద్రి ఎర్రబారి పోయింది

ప్రభుత్వం విధించిన కర్ఫ్యూలా దిగంతాలలో చీకట్లు క్రమంగా ప్రాకుతున్నాయి

సమాజపు అట్టడుగు తరగతికి చెందిన బడుగు జీవాల బందిఖానాలాంటి మురికివాడలో

పేవ్‌మెంటుమీది దేవుడి గుడిలా ఇరుకుగా వున్న ఓ గుడిసె

ఆ గుడిసెలోంచి–

గుక్కపట్టి ఏడుస్తూన్న పసిపిల్ల గొంతు చెడిపోయిన ఫ్యాక్టరీ సైరన్‌లా ఆగకుండా వినిపిస్తూనే వుంది

ఏడుపు ఎవరు ఏడ్చినా ఎన్నో రకాలు

ఏ రకపు ఏడుపు ఎందు కోసమో చెప్పడం కష్టం కాదు

ప్రస్తుతం ఆ పసి దాని ఏడుపు ఆకలి గోడు అని స్పష్టమవుతూనే వుంది

అయితే–

స్పష్టం కానిది ఆ ఏడుపును ఎలా ఆపాలా అన్నదే!

దాన్ని వొళ్ళో పెట్టుకుని నిస్త్రాణగా మంచం కోడుకు జారగిలబడిపోయింది ముత్యాలు

గోడు గోడున ఏడుస్తూన్న ఆ పసిదాని గొంతు ఆ తల్లి చెవిలో పడుతూనే వుంది

కాని పసిదాని క్షుద్బాధను ఎలా అరికట్టాలా అన్నదే ఆమె వూహకు అతీతంగా వున్నది

నిరాశామయమయిన మనసుతో అసహాయతతో అశ్రుతర్పణం చేస్తూ నిస్పృహగా చంటిదాన్ని జో కొట్టడం మినహా ఏమీ తోచడం లేదు ఆమెకు

రెండు రోజులుగా పసిదానికి పాలు లేవు

తల్లి కడుపులో మేత పడితే పిల్ల కోసం పాలు చేపుతాయి

కాని మూణ్ణాళ్ళుగా టీ నీళ్ళతో గడిపేస్తోంది ముత్యాలు స్తనాలు వొట్టిపోక ఏమవుతాయి? పిల్లదాని ఆకలి బాధ చూడ్లేక ఎక్కడో కాస్తంత పంచదార అడిగి తెచ్చి నీళ్ళలో కలిపి రెండు రోజులుగా ఆ తీపి నీళ్ళతోటే పసిముండకు నోరు తడుపుతోంది

అభం శుభం ఎరుగని పసిగుడ్డును మోసగిస్తున్నానన్న సంగతి ఆమెను కలచి వేస్తూనే వుంది కాని గత్యంతరం ఏది?

ఆ రోజు ఆ చక్కెర నీళ్ళు కూడా కరువయి పోయాయి

అందుకే కాలే కడుపుతో పిల్ల పెట్టే గోల

దానికితోడు వుదయం నుంచీ పెట్టిపోయే జ్వరంతో మూసిన కన్ను తెరవకుండా పడి వుంది పిల్ల

ఒంటిమీద చేయి వేస్తే కాలిన పెనంమీద వేసినట్టుంది తనకు తెలిసిన వైద్యమేదో చేయబోయింది గాని ఫలితం కనిపించలేదు ఉండుండి పెద్ద పెట్టున వులిక్కి పడడమే కాక పెద్ద పెట్టున గుక్క పట్టి ఏడుస్తోంది పిల్ల

కన్నులు జలపాతా లవుతూంటే మూర్తీభవించిన దైన్యంలా కళ్ళు మూసుకుని వుండిపోయింది ముత్యాలు అయితే–

బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌లా వినిపిస్తూన్న ముసలిదాని సణుగుడు ముత్యాలు బుర్రను కుమ్మర పురుగులా దొలిచేస్తోంది

అరవై ఎళ్ళ ముసల్ది ముత్యాలు అత్తగారు నేలపైన చింకి చాపమీద కడుపులో కాళ్ళు పెట్టుకుని ముడుచుకుని పడుకుంది

వెన్నుకు అంటుకు పోయిన కడుపుతో బడుగు దేహంతో కడుపులో ప్రేగులు చేస్తూన్న ఆర్తనాదాలకు తట్టుకోలేక మాట్లాడే ఓపిక లేకపోయినా ఎలాగో వోపిక చేసుకుని విదిగా సణుగుతూనే వుంది కోడలిమీద

ఆరోజు ముసలిదానికి కనీసం టీ నీళ్ళు కూడా కరువయ్యాయి ఆ రెండు రోజులుగా ఏ పొరుగింటి పుల్లమ్మో ఇరుగింటి ఎల్లమ్మో కాచుకున్న టీ లో ఓ చుక్కతో నాలుక తడుపుకునేది ఆరోజు ఆ ఆశా లేకుండా పోయింది

ఆకలి బాధ అసహాయతా తమపాటుకు తమను గాలికి వదిలేసి తన సౌఖ్యం తాను చూసుకున్న స్వార్థపరుడైన కొడుకుమీద కోపం అన్నీ కలగాపులగమై, కోడలిమీద పగగా మారాయి ముసలిదానికి

ఎలాగో వోపిక చేసుకుని కోడల్ని దుమ్మెత్తి పోస్తూ అవిదంగా తన కసి తీర్చుకోవాలని తాపత్రయపడుతోంది ఆ ముసల్ది ఆకలి బాధ తీర్చుకోలేకపోయినా

ఆడది చేతకానిదైతే మగాడు వూరి తిళ్ళకు ఎగబడక ఏం చేస్తాడు? చేసుకున్న పెళ్ళాం జాణ అయితే ఎంగిళ్ళ అవసరం మొగుడికి ఎందుకు కలుగుతుంది? నా కొడుకును నాకు కాకుండా చేసింది ముదనష్టపుది ముసలిదాన్ని ఆకలితో మాడ్చి చంపితే మహా పాపం చుట్టుకుంటుంది పుట్టగతులు లేకుండా పోతాయి

ఏదేదో సణుక్కుంటూనే వుంది ముసల్ది వోపిక లేకపోయినా తెచ్చుకుని మరీ

అవన్నీ చెవిలో పడుతున్నా బుర్రకు ఎక్కడం లేదు ముత్యాలికి కారణం ఆ బుర్రలో మొగుడే మెదులుతున్నాడు

ముత్యాలు మొగుడు జోగులు వూరి చివర ట్రావెలర్స్ బంగళాలో వాచ్‌మాన్‌గా పని చేస్తున్నాడు

మింగడానికి మెతుకులు చాలకపోయినా వున్న పెళ్ళాం చాలనట్టుగా ఓ వుంపుడుగత్తె కావాల్సి వచ్చింది వాడికి

మబ్బు తునకల మధ్య చందమామలా చింపిరి గుడ్డల్లో చిక్కడిపోయిన అందం ముత్యాలిది చక్కని దుస్తులు కడితే మేకప్ లేకుండానే సినిమా తారలను తలదన్నే సహజ సౌందర్యం ఆమెది

అయితే ముసల్ది అన్నట్టు జాణ తనం ఎరుగని ముత్యాల్ని మోసగించి మరో నెరజాణను మరిగాడు జోగులు

ఆరంభంలో వుపేక్షించినా పెళ్ళాం పతౌనాన్ని అలుసుగా తీసుకుని ఇంటికే తీసుకొచ్చిన మొగుడి మీద తోకత్రొక్కిన త్రాచులా లేచింది ముత్యాలు

ఫలితంగా కాపురం దానింటికాడే పెట్టేసాడు జోగులు పెర్మనెంటుగా ఇంటికి రావడం మానేసాడు

ముత్యాలు ఏడ్చింది

చంటి ఎల్లను చూపించి మొత్తుకుంది

ముసల్ది శాపనార్థాలు పెట్టింది

ఎందరో ఎన్నో విధాలుగా చెప్పి చూసారు

ప్రయోజనం లేకపోయింది

గుండె బండ చేసుకుంది ముత్యాలు

పసిదాన్ని చూసుకుని మనసు వూరట పరచుకుంది

అత్తను అండగా తలచుకుంది

అక్కడా ఇక్కడా పాచి పని చేసుకుంటూ తెచ్చిన తృణంలో ఆ మూడు పొట్టలూ నింపుకోవాలనుకుంది

అయితే

వయసులో వున్న ఆడది అందునా ఇంతో అంతో అందంకల ఆడది గుమ్మం దాటి స్వేచ్ఛగా సురక్షితంగా మనగలిగే అదృష్టం ఈ దేశానికి ఇంకా అబ్బని కారణంగా ప్రతి చోటా చుక్కెదురే అయింది ముత్యాలుకి

మొగుడు వదిలేసిన పెళ్ళాం అంటే బజారున పడ్డ ఆడదానితో సమానం లోకానికి అందుకే ముత్యాలి అగచాట్లు అధికం అయ్యాయి

దాంతో చేసిన చోట చేయకుండా కొత్త చోట్లు వెదుక్కోవలసిన అగత్యం పట్టింది

మగ జనారణ్యంలో మగువస్థానం ఏమిటో స్పష్టంగా తెలిసి వచ్చింది ముత్యాలికి

ఫలితంగా పస్తులు ఆరంభమయ్యాయి

మూడు రోజులనుంచి మరీ ప్రేగు తడవక పోయేసరికి ముసలిదాని గోల ఎక్కువయిపోయింది

పసిపిల్లతో సమానంగా అత్తను చూసుకుంటూన్న ముత్యాలుకి ముసలిదానిమీద కోపం కంటె జాలే కలిగింది ఆ వయసులో పట్టెడు మెతుకులకు పుట్టెడు అవస్థ పడుతూన్నందుకు

కొడుకు దగ్గర కెళ్ళి వాణ్ణి బ్రతిమాలి ఇంటికి తీసుకురమ్మంటూ ఈ మధ్య కోడల్ని పోరుతోంది అత్తగారు

కాని అలా చేయడానికి ముత్యాలికి మనసు వొప్పడం లేదు అందుకే ముసలిదానికి కోపంగా వుంది

అటు కొడుకునీ ఇటు కోడలినీ మార్చి మార్చి

శాపనార్థాలు పెడుతోంది ముసల్ది

తప్పంతా తనదే నన్నట్టు తిట్ల వర్షం కురిపించే అత్త ప్రవర్తన మనసును గాయపరచినప్పుడు మాత్రం నువ్వూ ఆడదానివేకదే అత్తా! అంటూ లోలోపలే బాదపడేది ముత్యాలు ఆమాత్రం అర్థం చేసుకోలేవా అన్నట్టు

కాసేపటికి ఇటు పసిబిడ్డా అటు ముసలి అత్తా సొమ్మసిలినట్టు పడిపోయారు పిల్ల ఏడుపూ అత్త సణుగుడూ ఆగిపోయాయి

జ్వరంతో ప్రేలిపోతూన్న పిల్ల వొళ్ళు చూస్తుంటే బయం అదికమయింది ముత్యాలికి పిల్లను ఎవరికి చూపించాలో ఏం చేయాలో తెలియలేదు డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్ళడానికి పైసలు కావాలి ఏం చేయాలో తోచలేదు ఆమెకు

జోగులు ఇల్లు విడిచి అప్పటికి షూణ్ణాల్లయింది మూ

పిల్లదానికోసం అహం చంపుకుని బర్త దగ్గరకు వెళ్లాలనుకుంది

అప్పటికే బాగా ప్రొద్దు పోయింది

జోగులు పనిచేసే ట్రావెలర్స్ బంగళా ఎక్కడో వూరి చివర వుంది

ఆ రాత్రప్పుడు అంత దూరం అందునా వొంటరిగా వెళ్ళడానికి బయంగానే వుంది అయినా గత్యంతరం శూన్యం

పిల్ల 'రిస్థితి తెగింపును కలిగించింది ఆమెకు

చటుక్కున లేచి నిలుచుంది

బట్టలు నర్దుకుంది

ముసలిదాన్ని లేపి నేనిప్పుడే వస్తాను పిల్లను కాస్త చూసుకోవే అత్తా! అంది

అర్థమయిందో లేదోగాని మగతలోనే చిన్నగా మూలిగింది ముసల్ది

తడికె తలుపు దగ్గరగా వేసి గుమ్మం దాటింది ముత్యాలు కాటుకలా వున్న చీకటిలో అడుగు పెడుతూ

ముత్యాలు బయటకు వచ్చిందో లేదో సన్నగా తుంపర ఆరంబమయింది

★ ★ ★ ★ ★

రెండవ ఆట సినిమా మొదలయి అరగంట అయింది

అంతసేపూ బేరాలకోసం చూసి చూసి చేసేదిలేక ఖాళీ రిక్షాతో తిరుగు ముఖం పట్టాడు రాజు

రోడ్లమీద జనం పలచబడ్డారు

ఇంటి ముఖం పట్టిన రిక్షా కుర్రాళ్ళు కొందరు గొంతెత్తి పాడుతూన్న సినిమా పాటలు వుండి వుండి వినవస్తున్నాయి

కొంత దూరం వెళ్లాక రిక్షా ఆపాడు రాజు

జేబులోంచి బాగా నలిగిపోయిన నోట్లు చిల్లర పైసలూ తీసి లెక్క చూసుకున్నాడు

లెక్కపూర్తి అయ్యేసరికి ఎక్కడలేని నీరసమూ వచ్చేసింది అతనికి ఓ క్షణం తల పట్టుకుని వుండిపోయాడు

బండి అద్దెకే అయిదు రూపాయలు బొర్రు వస్తున్నాయి ఇక గంజీనీళ్ల మాటేమిటి!

రోజు అద్దెలో ఒక పైసా తక్కువయినా పచ్చి బూతులు ఆడతాడు రిక్షా వోనర్ మర్నాటి నుంచి రిక్షా ముట్టుకో వద్దంటాడు రిక్షావాళ్ల కాయ కష్టంతో వొళ్ళు పెంచుకుని బొజ్జబారం చేసుకునే ఆ బారీ కాయానికి పేదవాళ్ల బాదలు అర్థంకావు నోరు విప్పితే బూతులు తిట్టడం మాత్రం వచ్చును!

ఆ అనుబవం అప్పుడప్పుడు రాజుకూ అవుతూనే వుంటుంది కాలే కడుపుతో తూలే శరీరంతో రోజంతా రిక్షా త్రొక్కినా టీనీళ్లకు కూడా మిగలదు ఒక్కోసారి కొడుకు రెండు రూపాయలు తెస్తాడు పిల్లలకు గంజినీళ్ళు కాచి పొయొచ్చునని ఎంతో ఆశతో ఎదురు చూసే రాజు తల్లికి తరచు నిరాశ ఎదురవుతూ వుంటుంది అటువంటప్పుడు సిగ్గుతో తలవంచుకుంటాడు రాజు

రిక్షా అద్దెకు సరిపడా అయినా సంపాదించలేని రోజునకూడా యజమాని ముందు తలవంచు కుంటాడు అతను– అవమానంతో అసహాయతతో

అలాంటప్పుడు పట్టరాని ఆగ్రహం కలుగుతుంది రాజుకు– యజమానిమీదకాదు ఎందుకూ కొరగాకుండా పోయిన తన చదువు మీద పెట్టెలో పెట్టి పూజిస్తున్న డిగ్రీ కాగితం మీద!

డబ్బు మళ్ళీ జేబులో పడేసుకుని నిస్సత్తువగా రిక్షా త్రొక్కనారంబించాడు రాజు అతని బుర్రలో



గతం రిక్షా చక్రాల్లా తిరిగింది

రాజు తండ్రి ఏదో ఆఫీసులో సూపర్వైజర్గా పని చేసేవాడు అతను హఠాత్తుగా బస్ యాక్సిడెంటులో పోవడంతో కుటుంబం నిరాశ్రయంగా రోడ్డున పడింది

అప్పటికి రాజు ఎమ్ ఎ ఫైనలియర్లో వున్నాడు చెల్లెలు టెన్త్ చదువుతోంది తమ్ముడు సెవెన్త్ చదువుతున్నాడు

గత్యంతరంలేక కొన్ని ఇళ్లల్లో పాచి పనికి కుదిరింది రాజుతల్లి తన కడుపు కట్టుకుని పిల్లల్ని పెంచసాగింది

రాజు ఎమ్మే ఫస్ట్లో పాసవడంతో వుద్యోగమే దొరికినంతగా సంబర పడిపోయారంతా అయితే రెండేళ్లకుగాని వారి కలలు ఇంకి పోవడం జరగలేదు ఎక్కడికి వెళ్లినా సిపార్సు సొమ్ములూ తప్ప అర్హతలన్నీ వున్నందుకు సిగ్గు పడడమే కాక విచారించదగిన పరిస్థితి ఏర్పడింది క్రమంగా అది తన చాతకాని తనంగా భావించి తల్లికి ముఖం చూపించడానికి కూడా మనస్కరించని స్థితికి వచ్చాడు రాజు

కుటుంబ పరిస్థితికూడా రానురాను సంకటంగా పరిణమించడంతో చేసేది లేక రిక్షా అద్దెకు తీసుకుని త్రొక్క నారంభించాడు తన విద్య అర్హతలను దాచిపెట్టి రిక్షావాలాగా రూపెత్తాడు రాజు తాను పోస్టు గ్రాడ్యుయేట్ అన్న నిజం తెలిస్తే ఆ రిక్షా కూడా దొరకదని తెలుసు అందుకే ఆ విషయం దాచిపెట్టాడు ఆరంభంలో కొద్ది రోజులు ఆ విషయం తల్లినుంచి దాచగలిగినా చివరకు ఒక రోజున దొరికిపోక తప్పలేదు ఆ నాడు ఆ తల్లి పడిన బాధ ఇంతా అంతాకాదు రిక్షా త్రొక్కడంలో తప్పులేదనీ అది నైచ్యం కాదనీ అదీ ఒక గౌరవనీయమైన స్వేచ్ఛాయుతమైన పని అనీ తల్లికి నచ్చ చెప్పడానికి ఎంతో కష్టపడవలసి వచ్చింది అతను ఏది ఏమైనా పరిస్థితులతో రాజీపడక తప్పలేదామెకు చెట్టంత కొడుకు అంత, చదువూ చదివి చివరకు రిక్షా త్రొక్కుకుంటున్నాడంటే– ఆ చేదు నిజాన్ని ఏ తల్లి భరించగలదు!

ఏదో లారీ ఎదురుగా రావడంతో ఆలో చనల్లోంచి

# ఎన్కౌంటర్

బయటపడి బండి ప్రక్కకు తప్పించాడు రాజు అతని మనసులా భారంగా పెద్దగా చప్పుడు చేసుకుంటూ వెళ్లిపోయింది లారీ

ఇప్పుడు తక్కువయిన సొమ్ముతో యజమానిని ఎలా ఎదుర్కోవాలో తెలియక బెంగ పెట్టుకుంది రాజుకు– బేరాలు దొరకలేదని నిజం చెప్పినా నమ్మడతను డబ్బులు వాడేసుకుని అబద్ధం చెబుతున్నాడనుకుంటాడు. కొందరు అలా చెయ్యడం అబద్ధం కాదు అందుకే నిజం చెప్పినా నమ్మడు అతను

కొందరిలా ప్రయాణీకుల్ని ఎక్స్ప్లాయిట్ చేయడం రాజుకు ఇష్టం వుండదు పేద వారనిపిస్తే అసలు రేటుకు తక్కువే తీసుకుంటాడు కూడాను అంతేకాదు అవినీతి పనులకు తన రిక్షాను వుపయోగపడనివ్వడు

ఆలోచనలలో మునిగిపోయి నెమ్మదిగా రిక్షా త్రొక్కుతూన్న రాజుకు చినుకులు ఆరంభమయి నట్టుగాని తాను మురికివాడ మీదుగా వెళు తున్నట్టుగాని స్పృహలేదు ఆమె రెండు మూడు సార్లు పిలిచిన పిలుపు కూడా చెవిలో దూరలేదు

ఆమె ఎదుటికి వచ్చి నిలుచుని నిన్నే అన్నా' రిక్షా కడతావా? అని అడగడంతో అప్పుడే స్పృహలోకి వచ్చాడు రాజు ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు

చినుకులు అంతకంతకూ పెద్దవి కావడంతో తడుస్తోందామె అసలే నీరసంతో నోట్లోంచి మాట బయటకు రావడంలేదు ఆమెకు దానికితోడు ఆకలితో రోజంతా రిక్షాతొక్కి తొక్కి ప్రొద్దుటినుంచీ టీ నీళ్లతోనే వున్నాడేమో నీరసంతో చెవులు సమ్మె చేస్తున్నాయి మనసు పరాకు చెందింది

చీకట్లో వొంటరిగా వున్న ఆడమనిషిని చూసి అనుమానంగా అడిగాడు ఎక్కడికి వెళ్లాలి? అంటూ

ఊరవతల టి బి దగ్గరకు ఎళ్లాలన్నా' అంది ముత్యాలు

అక్కడేం పని? అన్నాడు అనుమానం పెరగడంతో

మా మావ అక్కడ పని చేస్తన్నాడు ఎల్లకు వొళ్లు తెలీని జొరంగుంది రేగెల్లి మావను తీసుకురావాల డాక్టర్కి సూపించాల అంది ముత్యాలు గభగబా ఆ రాత్రపుడు వూరిచివరకు అతను బేరం కట్టడేమోనన్న భయంతో తన కష్టం చెప్పుకుందామె

అస్పష్టంగా కనిపిస్తోన్న ఆమె రూపము, గొంతులో నీరసము మాటలలో ధ్వనించిన నిజాయితీ చూసి బేరం వొప్పుకున్నాడు రాజు

ఎంత అని కూడా అడక్కుండా ఎక్కి కూర్చుందామె

ఇంత అవుతుందని అతనూ చెప్పలేదు

తనలాంటి పేదవాళ్లన్నా కష్టాల్లో వున్న వాళ్లన్నా ఇట్టే కరిగిపోతాడు రాజు

అందుకే వర్షం అధికమవుతూ వున్నా లెక్క చేయకుండా లేని వోపికను తెచ్చుకుని పెడలి వేసాడు

పేదవాడి బ్రతుకులా భారంగా కదిలింది రిక్షా

* * * * * *

ఆ రోజు ట్రావెలర్స్ బంగళా సందడిగా వుంది

ఉన్నత పోలీసు అధికారులు అక్కడ మకాం వేసారు

పొరుగూర్లో రెండు రోజులుగా గొడవలు జరుగుతున్నాయి ఒక హరిజన బాలికను ఇద్దరు అగ్రకులస్థులు రాక్షసంగా రేప్ చేసిన కారణంగా రెండు తెగల మధ్య గొడవలు రేగాయి తీవ్రమయిన ఆందోళన జరిపినందుకు హరిజనవాడ రాత్రికి రాత్రి తగలడిపోయింది

ఆ అల్లరులను అదుపులో పెట్టే నిమిత్తం పట్నం నుంచి పోలీసు బలగం వచ్చింది ఉన్నతాధికారులు క్యాంప్ వేసారు వాళ్లు ఆ టి బి లో విడిది చేసారు రెండు రోజులుగా

ఎక్కగా వుండే రాజకీయ నాయకుడు పదవి రాగానే దుక్కలా తయారయినట్టు– సన్నగా ఆరంభమైన తుంపర కాస్తా క్రమేపీ పెద్ద వర్షంగా మారిపోవడంతో వాతావరణంలో ఎంతో మార్పు వచ్చింది వర్షం వస్తూ వస్తూ చలినికూడా వెంట బెట్టుకొచ్చింది

అయినా అధికారులకు బాధలేదు చలిని చార్జ్ చేసేందుకు బుద్ధున్నాయి

చలిని మింగేందుకయితేనేమి అలవాటు తప్పి పోకుండానైతేనేమి చుక్క జోరుగా వేసుకున్నారంతా

ఒక చుక్క గొంతు దిగడంతో మరో చుక్క అవసరమయింది

క్షణాలలో ఏర్పాట్లు జరిగిపోయాయి వాచ్మన్ జోగుల్ని చక్కని చుక్క కోసం వూళ్లోకి తరిమారు

వర్షం అధికం కావడంతో వూర్లోకి వెళ్లిన జోగులు అక్కడే చిక్కడి పోయాడు పైగా సర్కారులు విడిచిన చుక్క కొంత గొంతులోకి దూరడంతో వుంపుడుకత్తె వొళ్లో వాలిపోయాడు వాడు

వర్షం పెరుగుతూంటే చలి గిలిగింతలు పెడుతూంటే చుక్కకోసం వెళ్లిన వాచ్మాన్ ఎంతకూ తిరిగి రాకపోయేసరికి అసహనానికి గురయ్యారు అధికారులు



డామిట్! ఏమయ్యాడు వీడు?' అన్నాడు ఎస్ పి అసహనంగా

దార్లో దేన్నో లేప్ చేస తొంగున్నాడేమో!' అంటూ తన విట్‌కి తానే పెద్దగా నవ్వాడు డి ఐ జి

అంతా శ్రుతి కలిపారు

వర్షం మూలాన ఎక్కడో ఆగిపోయి వుంటాడు సార్! కాస్త తెరిపివ్వగానే వచ్చేస్తాడు అంటూ సర్ది చెప్పాడు ఇన్‌స్పెక్టర్

విసుగ్గా వాచ్‌లు చూసుకున్నారంతా. అంతలోనే బయట అడుగుల చప్పుడు వినిపించడంతో ఆత్రంగా గుమ్మం వైపు చూసారంతా చెవులు రిక్కిస్తూ

ఇన్‌స్పెక్టర్ వరండాలోకి వెళ్ళాడు చూడ్డానికి

★ ★ ★

రిక్షా ట్రావెలర్స్ బంగళాని చేరుకునేసరికి త్రొక్కుతున్న రాజే కాక, లోపల కూర్చున్న ముత్యాలు కూడా పూర్తిగా తడిసిపోయింది

నలుప్రక్కలనుంచీ జోరుగా కొట్టే వర్షానికి ఆ ముసలి రిక్షా ఆమెకు పూర్తిగా కాపుదలను ఇవ్వలేక పోందేమో. రిక్షాదిగేసరికి ముద్దయిన దుస్తులు ముత్యాలు వొంటికి అతుక్కుపోయాయి

ఆమె ఇబ్బందిని గమనించి తన చూపుల్ని ఎటో త్రిప్పుకున్నాడు రాజు

కొంచెంసేపు ఆగావంటే మా మావ నడిగి డబ్బులు తెచ్చిస్తానన్నా అందామె

'చేసేదేముంది అన్నట్టు 'సరే'నని తలూపాడు రాజు 'అదో. ఆచెట్టు క్రిందుంటాను అంటూ జోరుగా కురుస్తున్న వర్షాన్ని తప్పుకునేందుకు ట బి ఆవరణలో వున్న రావిచెట్టు వైపుకు రిక్షాతో పరుగెత్తాడు

పరుగులాంటి నడకతో గబగబా బంగాళా వరండాపైకి చేరుకుంది ముత్యాలు

ఒంటికి అతుక్కుపోయిన దుస్తులలో అప్పుడే చేసిన మైనపు బొమ్మలా వుంది ఆమె అజంతా శిల్పాన్ని జ్ఞప్తికి తెస్తున్న ఆమె అందాలు బహిర్గత మవుతున్న శరీరపు వొంపు, సొంపులూ ట్యూబ్‌లైట్ కాంతిలో వింతగా మెరుస్తున్నాయి

బయట మెరుపు మెరిసింది నిషాలో నిండిన ఇన్‌స్పెక్టర్ బుర్రలో నక్షత్రాలు వెలిగాయి

దారితప్పి భువికి దిగివచ్చిన దివిజాంగనలా అనిపించింది ముత్యాలు అతని కళ్ళకు

ఆమె శరీరానికి అతుక్కుపోయాయి అతని కళ్ళు ఆమె శరీరమంతా ఆబగా తడిమేస్తున్నాయి అతని చూపులు

ముత్యాలు అతన్ని చూళ్ళేదు తలవంచుకుని ముద్దయిన చీరెను పిండుకుంటోంది

"వచ్చేసింది సార్! అప్సరస!" అంటూ ఎక్సైట్ మెంటుతో అధికారులకు అనౌన్స్ చేసాడు ఇన్‌స్పెక్టర్

అధికారులంతా ఒక్క అంగలో వరండాలోకి వచ్చారు

అతుక్కుపోయిన ముత్యాలు దుస్తుల్లో ఏదో వెతుక్కున్నారు

తొంగిచూసే యవ్వనం

తడిసిన వొంపులు

కవ్విసూ న్న సొంపులు

వాళ్ళకు వెర్రెక్కించాయి

గుండెలు ఓ క్షణం లయ తప్పాయి

చటుక్కున తలెత్తిన ముత్యాలు వారిని చూసి వులిక్కిపడింది తడిసిన రవికెలోంచి తొంగి చూస్తున్న యవ్వన గిరులకు అప్రయత్నంగా చేతులు అడ్డుపెట్టుకుంది భీతహరిణిలా వారివంక చూసింది

బలవంతం మీద ఆమెమీంచి చూపులు త్రిప్పుకున్నారంతా

ఇన్‌స్పెక్టర్ లోపలినుంచి పంచె, తువాలు తెచ్చి ఆమెకిస్తూ, పాపం. బాగా ముద్దయి పోయినట్టున్నావ్ లోపలికొచ్చి బట్టలు మార్చుకో అన్నాడు

బెదురుగా చూసిందామె

ఆమె చూపుల్లోని సంశయాన్ని గమనించి




పరవాలేదు గదిలోకి వెళ్ళి బట్టలు మార్చెయ్ అన్నాడు డి ఎస్ పి

తటపటాయించిందామె

మా మావ అంటూంటే చలికి గొంతు వణికింది

వణికిపోతున్నావ్ పొడిబట్టలు కట్టుకో అన్నాడు ఎస్ పి

డి ఐ జి మాట్లాడలేదు అతని ఆకలిచూపులు ఆమె అందాన్ని ఆబగా జుర్రేసుకుంటున్నాయి

అంతా పెద్ద మనుషుల్లా కనిపిస్తున్నారు వారిచేత అన్నిసార్లు చెప్పించుకోవడం సబవుకాదు అనుకుందామె

అయితే – వారినుంచి వస్తోన్న ఏదో వింత వాసన ఆమెను భయపెడుతోంది

కాని, ముద్దయిన శరీరం చలితో కొంకర్లు పోతోంది నీరసానికి చలి తోడు కావడంతో తట్టుకోవడం కష్టంగానే వుంది

మావ ఏమూలనున్నాడో తెలీదు

నలుగురు పెద్దబాబులు మంచివాళ్ళలాగే వున్నారు

మూపడు డాలోపల ఎక్కడో వుం ను

మనసు నిబ్బరించుకుంది ముత్యా

బిడియంగానే ఇన్‌స్పెక్టర్ బట్టలు అందుకుంది అతను చూపించిన గదిలో ప్రవేశించి తలుపు మూసుకుంది

ఆ బంగళా బడా బాబులకు ఆశ్రయమిస్తూంటుందని ముత్యాలికి తెలుసు

అయితే, ఆమెకు తెలియనిదల్లా – ఆ గదిలో తలుపు మామూలుదికాదనీ. బయటనుంచి కూడా తెరవడానికి వీలయ్యే కొత్తరకం వన్నదే!

తలుపువైపు వీపుపెట్టి గబగబా తడిచీరెను విప్పేసింది ముత్యాలు

★ ★ ★

రెండు నిముషాల తరువాత ఆగది తలుపు మెల్లగా తెరుచుకుంది

డి ఐ జి చప్పుడు చేయకుండా దొంగలా లోపల ప్రవేశించాడు – వరుసలో మొదటివాడుగా!

★ ★ ★

ఓగంట తరువాత –

వరుసలో చివరివాడిగా గదిలోంచి బయటకు వచ్చిన ఇన్‌స్పెక్టర్–

మైగాడ్! అది చచ్చినట్టుంది సార్! అన్నాడు కంగారుగా

అంత నిషాలోనూ అదిరిపడ్డారంతా

ఒక్క పరుగులో ఆ గదిలో ప్రవేశించారు

నగ్నంగా, నిర్జీవంగా బెడ్‌మీద , పడివుంది ముత్యాలు!

ముక్కు దగ్గర చెయిపెట్టి చూసాడు ఎస్ పి

గుడ్‌గాడ్! నిజంగానే చచ్చిపోయింది! అన్నాడు కించిత్తు భయంగా

పూర్ డెవిల్! అంత అర్భకురాలనుకోలేదు'ప్' అని పెదాలు చప్పరించేసాడు డి ఐ జి

'ఇప్పుడేం చేద్దాం? అన్నాడు ఇన్‌స్పెక్టర్ భయాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ

ఎస్ పి., డి ఐ జి వంక చూసాడు

అంత నిషాలోనూ పోలీసు బుర్ర పని చేస్తున్నట్టుంది– "శవాన్ని సర్వెంట్ క్వార్టర్ వెనుక పడెయ్యండి. వాచ్‌మెన్ తిరిగిరాగానే పీకదాకా పట్టించి గుడ్డలు వూడదీసి శవంమీద పడెయ్యండి వాణ్ణి. మిగతా సంగతి తెల్లవారేక చూసుకుందాం." అన్నాడు డి.ఐ.జి. ఏ మాత్రం తొణక్కుండా.

"ఎక్సలెంట్ అయిడియా సార్!" అంటూ మెచ్చుకున్నారంతా.

ఓసారి ముత్యాలి శవం వంక చూసాడు ఇన్‌స్పెక్టర్.

అంత వరకు నలుగురూ ఏ శరీరంతో ఆడుకున్నారో– ఆ శరీరం ఇప్పుడు చలన రహితంగా పడివుంది.

అసంకల్పితంగానే ఎక్కడో అంత రాంతరాళాల్లోంచి బహిర్గతం కాబోయిన నిట్టూర్పును బలవంతంగా అణచివేసి, ముత్యాలు శవాన్ని చేతుల్లోకి ఎత్తుకున్నాడు ఇన్‌స్పెక్టర్.

*  *  *  *  *

గొప్పోడి ఐశ్వర్యంలో అంతకంతకూ పెరిగి పోతూన్న వర్షపు తాకిడికి తావిచెట్టు క్రింద తలదాచుకున్న రాజుకు తట్టుకోవడం కష్టమయింది. లోపలికి వెళ్ళిన ప్యాసింజర్ ఎంత సేపటికీ తిరిగివచ్చే సూచనలు కనిపించడం లేదు.

ఓ క్షణం ఆమెపట్ల అనుమానం పొడసూపింది గాని, వెంటనే ఆ ఆలోచనను త్రుంచేశాడు– ఆమె రూపము, ప్రవర్తన ఆమె అటువంటి స్త్రీ కాదని చెప్పడంతో వర్షం పెరిగిన కారణంగా భర్త ఆమెను ఆపివుండొచ్చుననుకున్నాడు.

తాను కూడా ఆ బంగళాలో తలదాచుకోవడం మంచిదనిపించింది. రిక్షాలోంచి దిగి బంగళావైపు పరుగెత్తాడు.

వరండాలోకి చేరుకున్నాడేగాని, వర్షపు జల్లు మీద పడుతూనే వుంది. అందువల్ల మూసివున్న తలుపులకు దగ్గరగా జరిగి గోడవారగా నిలుచున్నాడు.

అందుకే– పోలీసు అధికారులు తమ అకృత్యాన్ని ఎంత గోప్యంగా వుంచాలనుకున్నా వారి పలుకులన్నీ రాజు చెవులలో పడనే పడ్డాయి.

## ఎన్ కౌంటర్

తాను విన్నదాన్ని ఆకళింపు చేసుకోవడానికి కొంత సమయం పట్టిందతనికి– ఆ సమాచారాన్ని ఏ విధంగా అన్వయించుకోవాలో, తానప్పుడేం చేయాలో నిర్ణయించుకునే లోపునే, మూసిన తలుపులు తెరుచుకున్నాయి.

ముత్యాలు శవాన్ని మోసుకొస్తూ రాజు దృష్టిలో పడ్డాడు ఇన్‌స్పెక్టర్.

అంతవరకు రాజులో ఏ మాత్రం సందేహం, తటాపటాయింపు వున్నా, ముత్యాలు శవం చూడడంతో అవి పటాపంచలయిపోయాయి.

"ఆగు!" రాజు అరుపు ఆ బంగళాలో మార్మోగింది.

ఇన్‌స్పెక్టర్ త్రుళ్ళిపడి చూసాడు.

"ఆమె కేమయింది?" రాజు ప్రశ్న వురుములా తాకింది.

"చచ్చింది!" నిర్లక్ష్యంగా అన్నాడు నిషా పూర్తిగా దిగని ఇన్‌స్పెక్టర్.

"లేదు మీరే చంపేసారు!" దెబ్బతిన్న బెబ్బులిలా గర్జించాడు రాజు.

"షటప్!" అంటూ అరిచాడు ఇన్‌స్పెక్టర్

"ఎవరు నువ్వు? ఇక్కడి కెందుకు వచ్చావ్?"

ఆ గొడవకు అధికారులంతా అక్కడికి వచ్చారు.

"ఈమె నా రిక్షాలో ఇక్కడికి వచ్చింది. పిల్లకు జ్వరంగా వుందని, ఇక్కడ పని చేస్తున్న తన భర్తను పిలుచుకు వెళ్ళడానికి వచ్చింది. కాని... కాని... మీరు చేసిందేమిటి?.... పెద్ద మనుషులుగా చెలామణీ అయ్యే మీరు ఈమె పైన అత్యాచారం జరిపి హత్యచేసారు!"

రాజు ఒక్కో పలుకూ ఏకులూ గ్రుచ్చుకుంటూంటే తాము తెలుసుకున్న ఆ కొత్త సమాచారానికి నిశ్శబ్దంగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ఆ అధికారులు.

బయట వర్షం మొత్తికొడుతోంది

ఇన్‌స్పెక్టర్ చేతుల్లో ముత్యాలి శవం బరువెక్కుతోంది.

ఆమె బ్రతికున్నప్పుడు తన బరువంతా ఆమె పైన పడేసి ఆమె శరీరంతో ఆడుకున్న ఇన్‌స్పెక్టర్‌కి– ఇప్పుడు నిర్జీవమైన ఆమె శరీరం బరువుగా అనిపిస్తోంది.

ఆ శరీరంలో ప్రాణం వున్నప్పుడు దానితో ఎంత ఎక్కువసేపు ఆడుకుందామా అని వువ్విళ్ళూరిన ఇన్‌స్పెక్టర్– ఇప్పుడు దానిని ఎంత త్వరగా వదిలించుకుందామా అని చూస్తున్నాడు.

రాజు తన దారికి అడ్డు నిలవడంతో నిస్సహాయంగా అధికారుల వంక చూసాడు.

"ఇంత ఘాతుకానికి తలపెట్టిన మిమ్మల్ని వూరికే విడవను. పదిమందినీ పిలిచి భరతం పట్టిస్తాను....." ఆవేశంతో వూగిపోతున్నాడు రాజు.

అంతవరకు పేదలకు సమాజంలోని సోకాల్డ్ పెద్దలవల్ల జరిగిన, జరుగుతూవున్న అత్యాచారాలన్నీ అతని కళ్ళ ముందు గిర్రున తిరగడంతో అతన్ని వుద్రిక్తుణ్ణి చేసాయి.

రానున్న ప్రమాదాన్ని సులువుగానే పసిగట్టారు అధికారులు అంత నిషాలో కూడా.

కన్నులతోనే భాషించుకున్నారు

అధికారుల కనుసన్నలను అర్థం చేసుకున్న ఇన్‌స్పెక్టర్, ముత్యాలు శవాన్ని మెల్లగా క్రిందకు దించాడు.

లోపలికి వెళ్ళి పిస్టల్‌తో తిరిగివచ్చాడు

ఒక అమాయకపు పేద యువతికి జరిగిన అన్యాయాన్ని సహింపజాలక ఆవేశంలో తల మునకలు వేస్తున్న రాజు జరుగబోతున్న దేమిటో గ్రహించేలోపుసే పిస్టల్ ప్రేలడము, బులెట్ అతని కడుపులో దూరడము జరిగిపోయాయి.

అతని ఆర్తనాదం వురుముల్లో కలిసిపోయింది.

*  *  *  *  *

మర్నాడు స్థానిక దినపత్రికలలో వెలువడిన ఈ దిగువ వార్త పతితల్ని స్తబ్ధుల్ని చేసింది–

"గతరాత్రి.... వూరి శివార్లలో వున్న ట్రావెలర్స్ బంగళావద్ద రాజు అనే వుగ్రవాది ఓ హరిజన యువతిపైన అత్యాచారం జరిపి ఆమెను హత్య చేయడమేకాక– అదే బంగళాలో క్యాంపువేసిన వున్నత పోలీసు అధికారులపైన మెరుపుదాడి జరపడంతో పోలీసులు ఎదురు కాల్పులు జరపవలసి వచ్చింది... ఆ 'ఎన్‌కౌంటర్'లో అతను మరణించడం జరిగింది......' □

## తప్పటడుగులు

మనిషి
పరుగెత్తడం నేర్చాడు
కాని
నడక నేర్వలేదు
అందుకే
పైబడుతున్న సమస్యల
పరిష్కారంలో
క్షణ క్షణం
తప్పటడుగులు
అనుక్షణం
పలాయనం!

–అడిగోపుల వెంకటరత్నమ్



## ప్రజలకోసం పి. టి. రెడ్డి ఆర్ట్ మ్యూజియమ్ :-

"నేను రెడ్డి హాస్టలులో 1940లో ఉన్నప్పుడు నా చిత్రాలను గోదాములో పెట్టాను. వర్షానికి అవన్నీ తడిసిపోయాయి. బొంబాయిలో విద్యార్థిగా ఉన్నప్పుడు నేను అద్దెకున్న ఇంటిని ఇంటి యజమానులు మరొకరికి అమ్మివేశారు. నేను ఆ ఇంట్లో భద్రపరచిన చిత్రాలు కూడ ఇంటితో పాటు అమ్ముడుపోయాయి. కొన్నవారు ఆ చిత్రాల విలువ తెలియక కాబాడీ బజారుకు అమ్మేశారు. ఇక లాహోర్‌లో చలన చిత్ర కళా దర్శకుడుగా ఉన్నప్పుడు దేశ విభజన మూలంగా నా చిత్రాలన్నీ వదలిపెట్టి కట్టు గుడ్డలతో రావలసి వచ్చింది కనుక హైదరాబాదులో స్థిరపడిన పిదప చిత్రాలను భద్రపరచడానికి ఒక శాశ్వతమైన స్థానం వుండాలని నిశ్చయించుకొన్నాను. అదే ఈ మ్యూజియం స్థాపనకు కారణం"- అన్నారు సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ పి. టి. రెడ్డి (పాకాల తిరుమలరెడ్డి) హైదరాబాద్ నగరం నడి బొడ్డున నారాయణగూడాలో త్వరలో ప్రజోపయోగానికి అంకితం చేయనున్న తమ కొత్త మ్యూజియం వివరాలు తెలుపుతూ. ఈ మ్యూజియం నారాయణగూడ హైరోడ్డులో కిశోర్ సినిమా పక్కన వుంది. విశాలమైన ముఖద్వారం. ద్వారంపైన, ద్వారానికి ఇరుపక్కలా వర్ణ చిత్రాలు. మరొక ద్వారం దాటి లోపల అడుగుపెట్టగానే ఎడమవైపు చివర మిని ఓపన్ ఎయిర్ థియేటర్. దాదాపు 250 మంది కూర్చుని చూడగల ఆరుబయలు. మినీ థియేటర్‌లో నాటక నాట్య చిత్రకళా ప్రదర్శనాలు చేయవచ్చు. 150 అడుగుల (రన్నింగ్ ఫీట్) స్థలంలో 25 చిన్న పెద్ద చిత్రాలు ప్రదర్శించవచ్చు. మూడు వైపులా మూడంతస్థుల కళాశ్రేణిక. ఇది 850 చదరపు అడుగుల స్థలంలో నిర్మితం. 1500 అడుగుల స్థలంలో (దాదాపు రెండు ఫర్లాంగులకు పైగా స్థలం) ఆరు వందల చిత్రాలను ప్రదర్శించవచ్చు. ఈ మ్యూజియంవల్ల జనానికి ఏమి ప్రయోజనం?- అని ప్రశ్నించాను. కళ మానవుణ్ణి సంస్కారవంతుని చేస్తుంది. కళ మానవుని మనోగతభావాల ప్రకటన- అవి సకల

# హైదరాబాద్ నోట్‌బుక్

కాలాలవి కావచ్చు. ప్రజలు ఇలాటి కళా భాండారాలు చూడడంవల్ల మనస్సు పరిపక్వమై ఉన్నత దృష్టిగలవారవుతారు. పిల్లలు కళా దృష్టి కలిగి ఉత్తమ పౌరులుగా, ఉత్తమ మానవులుగా రూపొందుతారు. ఎలాటి ధన వ్యయం లేకుండా ప్రజలకు కళా రహస్యాలు తెలుస్తాయి. హైదరాబాద్



శ్రీ పి. టి. రెడ్డి

నగరం దక్కన్ కళకు కేంద్రం. ప్రస్తుతం ఈ నగరం తన సంప్రదాయాన్ని కోల్పోతున్నది. జనానికి సమకాలీన కళాధోరణులన్నీ తెలియజేస్తే తమ స్థానమేదో, సంప్రదాయమేదో పదిల పరచుకొంటారు. నేను సమకాలీన కళా దృష్టి కలవాడిని కనుక ఈ మ్యూజియం ద్వారా అన్ని కళా ధోరణులు తెలియజేయడం నా లక్ష్యం - అన్నారు శ్రీ రెడ్డి ఈ మ్యూజియంలో నా చిత్రాలు, స్టిల్ లైఫ్, ల్యాండ్‌స్కేప్, కాంపోజిషన్, తాంత్రిక్, సాంప్రదాయిక, సమకాలీన చంద్రమండల, రాజకీయ, నైరూప్య, కామశాస్త్ర చిత్ర శిల్ప విభాగాలు, ఇతర భారతీయ కళాకారుల కళాఖండాలు, అలతి చిత్రాలు, సమకాలీక భారతీయ, యూరోపియన్ కళా విభాగాలు వుంటాయి. ఈ చిత్రాలను నాలుగు నెలల కొకసారి మార్చుతుంటాము. మూడు సెట్ల చిత్రాలుంటాయి. కళా పాఠశాలా ఉంటుంది- అని మ్యూజియం విభాగాలు వివరించాయి ఆయన పాఠశాల అన్నారే, మీరు నేర్పుతారా?- అనడిగాను. నిజానికి ఎవరూ కళాకారుని సృష్టించరు సృష్టించలేరు నేను సృష్టించను, కళ నేర్పను. కాని మానవులు తమ మనోభావాలు రంగులలో, రూపాలలో ప్రకటించ డానికి అవకాశం కలిగిస్తాను. ఎవరైనా వచ్చి కొంత కాలం వుండి కళ నేర్చుకొనే వసతి కల్పిస్తాను. కళాకారులకు, కళాభిమానులకు, నర్తకులకు ఉచితమైన రేటులో వసతి కల్పిస్తాము ఈ మ్యూజియంలో. కనీసం ఆరేడుమంది ఒకమారు బస చేయవచ్చు. భోజన వసతి వుండదు అన్నారు శ్రీ రెడ్డి. ఒక గ్రాఫిక్ వర్క్‌షాప్ ఉంటుంది. ఇది ప్రభుత్వంనుంచి, ఇతర సంస్థలనుంచి విద్యార్థి వేతనంపొందే పరిశోధక విద్యార్థులకోసం బోధన ఉండదు. వాళ్లు ఎక్స్‌పెరిమెంట్లు చేయవచ్చు. చర్చలు, గోష్ఠులు ఉంటాయి. దీనితోపాటు సర్జనాత్మక దృష్టికలవారందరికీ ఉపయోగపడ డానికి ఆర్ట్ క్లబ్ ఒకటి నెలకొల్పుతాము. ఇది సాయంకాలం రెండు మూడు గంటలు పని చేస్తుంది దీనిలో కళను గురించి చర్చించవచ్చు నెలకొకసారి అందరికీ అందుబాటుగా చర్చావేదిక వుంటుంది- అని తెలిపారు ఆయన. ఇంత పెద్ద సంస్థ నిర్వహణ ఎలా?- అని ప్రశ్నించాను. దీనినొక ధర్మకర్తల సంఘం - ట్రస్ట్ - నిర్వహిస్తుంది. దీనిని చిన్ననాడే కన్నుమూసిన నా కుమారుడు విజయ పేర - విజయ ట్రస్ట్ అని నెలకొల్పుతాను. దీనిలో ఏడుగురు సభ్యులు - నా కుటుంబంవారు, మిత్రులు

పి. టి. రెడ్డి ఆర్ట్ మ్యూజియం ముఖద్వారం



పి. టి. రెడ్డి ఆర్ట్ మ్యూజియం ఆరుబయలు రంగస్థల దృశ్యం.





తెలుగు సాహిత్య సమితి (బొంబాయి) వారు ఇటీవల సినీ నటుడు చంద్రమోహన్‌ను ఘనంగా సన్మానించారు. ఆ సందర్భంలో సినీ నటుడు చంద్రమోహన్, సినీ తార తాళ్ళూరి రామేశ్వరి కలసి తొలిసారిగా నటించిన "వింత మనుషులు" హాస్య నాటిక ప్రదర్శన జరిగింది. ప్రసంగిస్తున్న వారు సమితి అధ్యక్షుడు శ్రీ పి. కృష్ణశర్మ

## వేయి పడగలు

మేము ఎన్నాళ్ళనుండో చదువవలెనని అనుకొంటున్న 'వేయి పడగలు' మా పత్రికలో రావడాన్ని చూసి మేము చాలా ఆనందిస్తున్నాము.

-కురుమేట కిశోర్‌కుమార్, నిర్మల, అవుకు

★ ★ ★

కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయి పడగలు' సీరియల్‌ను అందిస్తున్నందుకు నా అభినందనలు. తెలుగు సాహిత్యము 'కూర' లాంటిదైతే విశ్వనాథ సత్యనారాయణగారి కవితాశైలి "ఉప్పు"లాంటిది. "ఉప్పులేని కూర ఒప్పదు రుచులకు" -ఎస్. మహమ్మద్ రఫీ, కోశీబుగ్గ

★ ★ ★

50 సంవత్సరాల తర్వాత కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయి పడగలు' చదవడం నిజంగా మా అదృష్టంగా భావిస్తున్నాం. ప్రముఖుల సందేశాలతో చాలా చక్కగా వివరిస్తున్నారు. అభినందనలు.

-పోలోజు వెంకటాచారి, హైదరాబాదు

★ ★ ★

మీరు జ్ఞానపీఠ బహుమతిగ్రహీతలైన కవి సామ్రాట్, కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ విశ్వనాథ

# ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

సత్యనారాయణగారి "వేయి పడగలు" నవల తిరిగి ముద్రించడం ఎంతో ముదావహం. ఈతరం రచనలు మాత్రమే తెలిసిన మా యువతరానికి ఆ తరం రచనా సౌష్ఠవాన్ని తెలుసుకునే అవకాశం కలగజేస్తున్న మీకు ధన్యవాదాలు.

-భమిడిపాటి రామకృష్ణ, విశాఖపట్నం

★ ★ ★

'వేయి పడగలు' నవల పునఃప్రచురణ చేస్తున్నందుకు ఎంతో సంతోషంతో కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను. -కె. బి. కృష్ణ, నాగార్జునసాగర్

★ ★ ★

కవిసామ్రాట్ విశ్వనాథవారి "వేయి పడగలు" నవల మరల సీరియల్‌గా ప్రచురించబూనడం, నవతరానికి పరిచయం చేయడం ముదావహం!

-పొన్నా కృష్ణబాబు, పంగిడిగూడెం

## సీరియల్స్

ప్రముఖ సాహితీవేత్త, శ్రీ ఘండికోట బ్రహ్మాజీ రావుగారి "రాగలత" ఇంతవరకూ చదివాక వారికి తెలియని విషయం లేదేమో ననిపిస్తుంది. "సీరియల్స్" ఎన్నుకొనడంతో మీ ప్రతిభ ఆంధ్రులందరకూ జగద్విదితం! బ్రహ్మాజీరావుగారూ జగద్విదితులు! ఇక చెప్పవలసిందేముంటుంది? ఆంధ్ర పాఠకులకో ఆణిముత్యం లభిస్తుంది!

-ఎం. ఎ. రావు, ఖరగ్‌పూర్

★ ★ ★

నటి అశ్విని ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక మా కెంతో నచ్చింది. భవాని కృష్ణమూర్తిగారి 'ప్రత్యూష పవనాలు' చాలా బాగుంది. -వి. శ్రీకాంత్, సూర్యాపేట

★ ★ ★

అందాల నటి అశ్విని ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక అందంగా, ఆకర్షణీయంగా ఉంది. ఆరోహణ ముగింపు నాకు బాగ నచ్చింది. వేయి పడగలు సీరియల్ నన్ను బాగ ఆకట్టుకుంది. -కందాళ శేషగిరి, నల్లగొండ

★ ★ ★

నటి అశ్విని ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక కవిసామ్రాట్ విశ్వనాథగారి వేయి పడగలు సీరియల్‌తో మరింత ఆకర్షణీయంగా వుంది. ప్రత్యూషపవనాలు, ప్రతిస్పందన సీరియల్స్ చాలా ఆసక్తికరంగా ఉన్నవి.

-కనకాల పద్మ, కనకాల సీతా మహలక్ష్మి, షేక్ బేబి, కాజులూరు

## వ్యాసాలు

నటి "అశ్విని" ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో "కె. నాగేశ్వరి" గారి "రామ నామమే మధురం" వ్యాసం ఆధ్యాత్మికంగా వుంది. "కెప్టెన్ షేక్ మౌలాలీ" గారి "కనకభవన్ ఫొటో వ్యాసం అనేక విషయాలు తెలుసుకొనేదిగా వుంది.

-మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

## శీర్షికలు

"చిన్నారి బాలల దీనగాథలు" కఠిన హృదయులైన తల్లిదండ్రుల హృదయాలు కరిగే విధంగా వున్నవి. చివరికి ఈ శీర్షిక చదివైనా కొంతమందికి తెలివి వస్తుందని నా అభిలాష!

-బి. బాలరాజు, కవిత, నారాయణపేట (మహబూబ్‌నగర్) □

ఉంటారు. మ్యూజియం సక్రమంగా నడవడానికి (1) డైరెక్టర్, (2) అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్, - కేర్‌టేకర్ (3) వడ్రంగి, (4) ఎలెక్ట్రీషియన్, (5) ఆర్ట్ రెస్టోరర్, (6) కాషియర్- అక్కౌంటెంట్, (7) ముగ్గురు క్లీనర్లు వుంటారు. వీరి వేతనాలకోసం పది లక్షల నిధిని సేకరిస్తున్నాను. ఇంతవరకు ఐదు లక్షలు సేకరించాను. త్వరలో తక్కినది నా దేశ విదేశ మిత్రుల ద్వారా పూర్తవుతుంది. దానివల్ల వచ్చే వడ్డీతో ఉద్యోగుల వేతనాలు మున్నగు ఖర్చు జరుగుతుంది. ట్రస్ట్ నియమావళి ప్రకారం మ్యూజియం రూపాన్నిగాని, పద్ధతినిగాని మార్చడానికి వీలులేదు. ఏతద్విరుద్ధంగా జరిగితే ఎవరైనా కోర్టుకు వెళ్ళి చర్య తీసుకోవచ్చు. దీనికొక

# హైదరాబాద్ నోట్‌బుక్

లీగల్ ఎడ్వయిజర్, ఎకనామిక్ అడ్వైజర్ వుంటారు. ఈ కేంద్రానికి పాకాల యశోదారెడ్డి పిటిరెడ్డి కల్చరల్ సెంటర్ అని పేరు పెట్టాము- అని అన్నారు శ్రీ రెడ్డి. నేను మ్యూజియం అంతా చూచాను. దాదాపు మూడు గంటలు పట్టింది వివరంగా చూడడానికి. శ్రీ రెడ్డి ప్రతి కళాఖండాన్ని శ్రద్ధగా వివరించారు. నేను దేశమంతా తిరిగాను. కొన్ని విదేశాలూ చూచాను. వ్యక్తిగతమైన ఇంత పెద్ద ఆర్ట్ మ్యూజియం ఎక్కడా లేదు. అందులోను ప్రజలకు అంకితమైనది అసలేలేదు. ప్రారంభోత్సవం ఎదురు చూస్తున్నాము. పునర్దర్శనం ప్రారంభోత్సవంనాడు -అంటూ సెలవు తీసుకొన్నాను.

**ఉపశ్రుతి:-**

ముందుకన్నా ఆరోగ్యవంతులుగా కనిపిస్తున్నారు - అన్నాను కొన్ని నెలల తర్వాత చూచిన ఒక మిత్రునితో. రాష్ట్ర ప్రభుత్వం రోడ్డు రవాణాశాఖ వారి దయ - అన్నారు ఆయన. అదేమిటి? ఆ శాఖ టానిక్కులు, రసాయనాలు అమ్ముతూందా?- అని కుతూహలంతో ప్రశ్నించాను. మంచి టానిక్కే ఇచ్చిందిగా జనానికి. 50 శాతం పైగా బస్సు ఛార్జీలు పెంచింది. బస్సులో వెళ్ళలేక నడక ప్రారంభించాను - అన్నారు ఆయన. వయసు మళ్ళిన వారికి నడక మంచి వ్యాయామం - అన్నారు పక్కన వున్నవారు

-తిరుమల రామచంద్ర

# జీవం ఉట్టిపడేలా చేసే లిరిల్ తాజాదనం.

లిరిల్. ఇప్పుడు హాయిని గొల్పే,
నిలిచి విరిసే కొత్త పరిమళంతో. చురుకుదనంతో,
పులకరింపచేస్తూ, మరింత ఉత్సాహాన్నిస్తూ....
రండి, లిరిల్ తాజాదనపు ప్రత్యేక అనుభూతిని అందుకోండి.

లిరిల్. నిమ్మకాయల తాజాదనపు ఉత్సాహంతో.




లిరిల్
తాజాదనపు సబ్బు



# దూరదర్శనం

లత

నెల రోజుల కిందట గుంటర్ గ్రాస్ అనే జర్మను నవలా రచయితతో పరిచయం చేసిన ఫిలుం మనమొహాన మళ్లీ చుట్టారు. రేపో ఎల్లుండో మరో రచయిత ఫిలిం కూడా చుట్టి మనకి చూపిస్తారు. గుంటర్ గ్రాస్ పేరూ అభిప్రాయాలూ జర్మను యాస ఇంగ్లీషు అవటం వలన అతి జాగ్రత్తగా విన్నాను. ఇది వరకు వ్రాశాను మళ్లీ అనవసరం. గుంటర్ గ్రాస్‌ట... ఇదేం పేరో మరి – అతను అచ్చంగా హిట్లర్‌లా ఉన్నాడు. అందుకే చిరాగ్గా ఉందేమో?

## కష్మ కష్

అనేక భాషల్లో రచయిత్రులు వ్రాసిన కథలు ఈ శీర్షికన ప్రసారం చేస్తున్నారు. కిందటి వారం మాలతీ చందూర్ కథ చూపించారు. ఈ వారం బేటా. మహాశ్వేతాదేవి కథ ఈ మహాశ్వేత నవలలు రెండు తెలుగులోకి వచ్చినయ్. చెయ్యి తిరిగిన రచయిత్రి. 'బేటా' కథలో కొత్త ప్లాటు కన్నకొడుకు తల్లితండ్రుల్ని పాత కొంపలోనే వదిలి వస్తాడు భార్య మూలంగా. భార్యతో మనబ్బాయి కూడా మనల్ని ఇలాగే వదిలి వెడతాడు అని భార్య వచ్చినాక అంటాడు. భయం వేసిన కోడలు అత్తమామల్ని తెద్దామంటుంది – ఇది మన తెలుగు కథ తాత బోలె లాటిది. బాగుంది.

## బుచ్చిబాబు

చివరి భాగం – భారత స్త్రీ తులసి పూజ చేయాలి కనుక హీరోయిన్ పూజ చేస్తుంది... ఈలోగా ఫిలిం తెగి ఫిల్లర్ వేస్తున్నారు. బుచ్చిబాబు పెళ్ళితో రూపకం అయిపోయింది. జంధ్యాల రూపకం బాగుందన్నాడు కాబట్టి... సరే.. ఇంతకూ నవలల తల్లి నోము ఉద్యాపన జంధ్యాల చేయించిందేనా? పాపం మరో హీరోయిన్ త్యాగం చేసి నిరాశలో పడిందా? విన్నకోట విజయరాం కన్న అతని కొడుకు బాగా నటించాడు. తాతగారిలా మంచి నటుడు అవచ్చును.

రాష్ట్రపతి విశాఖపట్నం పర్యటన మీద ప్రత్యేక వార్తా చిత్రం చూపించారు. నౌకాధిపతులకు రాష్ట్రపతి ప్రత్యేక పతాకం బహూకరించారు. ఇది మహాగౌరవంగా భావిస్తారు. భారత సేనాపతి తన అధికారులకు ఆ పతాకం బహూకరించడం సంప్రదాయం – తిరపతిలో ఆలయ సంప్రదాయం ప్రకారం ఆయనను గౌరవించారు – అర్చకులు. ఊడపోయే ముందు వాళ్ళకో ఛాన్సు పాపం. కళాకారులకు రాష్ట్రపతి చేసిన గౌరవం చూసి అయినా అన్నగారు మారతారంటారా? ప్చ్! లాభం లేదు. ఇక భరతనాట్యం ... అసలు నాట్యం గురించి వ్రాయను. మళ్లీ ఎవరో అమ్మడు గెంతుతోంది నాట్యం పేరిట...

## నవతరం

రచన టి. కె. విజయకుమార్.

సంగీతం ఉషాకాంత్.

ఒక పల్లెటూరి పెద్దమనిషి – ఒక పిల్ల మీద కన్నేసి తన పాలేరు కిచ్చి పెళ్ళి చేయమంటాడు. క్లోజింగ్ ఎనౌన్స్‌మెంటు లేకుండా రేపటి కార్యక్రమాల్నీ, ఎడ్వర్టయిజమెంటుల్నీ చూపించారు. టి. వి. వారి టైము సెన్సు చాలా పూర్‌గా ఉంది.

## ఆగదు ఉదయం

స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఆర్. వి. యస్. యన్ మూర్తి- "ఆ పిల్లని పెళ్లి చేసుకోవద్దు" తండ్రి భీకరంగా అంటాడు. "చేసుకుంటాను నీవు తండ్రివి కావు" కొడుకు సమాధానం- "ప్రేమించావా?" తండ్రి- "లేదు" కొడుకు- ఇంతలోకే ఎన్నికల హడావిడి. ఇదీ ఈ వారం గోల. ఆ పిల్ల అమాయకురాలు. ఈ కుర్రాడు సంస్కరిస్తాడని కిందటి వారం అన్నారు. బుద్ధి ఉండీ బ్రతుక నేర్చిన కుర్రాడెవరూ తండ్రి దగ్గర రెడీ మేడ్‌గా ఉన్న పాతిక లక్షల్ని వదులుకోరు. కథలూ, నాటికలూ ఇలా అన్నాచురల్‌గా ఎందుకుంటాయో మరి?

## స్వయంసిద్ధ

–రచన విజయ తెండూల్కర్.

తల్లి దండ్రులొచ్చి పాత నీతులు చెప్పి ఒక ఏడుపు ఏడిచి బస్సెక్కుతారు. 'తూచింతా మత్‌కరో', అంటుంది నిర్మల- డైవోర్సు ఇచ్చాక పాత భర్త దగ్గరికి వెళితే మళ్లీ పెళ్లి చేసుకోవాలా? అవుననుకుంటాను. కథలో ఏ మాత్రం పస లేదు, లతామంగేష్కర్ పాట తప్ప.

'స్వయంసిద్ధ'లో ప్రియ, ఆదిత్య



## సుభాహ్

శివశంకరి.

ఈ సీరియల్ అనవసరంగా మత్తు మందుల ఎడ్రసులూ సుఖాలూ చూపించి యువతరాన్ని చెడకొడుతోందని కొందరు మేధావుల ఉవాచ. కాని భారతదేశంలోకి బ్రౌన్ షుగర్ లాటి పదార్థాలు ఎక్కడి నుంచి వస్తున్నాయి? ఎవరు సప్లయి చేస్తున్నారు? అమ్ముతున్న దేశద్రోహులెవ్వరు? అని ఆలోచించరు. అలా ఆలోచిస్తే ఇది బద్ధకపు భారతదేశం ఎలా అవుతుంది? – సూడో మేధావుల బాధ్యతారహితుల దేశద్రోహుల పుట్ట ఎలా అవుతుంది? రాజీవ్‌జీ ఒక భాగం ఈ సీరియల్ చూసినా చాలు యుద్ధ ప్రాతిపదిక మీద చర్య తీసుకోటానికి. అయినా తీసుకోకపోవచ్చును. ఓ గాడ్ ఈ నా దేశాన్ని రక్షించు – పై చెప్పిన పెద్దమనుషుల నించీ, అర్థంలేని నీతిపరుల నించీ.

మత్తు మందులు వాడిన మగపిల్లలు నపుంసకులవుతారు. అవి దొరక్కపోతే దొంగ తనాలు మొదలెడతారు. తరువాత జైలు. సర్వ భ్రష్టులూ అయి మరణానికి చేరువ అవుతారు. ఆడపిల్లలూ అంతే. కాకపోతే కొంచం స్లో. ఈ సర్వనాశనాన్ని ఆపండి – ఇంగ్లండు లాటి దేశాలు వీటి మీద పూర్తిగా చర్యలు తీసుకుంటున్నాయి. భగవంతుడి దయ వల్ల మనదేశంలో తల్లి ఏడుపునీ, తండ్రి అభిమానాన్నీ గౌరవిస్తున్నారు. భవిష్యత్తులో ఈ స్మగ్లర్లను ఉరి తీయండి. బ్రతికి ఉండగానే పాతి పెట్టండి. ఇది ప్రభుత్వానికి నేను చేస్తున్న వినతి – లేదంటే బహిరంగ లేఖ.

## ఏక్ కహానీ

రచన గోవింద మిశ్రా. ఇది బుందేలుల కథ. పేరు ఫాన్స్. ఒక ఇంట్లో ఇద్దరు దొంగలు దోస్తులమని చెప్పుకుంటూ దొంగతనానికి ప్రయత్నిస్తారు. కాని ఆ ఇల్లాలి ఆదరణ వారి చేత దొంగతనం చెయ్యనీయదు. చివరికి వాళ్ళు వెడుతున్నప్పుడు మళ్లీ ఎప్పుడు వస్తారని ఆ పిల్లవాడు అడుగుతాడు. కథకి హైలైట్ ఆ ప్రశ్న. బాగుంది.

మొన్న శ్రీరామ నవమికీ దశమికీ జరిగిన కల్యాణ పట్టాభిషేక మహోత్సవాలు చూపించారు. హేతువాదులూ నాస్తికులూ కూడా భక్తితో ఆర్ద్ర హృదయాలతో రామచంద్రుని కన్నార్పకుండా చూసేట్లుంది ఆ ఉత్సవం. శ్రీ రామారావు కళాకారుడుగా, భక్తుడుగా, రామపాత్ర ధారిగా శ్రీరాముని పల్లకి మోసి ధన్యుడయినారు. ఈ ప్రభువనించీ ఆయన రాముడిని ఆదర్శంగా తీసుకుని బాగుపడాలని రాముడిని ప్రార్థిస్తున్నాను. రామ కథలో ఎన్ని సుధలు? మరెన్ని మధువులు?

ఆదివారం మంచి ప్రోగ్రామ్స్ ఉంటయ్ అనుకుంటే హై పవర్ ట్రాన్స్‌మిటర్ పుణ్యమా అని దోరియాలు దోరియాలుగా ఉంది టి.వి. స్క్రీన్. మికీ అండ్ డోనాల్డ్ అందరినీ ఆకర్షిస్తున్నది. కుక్క మొహం మీద దోరియాలు... అదో కొత్తగా ఉంది. □



# విమర్శకుల ప్రశంసలు అందుకున్న క్రికెట్ వీరుడు దిలీప్ వెంగ్‌సర్కార్

దేశంలో క్రీకెట్ రంగములో అభిమానము – విమర్శలకు గురి అయిన ఏకైక ఆటగాడు దిలీప్ వెంగ్ సర్కార్ అనవచ్చును. ఆటలో విఫలమైనప్పుడు వెంటనే తీవ్ర విమర్శలను ఎదుర్కొని తర్వాత అద్భుతముగా పరుగులు సాధించి అప్పటివరకు విమర్శించబడినవారిచే కొనియాడబడుట అతని జన్మ నక్షత్ర ఫలితము ఏమో! భారతీయ క్రికెట్ జట్టులో స్థానము స్థిరపరచుకొన్న వెంగ్ సర్కార్ 1956 ఏప్రిల్ 6 న రత్నగిరిజిల్లా రాజపూర్‌లో జన్మించాడు పూర్తి పేరు దిలీప్ బల్వంత్ వెంగ్ సర్కార్ పోటీ సమయములో బీర్ సేవించుట తప్పులేదు కాని క్రీడాకారుడు పొగ పీల్చుటకు అలవాటు పడరాదు అంటాడు ఖాళీ సమయములో గోవాలో సముద్రములో ఈత కొట్టుట అంటే సరదా పడ్తాడు లతా మంగేష్కర్ పాటలంటే యిష్టము కుక్కలను పెంచే అలవాటు కలదు తాను చూచిన సినిమాలలో పడోసన్ మంచి చిత్రము అని అతని అభిప్రాయము

కలకత్తా ఎడన్‌గార్డెన్స్ క్రీడాంగణంలో ఆడాలంటే ఎంతో యిష్టము పోటీలలో పాల్గొను సమయంలో గెడ్డం గీసుకొనుట అనర్థకము అని భావించి పర్యటన సమయములలో గెడ్డం పెంచుతాడు. మకరంద్ వైంగళ్కర్ తన ఆప్త మిత్రుడు అంటాడు. తాను సాధించిన పరుగులలో నాగపూర్ పోటీలో ప్రప్రథమ సెంచరీ చేయుట మరువరానిది. లార్డ్స్‌లో సాధించిన వంద పరుగులు మరువరానివి అంటాడు 1976-77లో న్యూజిలాండ్ యం.సి.సి. పర్యటన సమయములో భారత జట్టులో స్థానము లభించకపోవుట నిరుత్సాహము కలిగించింది. ఇయాన్ బోథమ్ గార్డన్ గ్రీన్‌డ్జె సునీల్ గవాస్కర్, మైక్ హెండ్‌రిక్స్ అజీత్ వడేకర్ అభిమాన క్రీడాకారులు వెంగ్‌సర్కార్‌ను చిన్నవయసులో బొంబాయి కింగ్ జార్జి స్కూలులో చదువుచుండగా గుర్తించి తీర్చిదిద్దిన ఘనత కోచ్ విఠల్ పాటిల్‌కు కలదు. దాదర్ యూనియన్ క్లబ్ మతుంగ జింఖాన జట్లు ఆటగానిగా ప్రతిభ కనపరిచాడు అప్పుడు అతను ఓపెనింగ్ బ్యాట్స్‌మన్ – వికెట్ కీపర్ 16వ ఏట 71 పరుగులు చేసి అందరి ప్రశంసలు పొందాడు సి.కె. నాయుడు ట్రాఫీ పోటీ పాట్నాలో జరిగినప్పుడు



స్కూలులో చదువుకునే రోజుల్లో సందీప్ పాటిల్, వెంగ్‌సర్కార్‌లు.

మహారాష్ట్ర పాఠశాలల జట్టులో ఆడి ఢిల్లీపై 166 పరుగులు చేసాడు. 1974–75 రోహింటన్ బారియా అంతర్ విశ్వ విద్యాలయ పోటీలో వెంగ్‌సర్కార్ 54, 171 పరుగులు చేసి బొంబాయి జట్టు విజయానికి సహకరించాడు. విజ్జీ ట్రాఫీ పోటీలో సెంచరీ చేసి ప్రత్యేక గుర్తింపు పొందాడు. ఆ తర్వాత బొంబాయి జట్టుతో అనేక పోటీలలో ఆడి రికార్డు స్థాయిలో పరుగులు చేసాడు.

వెంగ్‌సర్కార్‌కు భారత జట్టులో స్థానము విచిత్రముగా లభించినది. శ్రీలంకతో ఆడిన టెస్టు పోటీలో 1, 17 పరుగులు చేసి యితర 'ట్రయిల్ ఓపనర్స్'కు ఆదర్శము అయాడు. న్యూజిలాండ్ పర్యటనలో "స్క్వేయిర్ కట్, స్క్వేయిర్ డ్రైవ్‌ల వలన విఫలమయాడు. తర్వాత ఆదే పద్ధతిలో మార్పు చేశాడు. వెస్టిండీస్ పర్యటనలో నాలుగు టెస్టులలో రెండు మాత్రము ఆడగలిగాడు. సరియైన అవగాహన లేక అక్కడ ఆడలేకపోయాడు. జమైకా టెస్టులో 48, కింగ్‌స్టన్‌లో 39, 22 పరుగులు చేసి క్లయివ్‌లాయిడ్ ప్రశంసలు పొందాడు. 1976-77 సీజన్‌లో తొంటి నొప్పి వలన మన దేశ పర్యటన వచ్చిన న్యూజిలాండ్ జట్టుతో ఆడలేదు. ఇంగ్లాండు పర్యటనలో ఒక టెస్టు ఆడాడు. క్రికెట్ ఆటలో ఎవరు తమ స్థానము ఖాయము అనుకొనుటకు వీలు లేదు. ప్రతిభ కలిగియు విఫలమగుటతో ఆస్ట్రేలియా పర్యటనలో జట్టులో ఎంపిక చేయుటకు చర్చ జరిగినది. లార్డ్స్ టెస్టులో సెంచరీ చేసి తిరిగి ప్రశంసలు పొందాడు. ఇంగ్లాండు పర్యటనలో వెంగ్ సర్కార్ ఆటకు మెప్పు లభించినది. మళ్ళీ పాకిస్తాన్‌తో ఆడినప్పుడు ఆట స్థాయి తగ్గినది.

దిలీప్ దీనితో ఒక నిర్ణయానికి వచ్చాడు. స్థిరముగా, పట్టుదలతో ఆడ నిశ్చయించుకున్నాడు. ఎదుటి బౌలరు పద్ధతి ననుసరించి ఆట ఆడుట అమలు చేసాడు. ఇదివరకటిలాగ విఫలమగుట తగ్గినది. 1976 లో 'క్రికెటర్ ఆఫ్ ది ఇయర్'గా గుర్తింపు పొందాడు.

వెంగ్‌సర్కార్ 1976 లో న్యూజిలాండ్‌లో 3 టెస్టులు, వెస్టిండీస్‌తో రెండు, 1978–79 లో ఆరు, 1983 లో పద కొండు, ఇంగ్లాండుతో 1976–77 లో ఒకటి, 1979 లో నాలుగు, 1980 లో ఒకటి, 1981–82 లో ఆరు, 1982 లో మూడు, 1984–85 లో అయిదు, 1986 లో మూడు, ఆస్ట్రేలియాతో 1977–78 లో అయిదు, 1979 లో ఆరు, 1980–81 లో మూడు, 1985–86 లో మూడు, పాకిస్తాన్‌తో 1978 లో మూడు, 1979–80 లో అయిదు, 1982–83 లో ఆరు, 1983 లో ఒకటి, 1984 లో రెండు, 1987 లో ఆరు, వెస్టిండీస్‌తో 1982 లో ఒకటి, 1985 లో ఒకటి, ఆడాడు. 91 టెస్టు పోటీలలో 152 యిన్నింగులలో 16 సార్లు 'నాట్ అవుట్', 5000కు పైగా పరుగులు, 14 సెంచరీలు చేసాడు. 159 పరుగులు వ్యక్తిగత రికార్డు.

చిన్న వయసులో అల్లరి బాలుడుగా ఉన్న దిలీప్ పెద్ద అయాక ఎంతో మార్పు వచ్చినది. సరదాగా మిత్రులతో కాల క్షేపము చేస్తూ హుందాగ యుంటాడు. భారతదేశ జట్టుకి సారథ్యము వహించగలడు.

–ముకరమ్

**Printed and Published for Nageswara Rao Estates Private Ltd by S Nageswara Rao at the Andhra Patrika Press Gandhinagar Vijayawada - 520 003 Acting Editor M Madhava Rao, Chief Editor S Radhakrishna**

**Phones Business 61247 61248 75569 Editorial 75667**